మూలరచన - తమిళము
సి. రాజగోపాలాచారి

# రాజాజీ
# కట్టుకథలు

అనువాదం : టి. వి. రంగాచార్యులు

యం. శేషాచలం అండ్ కంపెని,
మచిలీపట్టణము : మద్రాసు : సికిందరాబాదు

Re. 1—50 NP.

ఆయన అభిమానశిష్యులలో ఒకడు మహాబధిరుడు. గురువులవారి బోధలు అతనికి సరిగా వినిపించనే లేదు. ఏమిచేయడానికీ అతనికి తోచలేదు. "అమూల్యమైన మీ ఉపదేశవచనాలు నా కేమీ వినిపించడంలే" దంటూ అత డొకనాడు గురువుల్రమోల మొరపెట్టుకొన్నాడు. ఇంతలోనే మళ్లీ ఏమనుకొన్నాడో ఏమో "పోనీలెండి. తక్కిన వారికి తాము యథాప్రకారం ఉపదేశం చేస్తూఉండండి. తదేకదృష్టిగా నేను మీముఖం చూస్తూ కూర్చొని ఉంటాను. అంతే నాకు చాలు "నని చెప్పుకొన్నాడు.

"నాయనా! నీ మాటలు నాకెంతో సంతోషం గొలుపుతున్నాయి. నీ సాధుహృదయం మెచ్చుకోదగింది. నీ వేమీ విచారపడవద్దు. నీకుగూడ రోజు కొక ప్రవచనం చొప్పున తాటియాకుమీద వ్రాసియిస్తూ ఉంటాను. వాటిని పెట్టుకొని నీవుకూడ నీ సహాధ్యాయులవలెనే నడచుకొని మనస్సును వికసింపజేసుకొని ఆనందించి తరించు"అని గురువులవారు అతనిని సముదాయించినారు. చెప్పినరీతిగానే చేస్తూవచ్చినారు.

ఆ శిష్యునకుకూడ గురువులవారు ఇస్తూవచ్చిన ఆ తాళపత్రాలను ఏరోజుకారోజుపుచ్చుకొని, అందలి పరమార్థాలను పరమభక్తితో ఎప్పటికప్పుడు శ్రద్ధగా ఆకళించుకొంటూ, ఆపత్రాలను భద్రముగా కట్టిపెట్టుకొంటూ వచ్చినాడు.

ఈ విధంగా మూడేండ్లు దొర్లుకొని పోయినవి. స్వాములవారు పరలోకం వేంచేసినారు. శిష్యుడు నిధినిషేపాలవలె తాను పదిలపరచి పెట్టుకొని యుండిన ఆ తత్వ

బోధతాళపత్రాల నన్నిటినీ పైకితీసి, అచ్చు కిచ్చి, తన గురుబోధలను, గాలికి పోసీకుండా పుస్తకరూపంగా, పది మందికీ ఉపయోగపడేటట్లు, ప్రచురింప బూనుకొన్నాడు. అతని యీ పూనికతో తక్కిన శిష్యులకు కన్నుకొట్టింది. అతని కోరిక కొనసాగనీయకూడదని వారు తీర్మానించు కొన్నారు. ''మన గురువుగారి ఉమ్మడి ఉపదేశవచనాలను వీ డొక్కడూ ప్రచురించడం ఏమిన్యాయ''మని ఆక్షేపించడం మొదలుపెట్టినారు. అంతటితో ఊరుకోలేదు. రాజు గారి వద్దకు వెళ్లి ఫిర్యాదు చేసినారు. తమ ఆక్షేపణను తెలియజేసినారు. ''పదుగురాడుమాట పాటియై ధరజెల్లు'' గదా! రాజుగారు వెంటనే ''పుస్తకం ప్రచురించడానికి వీలులే''దని ఉత్తరువు చేసినారు.

''ఉపదేశవచనాల పత్రాలు గురువుగారు నాకు ఇచ్చినారు. ఆ పత్రసంపుటి నావద్ద ఉన్నది. అది నాసొత్తు. దానిని ససెమిరా మరెవ్వరికీ ఇవ్వనుగాక ఇవ్వ''నని చెవిటి శిష్యుడు పట్టుపట్టి కూర్చున్నాడు.

ఊరు రెండు కక్షులయి పోయింది.

''బంగారువంటి అమూల్యమైన ఉపదేశాలు. భవిష్యత్కాలానికి, భావితరాలవారికి బహు అక్కరకువచ్చే భండారం. నిష్కారణంగా వృథా అయిపోతున్నదే!'' అని ఒకపక్షంవారి వాదన.

''పదిమంది గురువుగారి బోధనలను ప్రచురించే హక్కు వీడికొక్కడికీ ఎక్కడి''దని రెండవపక్షంవారి వాదం.

"నేను చెవిటివాడ నైనందువల్ల నేకదా, నా కోసమే కదా అసలు ఈ ఉపదేశవచనాలు వెలసి, నిలిచిన"వని ఆ శిష్యుడు వాదించుకొంటూవచ్చినాడు. ఇది కొందరికి న్యాయంగానే కనిపించింది.

ఈ వాద ప్రతివాదాలు ముగిసి అంతుపట్టే లోపల అటు ఆ తాళపత్రాలు కాస్తా గుట్టుచప్పుడు కాకుండ, చెద పురుగులకు ఆహుతిఅయి కూర్చున్నాయి. తదుపరి జగడం కూడ సర్దుకొని పోయింది.

ఊరివారు ఆస్వాములవారిని మరవనేమరచిపోయినారు.



# 3. అరటిచెట్టు కథ

ఒకనాడు ఒక ఉడుతపిల్ల ఒక అరటిచెట్టుమీద పురుగుపుట్రల అన్వేషణ గావిస్తూ ఆడుకొంటూఉంది.

"మీఅమ్మ ఏదీ?" అని అరటిచెట్టు దానిని అడిగింది.

"నాకు అమ్మ లేదే!" అని ఉడుత ఉత్తర మిచ్చింది. తనపాటికి తను తనపొట్ట తాను పోసుకొంటూ ఉండినందున ఉడుతపిల్ల తన తల్లిని పూర్తిగా మరచిపోయింది.

"కన్నతల్లి నే నీ విట్లు మరచిపోవచ్చునా? రామ రామ!! నా పిల్లలను చూడు. నన్ను విడువకుండా, నా వేరును అంటిపెట్టుకొనియుండి నా అండను ఎంత గోముగా పెరుగుతున్నవో! నీవుకూడ అట్లా ఉండరాదూ?" అని అరటి దానిని హెచ్చరించింది.

"ఏమో జంభాలు మాట్లాడుతావు! తల్లియేమిటి, తనయులేమిటి? అంతా భ్రమ. మరికొన్నాళ్ళకు చూస్తూ ఉండు. నీకు ఒక కొడుకు పుడుతాడు. వాడు నీప్రాణానికే ముప్పు అవుతాడు"-జోస్యం చెప్పినట్లు చెప్పింది ఆ చిచింద్రీ ఉడుత. అరటిచెట్టుకు దిగులు పట్టుకొన్నది.

* * * *

కొన్నాళ్ళకు—

ఆ అరటిచెట్టు మంచి గెలవేసింది. కాయలు ఎదిగి ముదురు సట్టినవి. కార్తవీర్యార్జునుని కరావళిని తలపిస్తూ కాయపైన కాయగా లెక్కలేనన్ని కాసుకొని వచ్చినవి. తనయుని పెంపుసొంపులు చూచి తల్లి చెట్టుకు ఆనందం పొంగి పొర్లిపోతూ ఉండింది.

ఇట్లుండగా ఒకనాడు ఆ ఉడుత అరటిచెట్టువద్దకు వచ్చింది. "కుశలమా ?" అని ప్రశ్నించింది.

"చూడవయ్యా, మహానుభావా! చూడు. నా కుమారుణ్ణి చూడు. మిసమిసలాడే వాని వన్నెచిన్నెలు చూడు. నా కుశలానికి కొరతేమిటి?" అని రపీమని జవాబిచ్చింది అరటి.

* * * *

మరి కొన్నాళ్ళకే—

"ఆ పాపిష్ఠిఉడుత చెప్పింది ఉత్తమాట కానట్లే కనిపిస్తున్నదే! ఈ కుమారకంఠీరవునితో నా బతుకే చట్టుబండలయ్యేటట్లు తోస్తున్నది. కడుపులో చెయ్యిపెట్టి కలచి

నట్లు ఏమో చేస్తున్నది......అయితే నేమిటి, ఇటువంటి కుమారుడు పుట్టినపిమ్మట నాకు వేరేమి కావలెను?'' అని తలపోస్తూ తలపోస్తూనే తల్లి అరటి క్రమేణా వాలిపో జొచ్చింది.

తోటకాపు వచ్చి గోముగా, జోరుగా కాసిన ఆ అరటిగెలను కాస్తా కోసుకొనిపోయినాడు. ఆ తరువాత— వాడిపోయిన ఆ చెట్టునుగూడ చిన్నెలుసయితం లేకుండా శుభ్రంగా ఛేదించివేసినాడు.

## 4. కల్లు జన్మించిన గాథ

దిక్కు దిక్కులందలి ఋషులూ సమావేశమై, సమాలోచనలు జరిపి ఒక వృక్షాన్ని సృష్టిచేసినారు. తమ జ్ఞాన విజ్ఞానాలు తమతోనే పోకుండా వాటిని తమతరువాతి తర తరాల సంతతికి వ్రాసిపెట్టేనిమిత్తం తగిన పత్రాలను సర ఫరాచేయగల ఒక చెట్టును వెలయింపజేసినారు. ఆ చెట్టు తాలూకు ఆకులమీద మంత్ర తంత్రాలనూ, ధర్మశాస్త్రాలనూ, పురాణప్రవచనాలనూ, ఆచారవ్యవహారకాండలనూ నేర్పుగా వ్రాసిపెట్టుతూ వచ్చినారు. వేదాలు, ఉపనిషత్తులు, స్మృతులు మొదలైన అపూర్వకృతులను, నాలుగు కాలాలపాటు కచ్చితంగా నిలిచేవిధాన, దాని పత్రాలమీద గంటంపట్టి వ్రాసిపెట్టినారు.

అటుపిమ్మట, కాలక్రమేణా, తాము మహాచదివిన వారని భావించి గర్వంతో విఱ్ఱవీగే పండితులు పొడసూపి

నారు. ఆ అహంభావంతో వారు ఒకరితో ఒకరు జగడాలకు గూడ సమకట్టినారు. నీవు మూఢుడవంటే నీవు మూఢుడవనీ, నేను గట్టివాణ్ణంటే నేను గట్టివాణ్ణనీ, అహమహమికలుపడి వాదులాడుకొన్నారు.

ఇది అంతా చూచి సరస్వతమ్మకు మహాకోపం వచ్చింది. లక్ష్మీదేవమ్మతో కలిసి యోచనచేసి పండితులకు వ్రాతపత్రాలు ఇచ్చే పాదపాలను కాస్తా మైకం కలిగించే మహీరుహాలుగా చేసివేసింది. తాళపత్ర గ్రంథాలను చదివితే ఎంతగా తెలివితేటలు పుట్టుకొని వస్తూఉండినవో, అంతగానూ అజ్ఞానమూ మైకమూ కలిగించే మద్యాన్ని ఆ చెట్లనుంచే తీయ నారంభించినారు ప్రజలు. లక్ష్మి కటాక్షం చేత, కల్లుగీచి క్రయానికి అమ్మేవారు, బాగా డబ్బు సంపాదించి మూట కట్టుకొన్నారు. ఇంకా ఇంకా ఎక్కువగా కల్లుతీయడానికి ఆరంభించినారు. నారికేళ వృక్షాలనుగూడ ఇదేవిధంగా ఉపయోగింప జొచ్చినారు.

"అయ్యయ్యో! నా గర్భాన్ని భేదించి ఉసురు పిండుతున్నారే!" అని తాళవృక్షం వలవల ఏడుస్తుంది. ఆ యేడ్పులో జాలువారే కన్నీరున్ను, గర్భనిర్భేదకారణంగా కారే ఉసురునీరున్ను కడవల్లోకి దిగి పానప్రియులకు పసందయిన కల్లు అవుతున్నది. అది పానంచేసి జ్ఞానం కోలుపోయి మత్తుగొని సంబరపడేజనాన్ని చూచి, పరితాప పడడం పోయి, కొందరు మహనీయులు దానిని ఇంకా ఇంకా తీయించి విక్రయించి విస్తారంగా విత్తంచేసుకొని విశేషధనవంతు లవుతున్నారు.

తాళపత్రాలు ఋషులను ధ్యానించినవి. "విజ్ఞాన వ్యాప్తికై జన్మ మెత్తినవారము; మత్తుమైకాలను మప్పుతున్నామే! మా తలవ్రాత ఇట్లయిందే!" అని తాళదళాలు తమ విచారాన్ని గాలిలో ఘోషించుకొంటూ వీస్తున్నాయి.

"తప్పించుకొని బ్రతకడానికి ఎంత ఎత్తునకు ఎదిగినా, నా బిడ్డలను ఎంత యెత్తునబెట్టి కాపాడజూచినా, ఈ పాపిష్ఠివారు ఎట్లో పైకి ఎక్కి గొంతులు నులిమి చంపుతున్నారే!" అని అంగలారుస్తుంది కన్నకడుపుతో తల్లిచెట్టు.

"ఎక్కడానికి వీలుగా ఎట్టికొమ్మలూ వేయకుండా నేను నూరడుగులు పెరిగి కూర్చున్నాకూడ, వీరు విడువడం లేదే! ఏదేదో తంత్రంచేసి కాలికీ నడుముకూ తాళ్ళుకట్టుకొని, అంగలంగలు వేసుకొంటూ కోతులతీరున ఎగబ్రాకుతున్నారే! ఏమిటి నాకీ శాపం?" అని వాపోతుంది.

"ఎంతగానో తపస్సుచేసి విజ్ఞానం గడించినారే! దానిని కోలుపోవడానికి మళ్ళీ ఇన్ని యుక్తులు పన్నుతున్నారే!" అని వ్యథపడుతాయి విజ్ఞానవ్యాప్తికై వెలసిన తాళపత్రాలు.

ఏమియేడ్చి యేమి లాభం? కల్లును రూపుమాపడానికి ప్రభుత్వంవారు పట్టుపట్టి చట్టంచేసినాకూడ దొంగతనంగా ఎట్లో కల్లుసారాయిలు సంపాదించి సాపడుతూనే ఉన్నారు.

అంతరిక్షాన ఋషులు ఇదంతా గమనిస్తూ పరితపిస్తారు.

# పరిచయం

దక్షిణభాషాపుస్తకసంఘవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలిప్రచురణ లివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం—నాలుగు దక్షిణాదిభాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహద మిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింప జేయాల నే సత్సంకల్పముతో, సముదార దూర దృష్టితో ఫోర్డు ధర్మనిధివారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను, ప్రచురణకర్తలచే అందముగా అచ్చువేయించి అందరికి అందుబాటులో ఉండే సరసమైన ధరలకు అందచేయాల నే ఆదర్శంతో మూడేళ్ల కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలా లివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢ శైలిలో ఉండే విద్వత్కావ్యాల జోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన ఆంగ్లభాషావాసన లేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా అందించగల సులభ సుందర శైలిలో ఉన్న ఉత్తమ గ్రంథాలను మాత్రమే ఎన్నుకొన్నారు.

ఉన్నత సారస్వతశ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూ కూడ ప్రచురింప చేయడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్క మాటలో చెప్పాలంటే ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం అనేది దక్షిణభాషా పుస్తక సంఘవారి పరమాశయం. ఇందులో వీరెంతవరకు కృతకృత్యులైనదీ ఇప్పుడీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషిఫలితం బహుశా వచ్చే పదిసంవత్సరాలవరకు అంతగా కనబడక పోవచ్చు. కాని, ఈ ప్రణాళిక అద్భుతమైనదని, అత్యంతప్రధానమైనదనిమాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకొనక తప్పదు. ఇందుకు గల అవకాశాలు అనేకం.

అందమైన అచ్చుతో చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల గ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్త వెలుగును, విజ్ఞానాన్ని అందించగలవు.

దక్షిణభాషా పుస్తక సంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం—నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండటం వింతకాదు. ప్రాచీన కాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణాపథ మనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈ నాలుగు భాషలను వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుకచేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాష లనడం నా అభిమతం కాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషాపరమైనదిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈ నాలుగు భాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తములో వ్యాప్తిలో ఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారాలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహంవల్ల ప్రచురిత మయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థానభాషా వేషానురతి శ్రుతి మించిపోకుండా సమగ్ర భారత సంస్కృతిని ప్రతిబింబింప జేసే పుస్తకాలను, విశ్వమానవసౌభ్రాతృత్వాన్ని, ప్రపంచ కళ్యాణాన్ని కాంక్షించే ఉత్తమగ్రంథాలు అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

పా. వేం. రాజమన్నారు

(మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి)

# పీఠిక



'కణ్ణన్' అనే పిల్లల పత్రికకు 'గుమ్మడితీగ' కథను వ్రాసిన తరువాత ఒకటి వెంట ఒకటిగా ఈ కల్పనా నీతికథలు రచితములైనవి. వీటిని వారం వారం 'కల్కి' పత్రికలో ప్రచురిస్తూనూ, రేడియోలో వినిపిస్తూనూ ఉంటిని. ఈ కథలను ఇప్పుడు పుస్తకరూపంగా ప్రచురింపజేయడానికి దక్షిణభాషాపుస్తకసంస్థవారు పూనుకున్నారు. ఇవి పిల్లలకూ, జనానీకానికీ తప్పక ఉపయోగపడగలవని ఆశ. కల్పనలు, నీతులు, విజ్ఞానము, ఒకింత వినోదమూ కూడ సంతరించుకొన్న ఒక కథానికుంజముగా ఈ సంపుటిని సంభావించవచ్చు. ఈ నికుంజవాటికలో విషజంతువులు లేవు. భయపడకుండ ప్రవేశించవచ్చు.

సి. రాజగోపాలాచారి

# 1. తులసిగమగమ

అనగనగా మధురాపురి అని ఒక మహాపట్టణం. ఆ పట్టణంలో ఒక నాణ్యమైన నందనవనం. ఆ వనంలో నలువంకలా, ఎక్కడా సందులేకుండా నవనవలాడుతూ నానావిధమైన మొక్కలు — తులసి, రోజా, మల్లి, మొల్ల, జాజి మొదలైనవి — ఇంపుగా, ఏపుగా ఎదిగి రాణిస్తున్నాయి.

శ్రీ వైష్ణవభక్తశిఖామణి ఒకడు రోజూ వచ్చి తావులీనే తులసి దళాలు కోసుకొని బుట్టనింపుకొని పోతూ ఉంటాడు. రాచకన్నియలు వచ్చి రుచులూరించే రోజా పువ్వులు ఏరుకొని పూసజ్జలు నింపుకొని వెళ్లుతూఉంటారు.

రోజామొక్క పొగరుబోతుతనంతో మిడిసిపడింది. తులసిమొక్కను చూచి ఇట్లని హేళనచేసింది: "ఎందుకమ్మా! రాజకన్యలు నీచాయలకే రారు? నిన్ను పలుకరించనైనా పలుకరించరే! అవునులే మరి. నీవేమో వట్టి ఆకులతో నిండిఉంటివాయె. నీవూ నావలెనే ఎఱ్ఱగా, సొగసుగా పూవులుపూస్తే నిన్నూ ఎందుకు లక్ష్యంచేసి ఆదరించరు?"

సావాసకత్తె మిట్టిపాటుమాటలకు తులసి నలుసంతైనా ఉడుక్కోలేదు. "బీదబాపడి అవ్యాజమైన భక్తియే నాకు చాలు. ఆయనధర్మమా అని నాస్వామి శ్రీపాదములకు నాదళాలుపోయి చేరుతాయి. అంతకన్నా నాకు కావలసిందేమి?" అని తడుముకోకుండా జవాబిచ్చింది.

రాజకుమారికల తలనీలాలను అలంకరించే గౌరవమే గౌరవమనీ, తనపుణ్యమే పుణ్యమనీ రోజామొక్క గొప్పలు చెప్పుకొని గునిసింది. "ఈ తులసిమొక్కకు తెలిసింది౦తే" ననుకొన్నది. అంతకుపైన ఏమీ అనలేదు.

* * * *

ఒకనాడు రాజుగారి కడగొట్టుకూతురు-పసిఅమ్మాయి తనచేతులారా తానే పూలుకోసుకొని పోవలెనని ఉబలాటపడి సరాసరి నందనవనానికి వచ్చింది. వచ్చి తన చిట్టిచేతులతో పూలుకోయ నారంభించింది. ఎన్నడూ అట్టిపను లెరుగని కందమ్మ! అలవాటులేని దోషాననో ఏమో, అమ్మాయి చేతిలో ఒక రోజాముల్లు కసిక్కున గుచ్చుకొన్నది. ఆ నొప్పికి తట్టుకోలేకపోయింది అమ్మాయి. బావురుమని ఏడవనారంభించింది. వెంటవచ్చినవారు వెంటనే అమ్మాయిని చంకల కెత్తుకొని నగరికి చరచర వెళ్ళిపోయినారు.

తమ ముద్దులబాల వేలిమీద రక్తంచిందు చూడగానే రాజుగారికి ఆపలేనంత ఆగ్రహం వచ్చింది. ఆయన అమాంతంగా మండిపడినాడు. రోజాచెట్లకు ముండ్లు ఉంటాయని, పాపం, రాజుగారికి తెలియదు. ఆయన తోటకు ఎన్నడైనా పోయిఉంటేనా? ఒకవేళ పోయినా చెట్లనూ, మొక్కలనూ ఎన్నడూ గమనించిందిలేదు. ఆయన చూచినదల్లా రోజామాలలను మాత్రమే!

జరిగిన సంగతి తెలుసుకొన్నాడు. "ఇంతకూ ముండ్లమొక్కలలోనా రోజాపూలు పూసేది? అయితే అవి యింక మన నందనవనంలో అవసరంలేదు. ముందువెనుకలు

చూడక ముందువెళ్లి పెరికి పారవేయం''డంటూ ఫర్మానా జారీచేసినాడు.

రాజుగారు పిడివాదంమనిషి. అన్నదికాస్తా అయి తీరవలసిందే. అందువల్ల ఎవ్వరుగాని అడ్డు చెప్ప లేదు. సేవకులు తక్షణం వెళ్లి రాజాజ్ఞమేరకు నందనవనంలో ఉండిన రోజామొక్కల నన్నిటినీ పెరికిపారవేసి వచ్చి ప్రభువులవారికి సంగతి తెలియజేసినారు. 'సెబాస్' అంటూ రాజుగారు అభినందించినారు.

తులసిచెట్టుమట్టుకే నందనవనంలో నిలిచిపోయింది. "అయ్యో! పాపం!" అని రాచనగరును నమ్మిన రోజా మొక్కగతిని తిలకించి జాలిపడింది. విచారరేఖలు అలము కొన్నాయి.

వాడుకచొప్పున తులసి కోసుకొనిపోవచ్చినవారు "ఏమి యీనాడు తులసి యింతగా గమగమలాడుతున్న" దంటూ అబ్బురపోయినారు.

మహామనోవేదనతో తులసిమొక్క పడుతున్న జాలియే అట్లు గమగమవాసనగా జాలువారుతున్న సంగతి ఆ అమాయకులకు తెలియదు.



# 2. గురుబోధలు

ఒక ఊరిలో ఒక స్వాములవారు. ఆయనకు పలువురు శిష్యులు. వారికి ధర్మోపదేశాలు చేస్తూ ఆయన ఆముష్మికచింతనలతో కాలక్షేపం చేస్తున్నాడు.

"ఇది సరస్వతీదేవి కోపంవల్ల వచ్చిన శాపం" అంటాడు ఒకఋషి.

"చదువుకొన్నవారు అహంకారపడరాదు. విద్యామదమూ మద్యమదం వంటిదే" అన్నది లక్ష్మీదేవి.

"నాకై కొబ్బరికాయలు పగలగొడతారు జనం. కాని అహంకారాన్ని పగలగొట్టుకోరే! అహంభావాన్ని మాపుచేసుకొని, లోపల పాకంతేరియున్న జ్ఞానసారాన్ని చూడబూనుకోరే! వీరికంటే మత్తెక్కి మైకంతో తందనాలాడేవారే మేలు" అన్నాడు బొజ్జగణపయ్య.

"నీవు ఎప్పుడూ ఇంతే. ఏదో ఒకటి చెప్పుతుంటావు. పోయి గుంటగట్టున కూర్చొని ప్రజలకు మంచి ఉపదేశిస్తూ ఉండు. ఒకనాడు కాకపోతే ఒకనాడైనా మంచిబుద్ధి తెచ్చుకొని దారికి రాకపోరు." అన్నది కరుణాసింధువైన కలుములతల్లి.



# 5. రాతిగుండెలు

నెలకొండపల్లికి ఒక స్వాములవారు వేంచేసినారు. ఆయన బహురసవంతంగా, హృదయాలు కరిగేటట్లు ఉపన్యసిస్తారు. ఊరిపెద్దలు ఊరిమధ్యలో బేటా)యిశెట్టి గానుగమెట్టు ఉండే మైదానమందు సభఏర్పాటు చేసినారు. గ్రామస్థులంతా వేళకు సమావేశమైనారు. స్వాములవారికి సముచితరీతిని సపర్యలు గావించి, ఉపన్యాసం వినడానికి ఉపవిష్టులైనారు. స్వాములవారు గానుగ కొప్పెరపై తిష్ఠవేసి

కూర్చొని, జీవకారుణ్యాం గురించి ఉపన్యసింప నుపక్రమించినారు.

“అయ్యలారా! నోరూవాయీ లేని కోళ్ళనూ, గొర్రెలనూ, మేకలనూ వధించకండి. కాయగూరలతో కూడిన శాకాహారమే మంచిది. మన ప్రాణంవంటివే అన్నింటి ప్రాణాలున్ను. అన్నిప్రాణులూ ఆదేవి అనుగుబిడ్డలే. తన బిడ్డలను హింసిస్తే ఆదేవి అంగలార్చి అశ్రువులు రాలుస్తుంది. మనకు తోడునీడగా ఉండదు. మనము చేసే పాపాలు తీరే దారి లేకుండాపోతుంది.” అంటూ ఇంకా ఇంకా ఇదే విధంగా ఉద్బోధ చేసినాడు.

ఏమిచేస్తేనేమి, ఎంతచేస్తేనేమి? ఆ ఊరు ఆయన బోధనలను చెవినిపెట్టలేదు. యథాపూర్వంగానే కోళ్ళనూ, గొర్రెలనూ హింసించుకొంటూనే వచ్చినారు.

స్వాములవారి ఉపన్యాసం రాళ్ళనుకూడ కరిగించే ధోరణిలో సాగింది. కాని, ఊరిజనం గుండెలుమాత్రం కరగలేదు. ఉపన్యాసకుణ్ణి ఓర్పుతో భరించి ఉపన్యాసం విన్న చేట్రాయి శెట్టి గానుగకొప్పెర మాత్రం, “ఇకపైన నేను ఇదివరకువలె నువ్వులను హింసించనుగాక హింసించను. నువ్వులకు మాత్రం జీవంలేదా ఏమిటి?” అని తీర్మానించుకొన్నది.

పంటకోతలకాలం వచ్చింది. కాపులు నువ్వులను బస్తాలకు బస్తాలు బండ్లకెత్తించుకొని వచ్చి నూనె దించుకోవడానికై గానుగకు వేసినారు. శెట్టిగారున్ను, నెమ్మదిగా నాలుగు డబ్బులు చేసుకోవచ్చుగదా అనే హుషారుతో,

శక్తివంచన లేకుండా గానుగాడింప బూనుకొన్నారు. కాని నూనెమటుకు సరిగా దిగనేలేదు. ఏమిచేసినా, ఎంతచేసినా పిండిలో నూనె అట్లాగే నిలిచిపోతూవచ్చింది. నువ్వులు సరిగా నలగడమూ లేదు; నూనె సరిగా దిగడమూ లేదు. కారణమేమో కాపులకు బోధపడ లేదు. "ఇది నిజంగా నువ్వుల లోపమే. అవి మంచివై ఉండవు. కనుకనే నిండుగా నూనె ఇవ్వలేకపోతున్నాయి," అని శెట్టిగా రన్నారు. అయితే పక్కవూరి గానుగమరలో మాత్రం నూనె దిగు బాటుకు కొరతేలేదు. ఎప్పటిమాదిరిగానే ఆ వూరి గాండ్ల వాడు కొరవలేకుండా నూనె దండిగా దించియిస్తున్నాడు.

బేట్రాయిశెట్టి వ్యాపారం క్రిమేణా బాగా దెబ్బ తిన్నది. ఎడ్లను తెగనమ్మివేసి తాను స్వాములవారై పోవ డానికి ఆయన నిశ్చయించుకొన్నాడు. తీరా అలాచేయ డానికి పూర్వరంగంగా గానుగమానుముందర చేతులుకట్టి నిలిచి వినయవిధేయతలతో పూజించి మొరపెట్టుకొన్నాడు. గానుగమాను చెప్పింది : "తండ్రీ! ఏల నన్ను విడిచిపెట్టి పోతావు? వద్దు, పోవద్దు. చూడు, ఇకమీద నూనె సరిగా ఇస్తాను. భయపడకు. నీవు మాత్రం కొంచెం జీవకారుణ్యం గలిగి మసులుకో. ఎడ్లను కొట్టవద్దు. నయంగా వీపుతట్టి మంచిమాటలాడి నడిపించు. జీవకారుణ్య ప్రసంగం వింటూ ఉంటే నా రాతిగుండెకూడ ఇట్టే కరిగిపోతున్నది. ఉప న్యాసం వేరే ఎక్కడయినా ఏర్పాటు చేయమనిచెప్పు. నా దగ్గరమాత్రం పెట్టించవద్దు." అని శెట్టిగారిని అడుగు కొన్నది.

భద్రకాళికామ్మవారి గుడికివెళ్ళి పొంగలి నైవేద్యం పెట్టి గానుగమాను చెప్పినరీతిగా నడుచుకోవడానికి చేట్రాయిశెట్టి ప్రతిజ్ఞ పట్టినాడు.

కాళికాదేవిగూడ "ఇకపైన నాకు పొంగలి నైవేద్యమే! పెట్టండి. కోళ్లుగాని, గొర్రెలుగాని నా యెదుటికి తీసుకురాకండి," అంటూ చెప్పింది. పూజారి ఈవిషయం వెంటనే ఊరివారి చెవిని వేసినాడు.

అటుపిమ్మట అంతా సరిపోయింది. దెబ్బలుతినే ప్రమేయం పెట్టుకోకుండానే ఎద్లు గానుగా, నాగలీ సలీసుగా లాగినాయి. వ్యాపారమూ, వ్యవసాయమూ ముందుమాదిరిగానే సరిగా నడచినాయి.

కాని, అదిమొదలు ఉపన్యాసాలుమటుకు అన్నీ చావడిలో పెట్టిస్తూ వచ్చినారు. బేటాయిశెట్టి "నా గానుగమర పొంతమాత్రం వద్దుబాబూ" అని ఖండితంగా చెప్పివేసినాడు.



# 6. సంక్రాంతి బహుమానం

సుబ్బారావుచేతిలో రెండురూపాయి లున్నవి. నెల నెలా తండ్రిగారు పంపుతూవచ్చిన డబ్బులో కొంచెం కొంచెం మిగుల్చుకొంటూ వచ్చినాడు. చెన్నపట్టణంలో కాలేజీలోచేరి నాల్గునెలలయింది. చేతిలో రెండు రూపాయలు చేరినవి. ఈ డబ్బుతీసికొనిపోయి ఏదైనా ఒక అపురూపమైన వస్తువు కొని ఊళ్ళోఉన్న మేనమామకూతురు

కమలకు పంపవలెనని, కొండంతఆశతో చైనాబజారులో అంగడి అంగడీ చూచుకొంటూ పోతున్నాడు.

"కమలకు చాలాఇష్టమైన వస్తువేమిటి? ఎటువంటి వస్తువుకు ఆమె మోజుపడుతుంది?" అని తనలోతానే ఆలోచించుకొంటూ అంగడి అంగడీ పరకాయించి చూచుకొంటూ పోతున్నాడు.

ఒకవంక దుకాణదార్లు "రండిబాబూ, రండి. ఏంకావాలో చూడండి. కొత్తకొత్త దినుసులు వచ్చినాయి" అంటూనూ, "పండుగకు సలీసు వెలలు. మళ్లీ ఈ తరుణం రాదు. రండి, చూడండి" అంటూనూ గడపగడపవద్దా తెగ పిలుస్తున్నారు. ఇంకొకవంక ప్లాటుఫారం వ్యాపారస్థులు "జపాన్ పార్కర్, నాలుగే నాలుగణాలు" అనీ, "బాబూ, పాండుచేరీ సెంటు, బలేచౌకబాబూ" అనీ, "రిబ్బన్ రిబ్బన్. పట్టురిబ్బన్, బలేరంగులు బలేజోక్," అనీ చెవులు గింగుర్లెత్తేటట్లు కేకలువేస్తున్నారు. ఇలా ఎవరికితోచినవిధాన వారు బేరగాండ్లను పిలుస్తూఉంటే సుబ్బారావు అన్నీవింటూ, ఊరికే చూచుకొంటూ తనపాటికి తాను పోతున్నాడు. చూచిన వస్తువుల్లో ఏదీ కమలకు నచ్చేదిగా కనబడలేదు.

ఒకరిపిలుపూ వినిపించుకోకుండా, మాట్లాడకుండా నడుస్తుండడంతో ఆ వ్యాపారస్థులకు చర్రుమన్నది. "వట్టి పల్లెటూరి మనిషిలాగున్నాడు. అది కొనే మొగమేనా? కనబడడంలేదూ!" అని కొందరు గేలికూడ చేసినారు.

వచ్చినదారిపట్టి హాస్టలుకు పోయినాడు. ఒక కాగితం తీసుకొని కమలకు కమ్మ వ్రాసినాడు. "కమలా, నీకు బాగా

నచ్చే వస్తువేదైనా కొనిపంపుదామని కొట్టుకొట్టూ తిరిగి చూచినాను. ఏదీ సరిఅయింది కనబడలేదు. నా హృదయం ఒక్కటే నీకు పంపదగినవస్తువు. అది తపాలులో పంపడం పడదే!'' అని వ్రాసి సంక్రాంతినాటికి సరిగాపోయి చేరేటట్లు ఆ జాబు తపాలుపెట్టెలో వేసివచ్చినాడు.

ప్రేమకు దీటయింది వేరే బహుమాన మేమున్నది? అందులోనూ బావప్రేమవలె! అంగడిలో దొరికే వేరే ఏమి బహుమానం కమలకు నచ్చుతుంది ?

తపాలావాడు 'పోస్టు' అంటూ ఉత్తరం తెచ్చియివ్వ బోయినాడో లేదో వెంటనే చెంగున దానిని తీసుకొని చదివింది కమల. అది వచ్చినసంగతి ఎవరికీ తెలియనీయకుండా మెల్లగా దానిని తీసుకొనిపోయి తనపెట్టెలో గుడ్డలమడతల కింద ఎవరికీ కనబడకుండా భద్రంగా దాచిపెట్టింది. మరు నాడుకూడా ఏకాంతంగా దానిని తీసి మరొక్కమారు చదువుకొన్నది. చదివి, తిరిగి యథాప్రకారం పెట్టెలో పెట్టివేసింది. ఆ మరునాడుకూడా అట్లే చేసింది.

కుఱ్ఱవెధవ ఎట్లా కనిపెట్టినాడో కాని- తమ్ముడు రాము ఇది కనిపెట్టివేసినాడు. పెట్టెకు తాళం లేదు. చప్పుడు లేకుండా తీసి, రహస్యంగా చదివి, తిరిగి ఎప్పటిమాదిరిగానే పెట్టెలో బట్టలఅడుగున పెట్టివేసినాడు.

''అమ్మా! కమలక్కయ్యకు బావ జాబు వ్రాసినాడే!'' అన్నాడు.

అమ్మ నవ్వింది. ''అదంతా నీకు ఎందుకురా? అక్కయ్యను పరిహాసంచేయరాదు.'' అని చెప్పి వానినిపంపివేసింది.

"వచ్చే చైత్రమాసంలో కమలకు ఎందుకు పెండ్లి చేసి వేయకూడదు?" అని కమలతండ్రి భార్యదగ్గర యోచన చేసినాడు.

"అబ్బాయి ఇంకా కొన్నాళ్లు చదవాలి. ఇంతలో ఏమి అవసరం?" అని చెప్పింది సుబ్బారావు తల్లి.

* * * *

తల్లిదండ్రులు ఇట్లాగే తోసివేస్తూఉంటారు. వారికి విషయం తెలియడమే కష్టం. చదువు, చదువు అని చెప్పి వెనుకకు నెట్టివేస్తూఉంటారు. పెండ్లి అయిపోతేమాత్రం చదువు నిలిచిపోవలెనని ఉందా? చదువుకూ, దీనికీ విరోధమేమిటి?

* * * *

సుబ్బారావుకు కమలను గురించిన కలవరమే ఎక్కువయిపోయింది. చదువుమీద ధ్యాసే పెట్టలేకపోయినాడు. పరీక్షలో తప్పిపోయినాడు.

మరుసటిసంవత్సరం చదువుమీద లక్ష్యం ఉంచి కష్టపడి చదివినాడు. నిరుడు కమలనుగురించిన చింతతో చదువుమీద ధ్యాస పెట్టలేకపోయినవాడు కాస్తా ఈసారి అదే కమలజ్ఞాపకంతో చదువుమీద శ్రద్ధపెట్టి చురుకుగా చదివినాడు. ప్రేమశక్తి విచిత్రమైంది. అది బహువిధాలుగా పనిచేస్తుంది.

సుబ్బారావు పరీక్ష ప్యాసయినాడు. కన్నవారు సంతోషపడినారు. వారికన్నా మిన్నగా సంతోషపడింది

కమల. తానూ ఒక పరీక్షకు కూర్చొని ప్యాసయినట్లుగా సంబరపడింది.



# 7. ముక్కారకథ

రామయ్యఇంటిచూరులో మంచిచోటు చూచి రెండుపిచ్చుకలు గూడుకట్టుకొని కాపురం పెట్టినవి.

"అమ్మో!" అని పిలిచింది మగపిచ్చుక. "ఆఁ. ఏమి సమాచారం?" అన్నది ఆడపిచ్చుక.

"ఈ యింటియామె ఎందుకని అట్లా ఎప్పుడు చూచినా మగనితో పోట్లాడుతూ ఉంటుంది?" అని అడిగింది మగ పిచ్చుక.

"నాకేమి తెలుసు?" అని ఆడపిచ్చుక జవాబిచ్చింది. "ఒకరిగొడవ మన కెందుకు ? మనపని మనం చూచుకు పోదా" మని చెప్పింది.

"నీవు ఎప్పుడూ ఇంతే. ఆత్మశ్రేయస్సే చూచు కొంటూపోతావు. పాపం! ఆ బ్రాహ్మడు రామయ్యకు మనం కాస్త సహాయం చేయవద్దా?" అన్నది మగపిచ్చుక.

"నీవు బలే సహాయం చేస్తావులే! ఊరికే అధిక ప్రసంగం చేయవద్దు. మన గూటిలోని గుడ్లకు పిల్లి రాకుండా చూచుకో" అన్నది పెంటి.

* * * *

ఎక్కడనో ఒక పెంటకుప్పలో వజ్రాలు పొదిగిన

ఒక ముక్కర పడిఉంది. దానిని తన ముక్కుతో కర్చి పట్టుకొని తెచ్చింది మగపిచ్చుక.

"ఇదిగో చూడు, ఈ ముక్కర నీకు కావలెనా!" అని ఆదరంగా అడిగింది పెంటిని.

"నాకు ముక్కరా వద్దు, కమ్మలూ వద్దు! పురుగు పుట్రి లేవయినా దొరుకుతాయేమో చూడు. ఈ కసి గందులకు ఒకటే ఆకలి!" అన్నది తల్లిపిచ్చుక.

మగపిచ్చుక ముక్కర కింద పడవేసి, పురుగుల వేటకు వెళ్ళింది.

రామయ్యభార్య ఇల్లు ఊడుస్తూ ఆ ముక్కర చూచింది. నోరు మెదల్పకుండా అది మెల్లగా తీసి ముక్కుకు పెట్టుకొన్నది.

"ఎక్కడిది నీకు ఆ ముక్కర? ఏ వెధవ యిచ్చినాడు నీ కది?" అని రామయ్య అతికోపంతో అడిగినాడు.

"నిన్న ఇక్కడ పడిఉంది—తీసి పెట్టుకొన్నాను. ఎందుకు ఇట్లా అస్తవ్యస్తంగా మాట్లాడుతారు?" అని భార్య జవాబు చెప్పింది.

"పరాయిసొత్తు దొరికితే తీసుకొనిపోయి గ్రామ మునసబుకు ఇచ్చివేయవద్దూ? రేపు పోలీసులు వచ్చి సోదా చేస్తే ఎవరికి అవమానం?" అన్నాడు రామయ్య.

"నేను ఇవ్వనే ఇవ్వను. నాకు దొరికింది నాదే." అన్నది ఆ మొండిశిఖండి.

ఇంకొక యింటిలో జరిగిన సంభాషణ :—

"స్నానాల గదిలో పెట్టి ఉంటినమ్మా! చిమ్మి తోసిపారవేసి ఉంటుంది. మొద్దుముండ! ఆ పనిమనిషికి ఏమీ తెలియదు" అన్నది లక్ష్మి తన తల్లితో.

"అయినా అంత మతిమరపేమిటే? నాలుగు మూలలూ వెదుకు. నాయనగారితో చెప్పవద్దు. ముక్కర పోగొట్టుకొన్నావని తెలిస్తే చాలా కోప్పడుతారు" అన్నది సుబ్బాయమ్మ.

"ఏమిటి, రహస్యం మాట్లాడుకొంటున్నారు, తల్లీ కూతుళ్లు?" అని అడిగినారు రామనాథరావుగారు.

సంగతి బయటపడిపోయింది. పిమ్మట ఊరంతా పొక్కింది. రామనాథరావుగారి యింటిలో పనిమనిషి అక్కమ్మ ముక్కర దొంగిలించిందని అంతా చెప్పుకొన్నారు. పోలీసులు వెళ్ళి అక్కమ్మయిల్లు అంతా సోదాచేసినారు. ఇల్లంతా గాలించినారు. కాని, ఏమీ దొరకలేదు.

రామయ్య యింటిలో ఆయనభార్యకు విపరీతమైన జ్వరం. వేసినపడక వేసినట్లే ఆయమ మంచంపట్టింది. రామయ్యకు గుండెలు దడదడ కొట్టుకొంటున్నాయి. కాని, ఆయన యింటికి ఎవరూ సోదాచేయడానికి రాలేదు.

*　　*　　*　　*

"పిల్లా, చూశావా వేడుక?" అన్నది మగపిచ్చుక.

"మంచివేడుకే! పాపం! ఈ యింటి యామెకు దిగులు పట్టుకొంది. జ్వరంతో చచ్చేపోతుందేమో!" అన్నది ఆడపిచ్చుక.

"మంచిపని!" అన్నది గడుసుగా మగపిచ్చుక.

"అంతా నీవుచేసినపని!" అన్నది ఆడపిచ్చుక.

"దొంగతనం చేయమని నేనా చెప్పినాను? మగడు చెప్పినా వినకుండా మూర్ఖంచేస్తే ఇంతే అవుతుంది." అన్నది మగపిచ్చుక మహాగంభీరంగా.

"నీ మాట నేను ఎన్నడూ తీసివేయను" అన్నది ఆడపిచ్చుక.

"మంచి" దన్నది మగరాయడు.

"పద. పిల్లలకు ఏనయినా యిన్ని పురుగుపుట్రలు పట్టుకొనివద్దాం." అని చెప్పి పిచ్చుకలు రెండూ తుఱ్ఱుమని ఎగిరిపోయినవి.



# 8. బెండుపూదండ

వీరపాండ్యరాజు కొలువుకూటంలో ప్రతిరోజూ ఉదయం ప్రసిద్ధులైన సంగీతవిద్వాంసులు విచ్చేసి వీనుల విందుగా పాటలుపాడి పోతూఉండడం పరిపాటి. రాజా వారూ, తల్లి లేని ఆయనతనయ చంద్రమతీ కర్ణానందంగా వాటిని ఆలకించి ఆనందిస్తూ ఉండేవారు. చంద్రమతి చదువుసంధ్యలు చక్కగా నేర్చుకొని, కళావిజ్ఞానం గడించి కన్నతండ్రికి ముద్దుమురిపెములు కూరుస్తూ గారాబంగా పెరుగుతూ వచ్చింది.

ఆ కొలువుకూటంలో గోడలపైనా, కంబాలపైనా నటరాజు, కుమారస్వామి, వినాయకుడు, గోపాలకృష్ణుడు,

సీతారాములు మొదలైనవారి దివ్యలీలలు రమణీయమైన శిల్పాలుగా చెక్కి ఉన్నాయి.

ఆ విగ్రహాలుకూడ గానామృతాన్ని కమ్మగా అనుభవిస్తూఉండినవి. పాటలు వినేటప్పుడు ఆ శిల్పఖండాల ముఖాలు వికసించేవి. వాటి కనుకొలకులనుండి అశ్రుజలాలు అలవోకగా జాలువారుతూ ఉండేవి.

ఒకనాడు కాశ్మీరదేశంనుంచి మహాఘనుడైన ఒక సంగీతవిద్వాంసుడు వచ్చినాడు. ఆయన పలుదేశాలు తిరిగి పలువిధములైన సంగీతబాణీలను అభ్యసించి ప్రసిద్ధిపొందిన వాడు. ఆయనపేరు గంధర్వవీరమాహేశ్వరుడు.

గంధర్వమాహేశ్వరులవారు తమకై ప్రత్యేకంగా అమర్చిన ఆసనం అలంకరించినారు. పాడ మొదలు పెట్టి నారు. పాడినారు. ఆయన వెంటవచ్చిన పక్కవాద్యకారులు పక్కవాద్యాలు వాయించినారు. బహుసొంపుగా సంగతులు వేసి పాడినారు.

రాజావారి ఆస్థానసంగీతవిద్వాంసు లందరూ భేష్ అని మెచ్చుకొన్నారు. రాజావారున్ను ఎంతో ఆనందించి నారు. గంధర్వవీరమాహేశ్వరులవారికి గొప్ప బహు మానం దయచేసినారు. ఆ బహుమానం పుచ్చుకొని వీర మాహేశ్వరులు అక్కడనుంచి బయలుదేరి చోళరాజు నగరానికి వెళ్లినారు.

గంధర్వమాహేశ్వరుల వారు పాడినప్పుడు దర్బారు శాలలో ఉండిన శిలాశిల్పాల నయనాలనుంచి కన్నీరు

స్రవించలేదు. ముఖాలలోకూడ ఎప్పటివలె నూతనవికాసం పొడసూప లేదు.

రాజకుమారి నాయనగారిని అడిగింది: "నాన్న గారూ! ఆ మహావిద్వాంసుడు పాడినప్పుడు కొలువుకూటం లోని శిల్పాలు ఎప్పటివలె వికసింపలే దెందుచేత?"

రాజావారు నవ్వినారు. "మన శిల్పాలకు ఉన్నత సంగీతాన్ని మెచ్చుకొనే అభ్యాసం లేదు కాబోలు!" అన్నారు.

"గాయకుడు దైవభక్తితో పాడలేదేమో!" అన్నది చంద్రమతి.

"నీవు చెప్పింది నిజం చంద్రమతీ! నాకుగూడ ఆ గంధర్వమాహేశ్వరులు పాడినప్పుడు మనస్సు ద్రవించనే లేదు. బహుమతులేమో ఇచ్చినాను. సంగీతం శుద్ధంగానూ, శాస్త్రకట్టుగానూ ఉంది. కాని హృదయాన్ని మాత్రం కదిలించలేదు. విమానం, గోపురం మొదలైన అన్ని హంగులతోనూ అందమైన కోవెలయితే నేర్పుగా కట్టినారు గాని లోపల మూర్తిమాత్రం లేదు. మన ఆస్థానసంగీత విద్వాంసులు కొంచెంపాడినా మనకు కలిగే హృదయాహ్లాదం ఆ మహావిద్వాంసుని గానలహరిలో మనకు లభించనేలేదు." అన్నారు రాజావారు.

"అదిగో, మనదీక్షితులవారు విచ్చేస్తున్నారు. ఆయన పాడుతారు. విందాం" అని రాజకుమారి అతి కుతూహలంతో అన్నది. ఆస్థానవిద్వాంసులు వైద్యనాథ దీక్షితులవారు పాడినారు.

విన్న వెనువెంటనే విగ్రహాల ముఖాలూ, రాజకుమారి ముఖమూ కూడ ఒక్కుమ్మడిగా వికసించి దివ్య కాంతులు వెలార్చినవి. కొలువుకూటంలో వెలుగు వెల్లివిరిసిపోయింది. శిలావిగ్రహాల కన్నులనుంచి కన్నీరు రాలినవి.

"కాగితంపూలకు కమ్మనివాసన ఉండదు. తళుకులు, జిలుగులు ఉంటే ఉండవచ్చు! దీక్షితులవారి పాట తలలో ముచ్చటగా ముడుచుకొనే, గమగమవాసనలు గుబాళించే మొగలిపువ్వు వంటిది. కాశ్మీరగాయకునిపాట వట్టి కాగితం పూల మాల" అన్నది చంద్రమతి.

"నిజం, నిజం" అన్నారు రాజావారు.

"దైవభక్తిలో గానం అనే అద్భుతవస్తువు లోకంలో పొడసూపింది— కోనేటిలో చెందామరలు పొడసూపినట్లు. కొలనిలోనుంచి కోసితీసిన కమలాలు కొంచెం సేపయినా సువాసనతో గుబాళిస్తాయి. పిమ్మట నెమ్మదిగా వాడిపోతాయి. కాగితాలతోనూ, జిలుగుబెండ్లతోనూ చేసే తామరలసంగతి వేరేచెప్పడమెందుకు? మరి, పోదాం, రా" అనిచెప్పి రాజావారు రాకుమార్తెతోపాటు నగరిలోకి నడచినారు.



# 9. సుదర్శనతైలం

జ్ఞానశేఖరస్వాములవారివద్ద ఒక శిష్యుడు గురుకులవాసంచేసి జ్ఞానోపదేశం పొంది శాస్త్రాలు నేర్చుకొన్నాడు.

గొప్ప విద్వాంసుడైనాడు. స్నానసంధ్యలూ, జపతపాలూ యథావిధిగా చేస్తూవచ్చినాడు. గురువులవారి సన్నిధానంలో కొంతకాలం వెళ్లబుచ్చినపిమ్మట ఆయన వెళ్ళి గోదావరీ తీరంలో తనకై ప్రత్యేకంగా ఒక ఆశ్రమం ఏర్పాటు చేసుకొని ప్రజలకు జ్ఞానోపదేశం చేస్తూ, తీర్థప్రసాదాలు అనుగ్రహిస్తూ వచ్చినారు. బ్రహ్మానందస్వామి అని పేరు పెట్టుకొన్నారు.

ఒకనాడు ఒక పరదేశి సిద్ధుడు వచ్చి బ్రహ్మానంద స్వామికి నమస్కరించి "మహాస్వామీ! ఈ తైలం దేహానికి రాసుకొని స్నానంచేయండి." అని చెప్పి ఒక తైలం సీసా వారిచేత బెట్టినాడు.

"ఈ తైలం దేనికి మంచిది?" అని బ్రహ్మానందులు ప్రశ్నించినారు.

"శరీరాన్ని కప్పి కాపాడుతున్న చర్మానికి ఇది చాలా మంచిది. ఇది తాము తప్పకుండా నాలుగునాళ్ళు పూసుకొని స్నానం చేయవలసిందని మనవి. నిరుపేదయైన ఈ దాసునికోర్కె తాము తీర్చవలెను."

సిద్ధుని అవ్యాజప్రేమకు సంతోషించినవారై, బ్రహ్మానందులవారు ఆ తైలం తీసుకొన్నారు. సిద్ధుడు చెప్పిన చొప్పుననే దానిని ఉపయోగించినారు.

అయిదవరోజున స్వాములవారి ఆశ్రమానికి వచ్చిన ఊరిజనం, ఏ కారణంచేతనోమరి, ఆయనకు దండప్రణామాలు చేయంగానే ఆయనను తేరిపారజూచి వెంటనే తిరుగుముఖం పట్టి పోయినారు. ఉపదేశం పొందడానికిగాని, తీర్థప్రసా

దాలు తీసుకోవడానికి గాని మరి నిలువలేదు. ఇట్లాగే మరుసటిరోజునా ఆ మరుసటిరోజునా కూడ జరిగింది. అందరికీ తమయెడల జుగుప్స పుట్టినట్టుగా స్వాములవారు గ్రహించినారు.

"సిద్ధుడు ఇచ్చిన తైలం ఏదో మాయమంత్ర తైలం వలె ఉన్నది. అతడు ఒక అసూయాపరుడుగా కనబడుతున్నాడు. ఈ తైలప్రభావంవల్ల నేకాబోలు తమయెడ జనానికి ఉండిన భక్తిప్రపత్తులు సన్నగిల్లినవి" అని అనుకొన్నారు.

జనానికి తమయెడ అసహ్యం పుట్టిన విషయం గ్రహించిన బ్రహ్మానందస్వాములవారికి ఏమి చేయడానికీ పాలుపోలేదు. సరాసరి తమ గురుపాదులు జ్ఞానశేఖరస్వాములవారి సన్నిధికి వెళ్ళినారు. విషయమంతా శ్రీవారికి తెలియజెప్పినారు.

"ఏదీ, ఆతైలం ఒకసారి చూపించు," అన్నారు జ్ఞానశేఖరులు. దానిని తీసుకొని మూచూచినారు. వెంటనే అన్నారు :

"నాయనా! ఇదీ కారణం. ఈ తైలం సుదర్శన మంత్రం పఠించి వండి దించిన తైలం. దీనిని రాచుకొని స్నానంచేసినయెడల చర్మమూ మాంసకండరాలూ బయట చూచేవారికి లోపల ఉన్నవన్నీ బట్టబయలుగా పొడకట్టేటట్టు చేస్తాయి. దీని మూలాన చర్మమూ, కండరాలూ లోపలివాటిని కనబడనీక కప్పిపెట్టే శక్తిని కోలుపోయి, చూచేవారిచూపు లోపలికి చొచ్చుకొని పోగలిగినస్థితి

పొందుతాయి. దీనిని కొందరు యోగులు రాచుకొని నియమంగా ఉండటానికి సాధనచేస్తారు. మన కిది పనికిరాదు."

బ్రహ్మానందులవారు సిగ్గుపడ్డారు.

ఆయన అటువెళ్ళిపోయిన పిమ్మట "బుద్ధి పరిపక్వం కానివాడు శాస్త్రంచదివి స్నానసంధ్యలూ జపతపాలూ సాంగోపాంగంగా చేస్తూవచ్చినంతమాత్రాన చాలదు. హృదయం బాగా శుద్ధి పొందేనరకూ ఆపత్తే" అని జ్ఞానశేఖరస్వాములవారు తమ తక్కిన శిష్యులకు తెలివిడి చేసినారు.

"ఈ సుదర్శనతైలం వట్టి దౌర్భాగ్యతైలం" అని కొందరు శిష్యులు తమలోతాము చెప్పుకొన్నారు.

"ఎంత చదివినా మనస్సును కాపాడడం మహాకష్టం. ఈ తైలం రాచుకొని స్నానంచేసే తాహత్తు మనకుఎప్పుడు వస్తుందో" అని మరికొందరు శిష్యులు చెప్పుకొన్నారు.

"మంచినూనె చాలు మనకు. ఈ మంత్రతంత్ర తైలాలన్నీ మనకు వద్దే వద్దు." అన్నారు ఇంక కొందరు శిష్యులు.



# 10. 'పట్నం పోదాం'

"నాకు ఈ ఊళ్లోఉన్న చెత్తసరుకు, దుకాణం సరుకు, మంచిది, చెడ్డది అంతా తెలుసు. కాని ఆ సుబ్బమ్మ మిఠాయి అంటారే, దాని రుచిమాత్రం తెలియదు. అసలు అదిఎట్లా ఉంటుందో చూడడానికే అవకాశం దొరకకుండాఉంది." అన్నది ఒక ఈగ తన పెంటితో.

"ఔనంటే! నేనుకూడ ఎన్నోసార్లు చూచినాను. ఎప్పుడూ ఆ మిఠాయి జాగ్రత్తగా మూసిపెట్టే ఉంటుంది. ఆవిడకొడుకు ఉన్నాడే—బజారువెంట అమ్మకురావడానికి పోతూవుంటాడు- ఆ కుంకకూడ ఎప్పుడుగాని పొరపాటుననైనా మిఠాయిపళ్లెం తెరచిపెట్టనే పెట్టనంటాడు. దగ్గరకుపోతే సరి విసనకఱ్ఱతో విసరి తరుముతాడు." అన్నది ఆడయిాగ.

సుబ్బమ్మ ఒక బీద వితంతువు. ఆవిడమగడు చిల్లర వర్తకం చేసేవాడు. అందులో ఏదో ఇంత సంపాదించి వెనక వేసే లోపలనే అతడు కాస్తా కాలగతిపట్టిపోయినాడు. అటు పిమ్మట సుబ్బమ్మ కొడుకుతోపాటు ఎట్లాగో కష్టపడి జీవనం చేస్తూవచ్చింది. ఒకరూపాయిపెట్టి కొబ్బరికాయలూ, బెల్లమూ కొని తెప్పించి, వేయించి, పాకంపట్టి మిఠాయి బిళ్లలు చేస్తుంది సుబ్బమ్మ. కొడుకు వాటిని తీసుకొనిపోయి బజారులో అమ్ముకొని వస్తుంటాడు.

ఒకపళ్లెంలో 128 బిళ్లలు- పదహారు పదహారుగా ఎనిమిదివరుసలుంటాయి. రెండురూపాయలకు అమ్ముతాడు. ఒక రూపాయలాభం! దానినిపెట్టుకొని జీవనం గడుపుతారు.

వారికి పోటీగా మరొకడు అదేమిఠాయిని చేయ నారంభించినాడు. కాని, అందరూ సుబ్బమ్మమిఠాయే కొంటారు. ఆవిడ శుచిశుభ్రతలతోనూ, ఆచారంతోనూ చేస్తుందని ఊరివారందరి నమ్మకం. పిల్లవాండ్లకు సుబ్బమ్మ మిఠాయే ఇష్టం. అది నోటిలో చాలసేపు నిలిచికరుగుతుంది.

* * * *

ఆ ఊరికి ఒక పప్పరమెంటు దుకాణం వచ్చింది. డబ్బాలనిండా, సీసాలనిండా రకరకాల పప్పరమెంట్లు! వెల కూడ చాలా తక్కువ. ఎక్కడనుంచో వస్తుంది ఈ సరుకు. దుకాణదారుకూడా బలే గట్టివాడు. నవ్వుకుంటూనే నైసుగా మాట్లాడుతాడు.

సుబ్బమ్మమిఠాయివ్యాపారం రానురాను సన్నగిల్లు తొంటూవచ్చింది. అట్లా అట్లా ఆరుమాసాలు ఈడ్చు కొంటూవచ్చి చివరకు ఆగేపోయింది.

అయ్యో! పాపం! సుబ్బమ్మ అదిరిపోయింది. కుఱ్ఱ వాణ్ణి ఆ పప్పరమెంటు దుకాణంలో పనికికుదిర్చి కూర్చో బెట్టింది. దుకాణదారు హూడలగొడతాడు. బెదిరిస్తాడు. అదిలిస్తాడు. భయపడిభయపడి నడుచుకోవడంతో అందంగా మిసమిస లాడుతూఉండిన అబ్బాయి ముఖం కాస్తా వాడి వటించిపోయింది.

"ఆనాడు నాకు కాస్త చోటు ఇచ్చిఉంటే ఇట్లాఅయి ఉండేదా?" అని ఈగ కుఱ్ఱవాడి చెవిచెంత జేరి గొణిగింది. దానిని తోలవలెననికూడ ఇప్పుడు కుఱ్ఱవాడికి తోచడం లేదు. యజమానివైపే చూస్తూ నిలుచుని ఉంటాడు. అతడు ఎప్పుడు ఏమి చెప్పుతాడో! అది గమనించకుండాపోతే అబ్బాయికి ఏదో మూడిందన్నమాటే! ఆపళంగా అదిలిం పులూ గద్దింపులతో విరుచుకుపడతాడు. ఒక్కొక్కప్పుడు కొట్టనుగూడ కొట్టుతాడు.

"అయ్యో! పాపం! వీడు చాలా కుంగిపోయినాడు." అంటూ పళ్లెరంలో చిల్లరగా పెట్టిఉండిన పప్పరమెంట్లపై తిష్ఠవేసింది ఈగ. అంతదాకా ఎక్కడో ఒక పండ్లదుకాణం చెత్తకుప్పలో కూర్చొనియుండి అందలిసారం అనుభవించిన పెంటియీగకూడ అప్పుడే పప్పరమెంట్ల దుకాణానికి వచ్చింది. దానికి పప్పరమెంట్లు సుతరామూ రుచించలేదు.

"ఏమంటావ్!" అన్నది ఆడయీగ.

"ఈ కుఱ్ఱవాడి గతిచూచి అయ్యో పాప మనిపిస్తున్నది." అన్నది మగయీగ.

"నాకూ జాలిగానే ఉంది. కాని, దానికి మనమేమి చేయగలం?" అన్నది పెంటియీగ.

"ఈ పప్పరమెంట్ల దుకాణంవచ్చి ఊరిని పాడుచేసి వేసింది. నీ కిది బాగుందా?" అన్నది పోతుటీగ.

"ఉహూం! నాకేమీ బాగాలేదు. రా, పోదాం, చెత్తకుప్ప చేరబోసేచోటికి." అని పిలిచింది పెంటియీగ.

*  *  *  *

సుబ్బమ్మతమ్ముడు చెన్నపట్టణంలో ఏదో చిన్న ఉద్యోగంలో ఉన్నాడు. ఆయన ఒకనాడువచ్చి మేనల్లుణ్ణి తనవెంట పట్నానికి పిలుచుకొనిపోయినాడు. కుఱ్ఱవాడు దుకాణదారువద్ద చెప్పుకొని ఆయనఅనుమతి తీసుకొని మరీ వెళ్లినాడు. "అంగడిలో కూర్చోనిరోజులకు జీతంలేదు సుమా" అని దుకాణదారు కచ్చితంగా చెప్పిపంపినాడు.

*  *  *  *

"అమ్మా! చెన్నపట్టణంలో మామయ్య నన్ను ఒక కాఫీదుకాణానికి తీసుకొని వెళ్ళినాడే! అక్కడ అందరూ కాఫీ కరచుకొని తాగుతారమ్మా!" అన్నాడు అబ్బాయి.

"అయ్యో! అందరూ అల్లే ఎంగిలిపాత్రలు నోట బెట్టుకొని తాగుతారా?" అని ఆశ్చర్యంగాఅడిగింది సుబ్బమ్మ.

"తాగినపాత్రలన్నీ ఒక పెద్ద గంగాళంలో వేసి తోలచిపెట్టుతారమ్మా!" అన్నాడు అబ్బాయి. "అన్నీ ఒకటిగా పడవేసి ఒకేనీటిలో తోలచి ఒకే గుడ్డతో అన్నీ తుడిచిపెట్టుతారే!" అన్నాడు.

"ఎంత అన్యాయం! ఎంత అన్యాయం! ఊరు నాశన మయిపోతుంది. ఇంత అనాచారమా పట్నంలో?" అన్నది అమ్మ సుబ్బమ్మ.

"ఇదేమి చెప్పుతావు పోవమ్మా! అందరూ-అన్ని జాతులవారూ చుట్టలు కాలుస్తారమ్మా!" అన్నాడు అబ్బాయి. "అందరూ అదేచేతితో చుట్టపట్టేదీ, మళ్లీ అదే చేతితోనే అన్నిముట్టేదీ!" అనిచెప్పినాడు.

"రామరామ! ఇంక మరి నాకు ఏమీ చెప్పవద్దు నాయనా! నీవు మరియెప్పుడూ పట్నం పోవద్దు." అని చెప్పింది అమ్మ.

"అమ్మా! మామయ్యకూడ సిగరెట్టు కాలుస్తాడే! కాఫీకూడా ఎంగిలిచేసే తాగుతాడు." అన్నాడు అబ్బాయి.

సుబ్బమ్మ "హరహరా!" అంటూ చెవులుమూసుకొని, లేచివెళ్ళిపోయింది.

ఇదంతా వింటూ కూర్చొనియుండిన ఈగ, "అమ్మా! మనం పట్నంపోదాం. అదే మనకు సరియైన ఊరు." అని చెప్పింది పెంటెయీగతో.

"అల్లాగే. రైలుస్టేషనుకు పోదాం. ఎవరిమూట మీదనైనా కూర్చొని అక్కడికిపోయి చేరుదాం. టిక్కెట్టు అడగరు." అన్నది పెంటెయీగ.



# 11. కోడి అంగలార్పు

రామస్వామి యింటికి అల్లుడు వచ్చినాడు. రాకరాక చాలారోజులకు వచ్చినందున ఆ యింటిల్లిపాదికీ ఎంతో ఆనందమయింది. మంచి విందుభోజనానికి ఏర్పాటు జరిగింది. మూడేండ్లయింది వారు సుబ్బారావును చూచి. 'రంగం' నుంచి పిల్లలకు ఏవేవో వస్తువులు తెచ్చినాడు. వారు వాటిని ఎగబడి లాక్కొని ఎగురుతూ దుముకుతూ విచ్చలవిడిగా ఆడుకొన్నారు.

*   *   *   *

"మామా! మన పసికందుల్లో ఒకటి తక్కువ పడుతున్నదే! ఏమయింది?" అంటూ కోడి తనపుంజును ప్రశ్నించింది. "నిన్నరాత్రి ఉన్నది. ఇవాళ చూస్తే లేదు!" అన్నది.

"గద్ద ఏమైనా తన్నుకొని పోయిందేమో!" అన్నది పుంజుకోడి.

"రాత్రివేళ గద్దలురావే! తెల్లవారిన తర్వాత వచ్చేయుంటాయనుకోవడానికి మన మిక్కడనే యున్నాము కదా!" అన్నది తల్లికోడి.

"అయితే మనయింటి యజమానురాలు తీసుకొని పోయి ఉంటుంది." అన్నది పుంజు.

"వారి కెందుకు మన పిల్ల?" అన్నది తల్లికోడి.

"ఓసి వెఱ్ఱిబాగులదానా! ఇంతేనా నీకు తెలిసింది? ఊరికేనేనా మనలను ఇంటిలో ఉంచుకొని పెంచి పోషిస్తారు?" అన్నది పుంజు.

"అయితే ఎందుకు పోషిస్తారు? మనలను తీసుకొని పోయి ఏమి చేస్తారు?"

"అయ్యో! నీ తెలివి పాడుగాను! మనలను తీసుకొని పోయి వారేమిచేసుకొంటారో చెప్పితే నీవు దుఃఖపడుతావు."

"చెప్పు, చూదాం."

"గొంతునులిమి చంపి కూరవండుకొని తింటారు."

"అమ్మయ్యో!" అంటూ కోడి స్పృహతప్పి నిలువునా కూలిపడిపోయింది. తర్వాత కాసేపటికి లేచి "ఏమన్నావు? ఇట్లుకూడ ఉంటుందా?" అన్నది.

"మనం పురుగుపుట్రలను పుంజుకొని పుంజుకొని ...టంలేదూ! అట్లాగే ఈ కిరాతకులు మనలనూ, మన ...నూ లొట్టలు వేసుకొంటూ తింటారు. పచ్చివిగా అన్లే ...లేరుగాబట్టి వండి, వేచి తింటారు."

"నీవు ఉండి ఏమిప్రయోజనం? మగధీరుడిలాగ తెల్లవారుజామున గొంతు చించుకొంటూ పెద్దగా అరుస్తావ్! తీరి కూర్చొని 'కొక్కొరోకో' అని ఊరంతావినేటట్లు బిగ్గరగా కేకలువేస్తావ్! అయితే ఏమిప్రయోజనం? మన పిల్లలను కాపాడడానికే నీకు చేతకాలేదే!" అని ఒక్క విసురు విసిరింది తల్లికోడి.

"ఏమిటమ్మా నీమాటలు? నేను వారి నెదిరించడం సాధ్యమా? మరి నా కేక లంటావా, తెల్లవారుజామున తూర్పున వెలుగు రేకలు పొడసూపగానే నాలోపల నుంచి అప్రయత్నంగా శబ్దం వెలువడి వస్తుంది. నేను దానిని అణచదలచుకొన్నా అణచలేను. అంతేకాని. నేను మహా వీరుడ నని చెప్పుకోవడానికా ఆ అరుపులు? ఒక్కొక్క ప్పుడు నేను వారితో దెబ్బలాటకూడ పెట్టుకొంటాను. అయితే ఆ మొరకులతో దెబ్బలాడి నెగ్గగలనా నేను? వారు చేతిలో దుడ్డుకఱ్ఱలూ కత్తులూ పట్టుకొని ప్రపంచాన్ని పాలిస్తున్నారు." అంటూ పుంజు ఒక్క అరుపు అరిచింది.

"గద్దలే మేలుగా కనబడుతున్నవి." అన్నది తల్లికోడి.

ఇంతలో అక్కడికి ఒక పిల్లి వచ్చింది. వెంటనే పెట్ట కోడి తనపిల్లల నన్నిటినీ సైగగాపిలిచి తనచుట్టూ రెక్కల చాటుకు చేర్చుకొన్నది. మాయమైన ఆ పిల్లన్న క్షణంలో మరిచేపోయింది. కొత్తకలవరంలో పాతవిచా వెనకబడిపోయింది.

మరి కాసేపటికి ఒక పెద్దకుక్క అక్కడికి పరుగెత్తు కొంటూ వచ్చింది. దానిని చూచి పిల్లి ఒక్కఊపున ఉరికి వేపచెట్టు ఎక్కి కూర్చున్నది. అక్కడ ఉండిన ఒక ఉడుత పరుగెత్తుకొంటూపోయి చిటారుకొమ్మలో ఆకులచాటున కొంచెంసేపు దాగుకొనియుండి, అక్కడనుంచి ఇంకొక చెట్టు మీదికి ఎగిరిదుమికి కీచుకీచు మని శబ్దంచేసింది.

లోపల సుబ్బారావూ, రామస్వామీ 'రంగం'లో పనిపాటులు చేసుకొనే ప్రజల జీవితాన్ని గురించి మాట్లాడు కొంటున్నారు. కుఱ్ఱవాండ్లు చుట్టూచేరి వింటున్నారు.

" అన్యాయం, అన్యాయం!" అన్నది రామస్వామి భార్య. ఎవరి అంగలార్పు వారిది!



# 12. రాజు వేషం

ఒకనాడు ఒక గ్రామంలో వీధినాటకం వేసినారు. అందులో ధూపాత్తుల అంజినప్ప రాజువేషం వేసినాడు. ఆట ముగియగానే ఆ ఉడుపులతోనే ఇంటికిపోయినాడు. ఎవరికిచ్చిన ఉడుపులు వారు సొంతంక్రింద తీసుకొనిపోవచ్చు నని ఆదిలోనే ఏర్పాటయింది. ఆటఆడినందుకు వారికి అదే ప్రతిఫలం.

ధూపాత్తుల రాజు ఉవ్వేత్తు కుతూహలంతో ఇంటికి నాడు. వేషాలువేసిన ఇతరులు తమకు లభించిన పులను భద్రంగా తీసి మడిచిపెట్టుకొన్నారు. కాని,

ధూపార్తుల అంజినప్పమాత్రం తన రాజుదుస్తులతో అట్లే ఉండిపోయినాడు.

"వేషం విప్పివేయండి" అన్నది భార్య. ఆమె చాలా మంచిది. మగని మనసు కనిపెట్టి, అతనికి కావలసినదంతా పరామరికగా చేస్తూఉంటుంది. అంజినప్పకుకూడ ఆవిడ మీద చాలా ప్రేమ. కాని ఆనాడు మిక్కిలి కోపంగా ఉన్నాడు. రాత్రినాటకంలో రాజు కోపంగా ఉండినాడు. దానిని అట్లాగే పెట్టుకొని అతడు ఇంటిలోకూడ భార్యను గద్దించినాడు.

"తలకు మించి మాట్లాడవద్దు. నేను రాజునన్న సంగతి తెలుసునా ?" అన్నాడు.

భార్యకు ఏమీ అర్థం కాలేదు. భయపడిపోయింది. మగనికి పిచ్చి యేమైనా పట్టిందేమోనని హడలిపోయింది. ఉదయం చూచుకొందామని ఊరికే ఉండిపోయింది.

మఱునాడు ఉదయంకూడ ధూపార్తుల రాయడు తాను రాజుననే ధోరణిలోనే "మంత్రీ!" అని పిలిచినాడు. వారి ఇంట్లో ఒక కుక్కను సాకుతూఉండినారు. దాని పేరు 'మంత్రి.'

"మంత్రీ!" అని అంజినప్ప పిలువగానే అది తననే యజమాని పిలుస్తున్నాడనుకొని తోక ఆడించుకొంటూ దగ్గరకు వెళ్ళింది.

"రా, వేటకు పోదాం" అన్నాడు 'రాజు'. తోనే బయలుదేరినాడు.

"అయ్యో! ఆ వేషంతో వెళ్లకండి." అన్నది భార్య. చూచినవారు నవ్విపోతారని భయపడి ఆవిడ మగనిని వారించింది.

"నా ముద్దుల దేవీ! ఓ నా రాణీ! శత్రువులు వచ్చినారు. నేను యుద్ధానికి పోవలెను. అడ్డుపెట్టవద్దు." అన్నాడు 'రాజు'. నాటకంలో అటువంటి ఘట్టం ఒకటి ఉంది. దాని ప్రకారం నడచుకొన్నాడు.

"అయ్యో! నారాత!" అని భార్య వాపోయింది.

"దుఃఖపడవద్దు. నేను త్వరలోనే జయమాలతో తిరిగి వస్తాను." అంటూ అంజినప్ప వీధివెంటబడిపోయినాడు. కుక్కకు బలే సంతోషం. వెంబడినే వెళ్ళింది.

అలా వెళ్ళుతూ ఉండగా దారిన ఒక నక్క తారసిల్లింది. దానికి సంగతి బోధపడింది.

"అయ్యా! ధూపార్తుల మహారాజా! దేశంలో రాజులందరి వేషమూ కడగట్టిపోయింది. తమ నాటకం ఒక రాత్రి నడిచింది. తక్కిన రాజుల నాటకం కొన్నాళ్ల పాటు సాగింది. కాని, అదికూడ అంతుగట్టిపోయింది. తాము వెనుదిరిగి నగరికి వేంచేయవచ్చు" అని చెప్పింది నక్క.

ఆ నక్క మంచినక్క. వార్తాపత్రికలు బాగా చదువుతూవచ్చిన నక్క. జమీందారీల రద్దు, 526 మంది రాజాధిరాజుల రంగనిష్క్రమణ అన్నీ చదివికూర్చున్న గుంటనక్క అది.

"మంత్రీ!" అని ధూపార్తుల రాయడు తన మంత్రిని పిలిచినాడు. "నిజమా, నా మంత్రీ! ఈ నక్క మాటలు నమ్మవచ్చునా? నీ భాషలో చెప్పు, నాకు బోధపడుతుంది." అని అడిగినాడు.

యజమాని తనను ఈ విధంగా అడిగినందుకు కుక్క పరమానందం చెందింది. "ఊఁ, ఊఁ" అని మెల్లగా శబ్దం చేసింది.

ధూపార్తుల రాయడు ఇంటివైపు మళ్ళినాడు. నక్క పాటికి నక్క అక్కడ ఉండిన ఒక కోడిపిల్లను కాస్తా నోట కవ్వుకొని పారిపోయింది. తల్లికోడి మరి చేసేదిలేక 'కొక్, కొక్' అని తన తక్కిన పిల్లలను పిలుచుకొని గుడిసెలోపలికిపోయి దూరింది.

"అందరు రాజులూ అంతరించిపోయినారు. నేను కూడ ఇక ఊరికే ఉండిపోతాను." అని అంజినప్ప తన భార్యకు మాటయిచ్చినాడు. ఆవిడకూడ విచారం మాని సంతోషంగా ఇంటిపనుల్లో నిమగ్నురాలయింది.



## 13. ఒక కప్ప కథ

పొలంలో ఒకగట్టుమీద కూర్చొని ఒకకప్ప తన పాటికితాను, మరేమీ చూడకుండా, ఏదో యోచనచేసుకొంటూ ఉంది. ఒకపాము దానివెనకనేవచ్చి దానిని గబుక్కున మింగివేసింది.

చచ్చిపోయిన కప్ప బ్రహ్మ దగ్గరకు వెళ్లింది. అది ఏపాపమూ చేసిందికానందున బ్రహ్మ సంతోషంగా "రా అమ్మా, రా" అని దానిని ఆహ్వానించినాడు. "నీకేమి కావలెనో చెప్పు. మళ్ళీ కప్పజన్మమే కావలెనా, లేక మనిషి జన్మం కోరుకుంటావా?" అని అడిగినాడు.

"స్వామీ! నాకు పాముజన్మ మిప్పించండి" అని కోరింది కప్ప.

"సరే, పో! మంచిబుద్ధి రాగానే తిరిగిరా" అన్నాడు బ్రహ్మ.

పాముపై తనకుండిన భయంచేత పామయిపోతే ఇక భయంలేదనుకొన్నది కప్ప. బ్రహ్మవద్ద వరంపుచ్చుకొని పామయిపోయి తిరిగి యథాప్రకారం వెనుకటిపొలానికి వచ్చి చేరింది.

ఒకనాడు ఆ పొలంచేసే రైతూ, అతనికుమారుడూ గ్రామంలోనుంచి పొలానికి వస్తున్నారు. పిల్లవాడు వెనక వస్తున్నాడు. తండ్రి చేత ఒక కఱ్ఱపట్టుకొని ముందు నడుస్తున్నాడు.

పామును చూడగానే ఆ తండ్రి "ఆగు మల్లన్నా! అక్కడే ఆగు." అని కొడుకుకు చెప్పి కఱ్ఱపుచ్చుకొని పాముపై మంచిదెబ్బ వేసినాడు. ఆదెబ్బకు అది అదిరిపోయి చుట్టుకొని చుట్టుకొని పొర్లుపెట్టింది. రైతు దెబ్బపై దెబ్బ వేసి దానిని చంపివేసినాడు.

"నేనేమీ చేయలేదు. నాపాటికినేను సంజమొండను అనుభవిస్తూ పడియుండినాను. ఆ మనిషి అకారణంగా

నన్ను కొట్టి కొట్టి చంపివేసినాడు.'' అని కప్ప బ్రహ్మవద్ద చెప్పుకొన్నది.

''కప్పగా ఉండినప్పుడు నీవు పాముకావలె నన్నావు. ఇప్పు డేమి కోరుకొంటావు? నీ వే పాపమూ చేయలేదు. కోరుకో.'' అన్నాడు బ్రహ్మ.

''నన్ను కఱ్ఱగా చెయ్యి. ఇదే నా కోరిక. ఆ మనిషిని కొట్టి చంపివేయవలె'' నని చెప్పింది.

''వత్సా! మొదట చెట్టయి తర్వాత కఱ్ఱ కావలసియుంటుంది. ఒక్కసారి కఱ్ఱగా పుట్టడం పొసగ'' దన్నాడు బ్రహ్మ.

''సరే. అయితే, నన్ను వేపచెట్టును చెయ్యి'' అన్నది పాము.

''నీ వడిగింది సరి. ఏ చెడూ చేయని వేపచెట్టయి పోతావు, పో'' అన్నాడు బ్రహ్మ.

వేపచెట్టు ఏపుగా పెరగ నారంభించింది. బాగా ఎదిగింది. గమగమ మని పూలు పూసింది. పిమ్మట నిండుగా కాయలు కాచింది. ఊళ్ళో పిల్లలువచ్చి వేపపండ్లు ఏరుకొని పోయి గింజలుతీసి ఎండబెట్టి గానుగకు వేసినారు. నూనె తియ్యమన్నారు.

''అయ్యో! నాబిడ్డల నిట్లు గానుగలో వేసి హింసిస్తున్నారే!'' అని వేపచెట్టు ఏడ్చింది. కొన్నాళ్ళకు ఆ దుఃఖం మరచిపోయి మళ్ళీ పూసింది. మళ్ళీ కాచింది. ఆ సంవత్సరం కూడ గింజలను తీసుకొనిపోయి నూనెకై గానుగకు వేసినారు. మళ్ళీ చెట్టు కన్నీరు కారుస్తూ ఏడ్చింది.

ఇట్లే వేపచెట్టు పెక్కు సంవత్సరాలు దుఃఖంతో గడిపింది. పిమ్మట ఒకనాడు ఒక రైతు గొడ్డలిపట్టుకొని వచ్చినాడు. చెట్టును కొట్టి కూల్చినాడు. ఆచోటు చక్క జేసుకొని జొన్నగింజలు చల్లుకొని పంట వేసుకొందామని ఆ రైతు ఈ పని చేసినాడు. కూల్చిన ఆ మొద్దులనుంచీ వంటచెరుకుకూ, గుడిసెవేసుకోవడానికి కలపకూ పోను మిగిలినదానిలో ఒక మంచి కఱ్ఱకూడ చెక్కితీసుకొన్నాడు.

ఆ కఱ్ఱపుచ్చుకొని ఆ రైతు—వాడు కొంచెం మొరటుమనిషి—అందరినీ బెదిరిస్తూ ఉండినాడు.

ఒకనాడు ఒక కొట్లాటలో ఆ కఱ్ఱతీసుకొని ఒకనిని కొట్టినాడు. వానికి బలమైన దెబ్బతగిలింది. వాడు కోర్టులో కేసువేసినాడు. కొట్టిన ఆ రైతుకు తగిన శిక్ష విధించి, కొట్టడానికి ఉపయోగించిన ఆ కఱ్ఱను తగులబెట్టివేయవల సిందిగా న్యాయమూర్తి తీర్పు చెప్పినాడు. కఱ్ఱ తగులబడి పోయి పిడికెడు బూడిద అయింది.

''నాకు మఱుజన్మం వద్దు మహానుభావా!'' అని కఱ్ఱ బ్రహ్మతో మొరపెట్టుకొన్నది.



## 14. ఒడిలో మూటలు

ఆనందతీర్థస్వాములవారి ఆశ్రమానికి ఒక వృద్ధుడు వచ్చినాడు. సద్గతిచెందే దారి చూపించవలసిందిగా స్వాములవారిని వేడుకొన్నాడు.

స్వాములవారు ఉపదేశవాక్యాలేవీ చెప్ప లేదు. "ఈ ఊరికి మీరువచ్చిన కారణమేమి?"టని అడిగినారు.

"మనుమనికి ఒక మంచిచోటుచూచి వివాహం చేద్దామని పిల్లను చూచిపోవడానికి వచ్చినా"నన్నాడు ఆయన.

"వచ్చినపని ముగిసిందా?"అని స్వాములవా రడిగి నారు.

"ఒకవిధంగా ముగిసింది." అన్నాడు.

"నా వద్దకు ఎందుకు వచ్చినారు?" అని అడిగినారు స్వాములవారు.

"అందరూ మీవద్ద ఉపదేశం పొంది వస్తున్నట్లు చెప్పినారు. నేనూ చూచిపోదామని వచ్చినా" నన్నాడు.

"రండి! ఏటిగట్టుకు పోదాం!" అని చెప్పి ఆయ నను వెంటబెట్టుకొని ఏటిగట్టుకు వెళ్లినారు స్వాములవారు.

ఏటి అవతలిగట్టున పెద్దతిరుణాల. ఇవతలిగట్టునఉన్న గ్రామస్థులు ఆ తిరుణాలకు పడవయెక్కి పోవడానికై యేటి గట్టున చాలామంది చేరిఉన్నారు.

"పడవలో బరువులు ఎక్కించగూడదు. మంది మాత్రమే ఎక్కవచ్చు" నన్నాడు సరంగు.

ఒక కాపు మూటతోపాటు పడవయెక్కబోగా సరంగు ఆక్షేపించినాడు.

"మూటను నీవెక్కించుకోవద్దు. నాఒళ్ళో నేను పెట్టు కొని కూర్చుంటాను. ఎందు కడ్డుపెట్టుతావు?" అన్నాడు కాపు.

"నీవు మూటను నీ ఒళ్ళో పెట్టుకొని కూర్చుంటే కూర్చునేవు. కాని, నిన్నూ నీమూటనూ రెంటినీ తాళ గలిగేవద్దా ఈ పడవ? ప్రతివారూ ఇట్లే మూటలు తెచ్చు కొని కూర్చుంటే నా పడవ బుడుంగున మునిగిపోతుంది." అన్నాడు పడవవాడు.

"అయితే మూట నేమి చెయ్యమంటావు? మూట లేకుండా నేను అవతలవెళ్లి ఏమిచేసేది?" అని కలవర పాటుతో కాపు వాదించినాడు.

సరంగు మహా నిష్కర్షపుమనిషి. ఏమైనాసరే మూటలు పడవలో ఎక్కించగూడనే కూడదని చెప్పి "మూటలు పెట్టుకొన్నవారు దయచేసి దిగం" డని చెప్పినాడు.

కొందరు దిగిపోయినారు. మరికొందరు సత్రపు అధి కారికి మూటలు అప్పగించి వచ్చి వట్టిచేతులతో పడవ యెక్కినారు.

మూటలు విడిచిపెట్టలేమన్నవారు దిగబడి పోయినారు.

పడవ కదిలి పోయింది.

"మన మూటలను ఇంకొకరిచేతి కెట్లాయిచ్చేది? తిరుణాల తీరిపోతుందే! మనం వెళ్లడానికి వీలు లేక పోయిందే!" అని దిగబడి పోయినవారు చింతపడినారు.

"ఆ పడవ ఎక్కువ బరువు తట్టుకోలేదు. వట్టి చేతులతో మాత్రమే ఎక్కవచ్చునని మీకు తెలియదా?" అన్నాడు సత్రాధికారి.

"నేను నామూటను నాబళ్ళో పెట్టుకొని కూర్చున్నప్పుడు పడవ కెందుకు పెద్ద బరువవుతుందయ్యా!" అని కాపు కోపంగా అన్నాడు.

మూర్ఖునితో ఏమివాదించి ఏమిలాభమని అతనితో ఎవరూ వాదన పెట్టుకోలేదు.

"చూచినారా?" అన్నారు స్వాములవారు.

"చూచినాను. ఇందులో విశేషమేమున్నది?" అన్నాడు మనుమనికి పిల్లను చూడవచ్చిన ఆ తాత.

"సద్గతికి వెళ్లేమార్గం చూపమంటిరే! అందుకు మీరు మొట్టమొదట చేయవలసింది మీ మూటలను భగవంతునికి ఒప్పగించడం. అది మీకు ఇష్టమేనా మరి?" అన్నారు స్వాములవారు.

"ఇంట్లో ముసలిదానితో యోచించే చెప్పవలసి ఉంటుం" దన్నాడు ముదుకడు.

"మరి తిరుణాల తీరిపోతుందే!" అన్నారు స్వాములవారు.



# 15. కోర్టులో పిచ్చుకలు

జిల్లాకోర్టులో జడ్జి రామలింగస్వామిగారు కేసువిచారిస్తున్నారు. కొత్తగా ఆ పదవికి వచ్చినవారైనందువల్ల బహుఉత్సాహంగా, సాక్షులకు పరిశ్నలపైన ప్రశ్నలు వేస్తూ ఇరుకక్షుల న్యాయవాదులనూ తొందరపెట్టుతూఉండి.

నారు. కొత్తగా అమలుకు వచ్చిన వివాహరద్దు చట్టంక్రింద వచ్చిన ఒక కేసు అది.

వాది భార్య; ప్రతివాది భర్త. వారిద్దరికీ వివాహమై సంవత్సరంనర అవుతుంది. భర్తకూ తనకూ పొసగ లేదనీ, ఆయనగుణాలకూ తన మనఃప్రవృత్తికీ సంతన సరిపో లేదనీ భార్యవాదన.

ప్రతివాది దీనిని ఒప్పుకోలేదు. కాదని ఆక్షేపించి నాడు. వాది వకీలు బ్రహ్మయలింగంగారు. చిన్నవయ స్సయినా సామర్థ్యశాలి. ప్రతివాది వకీలు వాసుదేవరావు గారు. వృద్ధులు. పాతతరహా.

సాక్షులవిచారణ మధ్యలో రెండు పిచ్చుకలు కోర్టులో పైన కిటికీవద్ద కూర్చొని కిచకిచమని రొదచేస్తూ ఉండినవి.

వాసుదేవరావుగారికి సాక్షి చెప్పింది సరిగా వినిపించ లేదు. ఆయనకు కొంచెం చెముడో ఏమో! అందువల్ల మాటిమాటికీ "ఏమిటి, ఏమిటి!" అని అడుగుతూఉండినారు.

"ఈ పిచ్చుకలగొడవ ఎక్కువయిపోయింది." అన్నారు జడ్జీ రామలింగస్వామిగారు.

'వెఱ్ఱిప్రజలు ఈ విధంగా వివాహరద్దుకు కేసులు పెడతారే!' అని పిచ్చుకలు నవ్వుతున్నాయని వాసుదేవ రావుగారన్నారు.

అందుమీదట పిచ్చుకలు ఇంకా నవ్వనారంభించినవి. వకీలుచెప్పింది వాటికి తెలిసిపోయింది.

"ఏమి, నీవుకూడ కోర్టుకుపోతావా?" అన్నది మగపిచ్చుక.

"ఛీఛీ! ఎన్నటికీపోను" అన్నది ఆడపిచ్చుక.

ఈ పిచ్చుకలగొడవతో అసలుకేసు చెడిపోయేటట్టు కనిపించింది బ్రిహ్మాయలింగంగారికి. వాసుదేవరావుగారు మాత్రం నవ్వుతూనే సాక్షులను అడ్డువిచారణ చేస్తున్నారు.

కేసువిచారణ వాయిదావేస్తే బాగుంటుందనుకొని "నాకేమో తలతిరుగుతూఉన్న" దని చెప్పి వాయిదా అడిగినాడు వాదివకీలు.

తల తిరుగుతున్నదని వాదివకీలు చెప్పగానే, పాపం, వాసుదేవరావుగారికి మరి ఆక్షేపించడానికి అవకాశం లేకుండాపోయింది. "యువకులందరికీ ఇలా వ్యాధులు రావడానికి కారణం ఏమి"టని మాత్రం అడిగినారు.

"వీరికి పిల్లలులేరు కాబోలు! పిల్లలేగనుక ఉంటే ఇలా కేసువేస్తుండా భార్య?" అన్నది ఆడపిచ్చుక.

"అప్పుడూ వేస్తారు." అన్నది మగపిచ్చుక.

అటుపిమ్మట 'మనకు వీరి సంపర్కం వద్దంటూ మగపిచ్చుక అక్కడనుంచి లేచి పక్కన ఉన్న కిట్టడానికి ఎగిరిపోయింది. ఆడపిచ్చుకకూడ దాని వెనువెంటనే తుఱ్ఱుమన్నది.

"ఈ పిచ్చుకలకు సంస్కరణల సమాచారమే తెలియనట్లున్నది. వాటిలో ప్రచారం సాగించవలె" నన్నది అక్కడఉండిన ఒక వానరం.



# 16. గజ్జికుక్క

కామసముద్రి మనే ఒక గ్రామంలో రామకృష్ణ శెట్టిగారు మహాధనవంతులు. ఆ ఊరిలో సగం పంటభూమి ఆయనదే. ఆయన ఇల్లు ఒక్కటే ఆ ఊరిలో మేడ. మిగిలినవన్నీ పెంకుటిండ్లూ, పూరిగుడిసెలూ.

ఆ ఊరిలో కుక్క లెక్కువ. అవి ఎంగిలాకులు నాకి తింటూ జీవనం సాగిస్తుంటాయి. రాత్రుళ్ళల్లా అరుస్తుంటాయి. కన్నపుదొంగలు ఆ జిల్లాలో ఎక్కువ. కాని, వారు కామసముద్రం పొంతలకు మాత్రం రారు. కుక్కలు మొరుగుతాయి; పని జరగదని వారు ఆ ఊరిని వదలిపెట్టి వేసినారు. వేరే ఊళ్ళలో అప్పుడప్పుడు ఏదైనా సంపాదిస్తారు. ఇది చాలాకాలంకింద నడచిన కథ. ఇప్పుడు ఆ జిల్లాలో కన్నపు దొంగతనాలు చేసే ఎఱుకలు లేనేలేరు.

ఒక గజ్జికుక్క ఎప్పుడూ శెట్టిగారి యింటివాకిటి తిన్నెమీద పండుకొని ఉంటుంది. శెట్టిగారి కడగొట్టుకొడుకు తన ఎంగిలి విస్తరిని తానే తెచ్చి వీధిలో పడవేస్తూ ఉంటాడు. అందులో ఒక పిడికెడు అన్నం మిగిల్చి ఉంటాడు. ఆకుకు అంటుకొనియున్న నేతిజిడ్డును కూడ కుక్క అతి ఆప్యాయంగా నాకుతుంది. అది ఎప్పుడూ అక్కడే పండుకొని ఉంటుంది. పెద్ద శెట్టిగారూ, ఆయన సేవకులూ ఎంతో చూచినారు. దానిపైన రాళ్ళు రువ్వి తరుముతారు. అది కుయ్యోమని అరుస్తూ పారిపోతుంది. వారు తలుపులు మూసుకొని లోప

లికిపోగానే మళ్ళీ అక్కడికే వచ్చి అరుగుమీద పండు కొంటుంది.

ఒక కొత్త ఎఱుకలముఠా వచ్చింది. వారు పగటి పూట వెదురుబద్దలు చీల్చి బుట్టలూ తట్టలూ చాపలూ అల్లుతారు. కుక్కలతో మెల్లగా స్నేహంచేసినారు. ఇప్పుడు అవి వారిని చూచి మొరిగినా మెల్లగానే మొరుగుతాయి.

ఆ నాడు అమావాస్య దాటి మూడోరోజు. ఆది వారం. రాత్రి రాగిరొట్టెలను విసిరి వాటినోరు మూయించి నారు. అవి అరవనేలేదు. ఒక యింటిలో అన్నంతినే కంచు కంచాలు రెండు కాజేసినారు. ఇంకొక యింటిలో రెండు కోళ్ళను పట్టుకొని సంచిలో వేసుకొన్నారు. చివరకు శెట్టిగారి యింటివద్దకు వచ్చినారు. గజ్జికుక్క మొరిగింది. రొట్టెముక్క విసిరినారు. అయినా కుక్క మొరుగుతూనే ఉండింది. ఆ శబ్దానికి శెట్టిగారు మేల్కొని "ఈ పాడుకుక్కతో నెమ్మదిగా నిద్రపోవడానికి కూడ లేకుండాఉంది." అంటూ కోపంగా బయటికివచ్చి దుడ్డు కఱ్ఱతో కుక్కను దబదబా బాదినారు. కుక్క 'కుయ్యో కుయ్యో' అంటూ పరుగెత్తింది. పిమ్మట శెట్టిగారు తలుపు వేసుకొని పండుకొన్నారు. అయినా, నిద్రపట్టక ఆయన తన భార్యతో సంభాషణ పెట్టుకొన్నందువల్ల వెలుపల నక్కికొనియుండిన దొంగలు ఇక అక్కడ పనిజరగదని వెళ్ళిపోయినారు.

మరురోజు వాడుకమేరకు శెట్టిగారి అబ్బాయి తన ఎంగిలివి స్తరి తెచ్చినాడు. కుక్క తోక ఆడించుకొంటూ తయారుగా వచ్చింది.

"నీ మూలంగానే శేషూ, ఈ కుక్కగొడవ!" అన్నారు పక్కనే చెయ్యి కడుగుకొంటూ పెద్ద శెట్టిగారు.

"అయ్యో పాపం! తోక ఆడించుకొంటూ వస్తుంది. —నాన్నా! కుక్కకు పుండ్లువస్తే మందులేదా?" అన్నాడు శేషు.

"మందు తెచ్చి కుక్కకు రాస్తావు కాబోలు! బాగుం దయ్యా నీ వ్యవహారం!" అన్నారు శెట్టిగారు.

* * * *

గజ్జికుక్కవల్ల నిజమైన ఉపద్రవం ఆ ఎటుకల జట్టుకుకదా తెలుసు? శెట్టిగారే మెరుగుదురు?



# 17. వేపచెట్టు తపస్సు

అది ఒక పాత వేపమాను. దానిపక్కనే ఒక చిన్న వేపచెట్టుకూడ చక్కగా, నవనవలాడుతూ పెరిగి వస్తున్నది.

'అమ్మా, నేనుకూడ నీవలెనే చేదుగానే పెరుగు తానా?' అని జిజ్ఞాసతో అడిగింది పిల్లచెట్టు.

'కాక, ఇంకెట్లు పెరుగుతావు? అట్లే పెరుగుతావు. ఏమి! అది నీకు ఇష్టంలేదా?' అన్నది ముసలివేము.

'మందుకూ, మంత్రానికీ మాత్రమే నీ దగ్గరకు అందరూ వస్తారు. రుచు లనుభవించడానికి వచ్చినవారి నెవరినీ నేను చూడనే లేదే!' అన్నది పిల్ల వేము.

'మందులూ, మంత్రాలేకదా దుఃఖాన్ని తీరుస్తాయి! తియ్యనిపండు ఏమి యిస్తుంది? నిలుకడయిన సుఖాన్ని ఇవ్వనే ఇవ్వదు. నేనున్న పరిస్థితిలోనే నాకు తృప్తి. నీవూ అట్లే ఉండు, బిడ్డా!' అన్నది తల్లిమాను.

'నాకు చాలా ఆశగా ఉన్నది. మంచి కరివేపచెట్టు కావలెనని మహాఆశపడుతున్నాను.' అన్నది పిల్లచెట్టు.

'వద్దు బిడ్డా! వద్దు. నావలె నీవుకూడ దీర్ఘాయుస్సు గలిగి సుఖంగా ఉండు. ఇతరుల సుఖంసంగతి మనకు వద్దు. అదిచూచి ఆశపడితే కీడుకలుగుతుంది.' అని ముదివేము నీతులు చెప్పింది.

పిల్లచెట్టు వినలేదు. 'నేను వేపమాను కానేకాను.' అని ఖచ్చితంగా తీర్మానించుకొన్నది. గణపయ్యను వేడుకొని వరం సంపాదించింది. వేపచెట్టు కాస్తా కరివేపచెట్టుగా మారిపోయింది.

మూడు నాలు గడుగుల యెత్తు ఎదిగిందో లేదో పక్కన ఉన్న ఇండ్లవా రందరూ వచ్చి వంటకాలకై తలా ఇన్ని కరివేపపోచలు కోసుకొని పో నారంభించినారు. కనికరం గలిగిన కొందరు ముదురు ఆకులుగా చూచి కోసుకొని పోయినారు. కొమ్మలు కొమ్మలుగానే కోసుకొని పోయినారు కొందరు.

మరికొందరు వెతికి వెతికి లేతాకుపోచలుగా చూచి కోసుకుపోయినారు. వంటకాలకు అవే చాలా రుచి అని వారు అట్లా చేసినారు. మిగిలిన చెట్టును కాస్తా ఒకనాడు ఒక మేక వచ్చి తిని పోయింది.

వేపవేరు మాత్రం నేల లోపల ఇంకా ఉంది. గణపతివరం వేరువరకూ వెళ్ళలేదు. ఇట్లా అవుతుంది అని ఆయనకు ముందే ఎఱుకకదూ!

'అమ్మా! నాకు బుద్ధివచ్చింది' అన్నది వేరు, తల్లి మానును చూచి దీనస్వరంతో.

'ఇంకా ఉన్నావా, బిడ్డా!' అని అడిగింది తల్లి మాను.

'అమ్మా! చాలు. నేను ఆశపడడం పొరబాటు. చేదుమానుగా ఉండడమే మంచి దని ఇప్పటికి తెలుసుకొన్నాను. నాకు బ్రతుకుదెరువు కాస్త చూపించు.' అని అనుగుకొన్నది వేరు.

'మళ్ళీ గణపతిని వేడుకో.' అన్నది తల్లిమాను. 'నేనుకూడ నీకోసం వేడుకొంటా' నన్నది. చెప్పినట్లే తన భక్తినంతా వినియోగించి తన బిడ్డకై ప్రార్థన చేసింది.

వేరు చిగిర్చింది. వేపచెట్టుగా చక్కగా పెరిగింది. గ్రామస్థులు కరివేపాకుకోసమని మళ్ళీవచ్చినారు. ఒకచే చేదుగా ఉండడం చూచి వట్టిచేతులతో వెళ్ళిపోయినారు. చెట్టును నిరాటంకంగా పెరగనిచ్చినారు. ఊరికోళ్ళు వచ్చి చెట్టుకింద నేలను పురుగులకోసమై ఇష్టంవచ్చినట్టు గీరి తవ్వి

పెట్టినవి. తమ తిండికి పురుగులకై అవి అట్లుచేసినవి. కాని, అది చెట్టుకు మంచి దయింది. విసవిస ఎదిగివచ్చింది. కొమ్మలు, రెమ్మలు కోసుకొనిపోయేవారు ఇప్పుడు ఎవరూ లేరు. తల్లిమాను పువ్వులుకూడ దానిపైన సంతోషంగా రాలినవి.



# 18. పాటుపడి బ్రతుకు

ఒక బీదకాపు కృష్ణపరమాత్మను పరమభక్తితో పూజిస్తూ వచ్చినాడు. భగవంతుడు అతనియందనుగ్రహించినవాడై 'నీకేమి కావలెనో కోరుకో, ఇస్తాను. అయితే ఒక్క సంగతి. నీకు ఇచ్చింది అందరికీ ఇస్తాను. దేనినిగాని నీ కొక్కనికిమాత్రమే ఇవ్వడానికి వీలుపడదు' అన్నాడు.

'గోపాలా! నాకు కావలసింది నాకు ఇస్తేసరి. అది నీవు అందరికీ ఇస్తేమాత్రం నా కెందు కాక్షేపణ? నే నంత కుత్సితబుద్ధి కలవాణ్ణి కానుసుమా! నా కెవ్వరియెడలా అసూయ లేదు' అన్నాడు కాపు.

'నీవు చాలా మంచివాడవు. నాకు తెలుసు. నీకు కావలసింది కోరుకో. నీ భార్యతో యోచనచేసి అడుగు. తర్వాత మార్చుకోవడానికి వీలుండదు.' అన్నాడు శ్రీకృష్ణుడు.

'అట్లే స్వామీ! భార్యతో ఆలోచించి చెప్తాను. నిన్ను చూడగానే నా మెదడు కలగిపోయింది. రేపు అడుగవచ్చునా?' అన్నాడు కాపు.

'అట్లే చెయ్యి' అన్నాడు శ్రీకృష్ణుడు.

కాపు ఆరాత్రి భార్యతో యోచన చేసినాడు. తన భర్త సంపాదించిన వరానికి భార్య చాలా సంతోషించింది. ఇది అడుగుదామా, అది అడుగుదామా అని ఇరువురూ చాలాసేపు యోచన చేసిచేసి చివరకు ఒక తీర్మానానికి వచ్చినారు.

మరుసటిరోజు కాపు కృష్ణపరమాత్మను ధ్యానించినాడు. భగవంతుడు నవ్వుకుంటూనే దర్శన మిచ్చినాడు.

'వత్సా! ఏమి తీర్మానించుకొన్నావు?' అన్నాడు.

'కరుణాసింధూ! కోపగించకు. నేను బీదను. అంతగా జ్ఞానములేనివాడిని. అందువల్ల నీవు చెప్పినట్లు భార్యతో యోచన చేసినాను.' అని ఆరంభించినాడు.

'ఎందుకు నసుగుతావు? ఏది కావలెనో కోరుకో. ఇస్తాను. అది ఊళ్ళో అందరికీకూడా లభిస్తుం దన్న సంగతి మాత్రం జ్ఞాపకం పెట్టుకో.' అన్నాడు శ్రీకృష్ణుడు.

'మహాప్రభూ! నా పెట్టెనిండా డబ్బు ఇప్పించు. అన్నీ వెండిరూపాయలుగానే ఉండవలె సుమా! ఎంత తీసినా తరుగకూడదు. ఇదే నా కోరిక' అన్నాడు కాపు.

'వత్సా! నీకు ద్రవ్యాశ ఎందుకు పట్టుకొన్నది?' అని గోవిందుడు తామసించినాడు.

'ఏమైనా సరే, నేను కోరేది ఇదే' నని కాపువాడు వినయంగానే మొండిపట్టు పట్టినాడు.

'అట్లయితే సరే. అభీష్టసిద్ధిరస్తు' అంటూ గోవిందుడు అంతర్ధాన మయినాడు.

'డబ్బుంటే సరి, ఏమైనా సాధించవచ్చు. ఏమి కావలె నంటే అది పొందవచ్చు. ఎట్టిదయినా సంపాదించవచ్చు. కాబట్టి అటువంటి వరం అడుగు' అని భార్య చెప్పిన యోచనకు కాపు సరే నని ఒప్పుకొని ఈ వరం అడిగి పుచ్చుకొన్నాడు.

వరం ప్రకారమే పెట్టె రూపాయలతో నిండి పోయింది. వెంటనే కాపు చేతినిండా రూపాయలు తీసుకొని పక్కనున్న పేటలోని బట్టల దుకాణానికి వెళ్లినాడు. ఇల్లాలికి రెండు మంచి చీరలు తెద్దామని పోయినాడు.

దారియంతటా ఎవరు చూచినా, అందరూ ఏదో బహు కుతూహలంగా ఉండడం గమనించినాడు. గోవిందుడు తనకు ప్రసాదించిన వరం అందరికీ లాభించి ఉంటుందన్న సంగతి అతడు మొదట మరచిపోయినాడు. తర్వాత జ్ఞాపకానికి వచ్చింది. ఊళ్ళో అందరూ సంతోషంగా ఉండడం చూచి అతడూ ముచ్చట పడినాడు. బట్టలదుకాణంలోకి వెళ్ళినాడు.

రెండు మంచిచీరలు ఇమ్మన్నాడు.

'మీరు ఏమి ఇస్తారు?' అని అడిగినాడు అంగడివాడు.

'ఎంత వెల చెప్పుతారో అంత ఇస్తా' నన్నాడు.

'వెలనా? మాకు డబ్బు అక్కరలేదు. డబ్బును ఇప్పుడు ఎవ్వరూ లెక్క చెయ్యడం లేదు. అది అందరి చేతుల్లోనూ సమృద్ధిగా ఉంది. ఎన్ని బస్తాల బియ్యమిస్తారో చెప్పండి' అన్నాడు అంగడివాడు.

'రూపాయలకు ఎందుకు మదింపు లేదు? వాటి కేమ యిం'దన్నాడు కాపువాడు. అంగడివాడు తమాషా చేస్తున్నా డనుకొన్నాడు.

'ఇప్పుడు అందరిదగ్గరా రూపాయలు కావలసినన్ని, కొరతపడకుండా ఉన్నాయి. ఇప్పుడు ఎవరికీ డబ్బు అవసరం లేదు. ఈ సంగతి మీకు తెలియదూ?' అన్నాడు అంగడి వాడు. కాపువాడికి విషయం బోధపడలేదు. పక్క దుకాణా నికి పోయినాడు. 'బియ్యమో, పప్పులో, వేరుసెనగలో ఏవైనా తీసుకొనిరా. డబ్బుమాత్రం వద్దు. అది మావద్ద బండె డున్నది.' అన్నారు అక్కడకూడ.

కాపువానికి దుఃఖం ముంచుకొని వచ్చింది. పిమ్మట ఏ అంగడికి, ఏ వస్తువుకోసం పోయినా ఇదే పరిస్థితి ఎదు రైంది. రూపాయికి మదింపే లేకుండా పోయింది. భార్యా భర్తలు దుఃఖనిమగ్నులై పోయినారు.

'గోవిందా! అన్యాయంగా మోసం చేసినావే!' అని ఏడ్చినాడు కాపు.

'నిన్ను నీవే మోసం చేసుకొన్నావు!' అన్నాడు గోవిందుడు.

'నేనూ, నా కుటుంబమూ ఆకలితో మాడిపోతామే' అని కాపువాడు కంట తడిపెట్టినాడు.

'వరం తిరిగి ఇచ్చివేస్తావా?' అని అడిగినాడు శ్రీకృష్ణుడు.

'సంతోషంగా. నీ వరం నీవే తీసుకొనిపో. నేను ముందువలెనే పాటుపడి బ్రతుకుతాను. అందుకు నీవు తోడు పడితే చాలు' అన్నాడు కాపు ధైర్యంగా.

'అదే మంచిది. నీవూ పాటుపడి బ్రతుకు. అందరూ పాటుపడి బ్రతకనీ' అన్నాడు గోవిందుడు.



# 19. వర మడిగిన వారువం

ఒకప్పుడు గుఱ్ఱం ఎద్దును చూచి అసూయపడింది. 'దీని కెంత మంచికొమ్ములు! అట్టివి నాకు లేవుకదా! ఉంటే ఎంత ఉపయోగంగా ఉండేవి?' అంటూ ఏమేమో యోచించింది.

'కొమ్ములు కావలెను. రెండు నిడుపైన కొమ్ములు కావలెను' అని తపస్సు చేసింది.

తపస్సు ఫలించింది. తలపైన కొమ్ములు మొలుచుకొని వచ్చినవి. కోనేటినీటిలో తనరూపం చూచుకొని గుఱ్ఱం మిక్కిలి సంతోషపడింది. తాను సంపాదించిన కొమ్ములను తలచుకొని తలచుకొని గర్వపడుతూ గుఱ్ఱం గడ్డిమేస్తూఉంది.

తటాలున దేనినో చూచి పరుగెత్తింది. కాని ముందువలె పరుగెత్త వీలుపడలేదు. ఎద్దువలె తడబడుతూ

పరుగెత్తింది. కాళ్ళలో పరుగెత్తే శక్తి ముందువలె లేదు. 'ఉన్నట్టుండి ఏమయింది నాకాళ్ళకు?' అనుకొన్నది.

గడ్డిమేసి ఆకలితీర్చుకొని తీరికగా నిలుచున్నది. కడుపులో ఏమో కలచి నట్లయింది. 'ఇదేమిటి? కడుపులో ఏమో చేస్తున్నట్లున్నదే!' అని మాట ముగించేలోపలనే తిన్నగడ్డి తిరిగి నోటికి వచ్చింది. దానిని మరల నమిలి మింగింది. మళ్ళీ కడుపు కలచింది.

'ఇదియేమి పీడరా దేవుడా!' అని ఒక చెట్టుక్రింద పండుకొన్నది. తిన్నగడ్డి అంతా మళ్ళీ నెమరువేసి నిద్రపోయింది. తర్వాత లేచి నడచింది.

'నాగతి కష్టమయిపోయింది. అచ్చంగా ఎద్దుమాదిరి అయిపోయినాను. ఈ కొమ్ములూ వద్దు. ఈ నెమరువేసే పీడా వద్దు!' అని మళ్లీ వెనుకటివలె కావలెనని, తీవ్ర తపస్సు చేయనారంభించింది. అప్పటి కప్పుడు తనకాళ్ళను చూచుకొన్నది. గిట్టలు ముందుమాదిరిగా లేవు. రెండుగా చీలిపోయినవి. వీపుమీద ఒక ఈగ వచ్చి వాలింది. తోకతో దానిని తోలుకోబోయి తన క్రొత్త తోక చూచుకొని చాలా సిగ్గుపడిపోయింది. 'అయ్యయ్యో! ద్రౌపది తలమీద విరబోసుకొన్న వెంట్రుకలవలె ఉండిన నా తోక కాస్తా ఛాందసబ్రాహ్మడి పిలకజుట్టుగా అయిపోయిందే!' అని దుఃఖం పొంగిపోయి ఏడ్చింది.

'నేను భ్రష్టు నయిపోయినాను. ఈశ్వరా! ఈ కొమ్ములు తిరిగి తీసుకో. నేను మళ్ళీ ముందువలె సుఖంగా ఉండేటట్లూ, నా గిట్టలు యథాప్రకారం ఒక్కటిగా అయ్యే

ఉట్లూ చేసి నన్ను కాపాడు. ఈ తోకను నేను చూడలేకుండా ఉన్నాను. నా పాతతోకను తిరిగి ఇప్పించవూ?' అని మిక్కిలి వ్యథపడి తపస్సుచేసింది.

'అశ్వమా! ఏ మయింది నీకు?' అని అడిగినాడు పరమేశ్వరుడు.

'దేవా! నా కాళ్ళను చూడు. ఇక నేను పరుగెత్త గలనా? ఇదిగో ఈ తోక చూడు. సిగ్గుచేటు.!' అని చెప్పుకొన్నది వారువం.

'ఏమిటి దీనికి? జింకలవలెనూ, ఎద్దులవలెనూ చీలిన గిట్టలూ, కుచ్చుతోకా! వీటికేమి?' అన్నాడు పరమేశ్వరుడు నవ్వుతూ.

'చాలు చాలు! నా పాతగిట్టలే, నా పాతతోకే నాకు హాయి. పైగా ఇదేమిటిది? తిన్నది జీర్ణంకాదు. కడుపులో ఏమోచేసి తిరిగి నోటిలోకి వస్తుంది!' అన్నది, పాపం, గుఱ్ఱం.

'అది అంతే. అట్లే చేస్తుంది. దానికేమి? మళ్ళీ బాగుగా నమలి నెమరువేసి మింగితేసరి.' అన్నాడు శంకరుడు.

'నాకు కలిగే సంతానానికి కూడ ఇదేగతా?' అన్నది గుఱ్ఱం.

'ఔ' నన్నాడు పరమశివుడు.

'అయ్యో! ఈశ్వరా! నా మీద దయఉంచి తప్పించు' అని యేడ్చింది గుఱ్ఱం.

'కొమ్ములు తిరిగి ఇచ్చివెయ్యి' అన్నాడు మహాదేవుడు.

'ఇదిగో, మహారాజుగా తీసికో. నాకు కొమ్ములూ వద్దు, చీలినగిట్టలూ వద్దు. తిన్నది వెంటనే జీర్ణమయ్యేటట్లుండనీ. పండుకొని నెమరువేసే పని నాకు వద్దు. యథాప్రకారం పరుగెత్తుతూ ఎగురుతూ దుముకుతూ బతకవలెనని నా ఆశ.' అని చెప్పి గుఱ్ఱం పరమేశ్వరుని కాళ్ళంటి నమస్కరించింది.

'తథాస్తు' అని పరమశివుడు వరమనుగ్రహించినాడు.



# 20. పంకజం తప్పించుకొన్నది

సాంబశివరావుతండ్రి శంకరరావుగారు విద్యలోనూ, లలితకళల్లోనూ మంచి అభిరుచిగలవారు. కుమారుణ్ణిగూడ అదేస్థితికి వచ్చేటట్లు పెంచినారు. శంకరరావుగారు మరణించినతర్వాతనే సాంబశివరావుకు వివాహమయింది. మేనమామకూతురే. వయస్సు ఇరవైమూడేండ్లు.

పాట బాగా తెలియని భార్య ఉంటేనేమి, లేకపోతేనేమి అని సాంబశివరావు భార్యను కుంభకోణానికి పక్కన మీనాక్షీపురంలో ఒక సుప్రసిద్ధగాయకురాలివద్ద పాట నేర్చుకోవడానికి పంపించినాడు. తోడుకై వెంట ఒక పనిమనిషినిగూడ పంపించినాడు. 'తొందరపడవద్దు. బాగా నేర్చుకొనేరా' అనిచెప్పి పంపినాడు.

ఆ రేండ్లు నేర్చుకొన్నది. సుమారుగా నేర్చుకొన్నట్లు తెలిసింది. అయినా సాంబశివరావుకు నమ్మకమేర్పడలేదు.

చూచి రమ్మని ఒక స్నేహితుని పంపినాడు. ఆయన వెళ్లి గౌరి పాట విని తిరిగి వచ్చినాడు.

'శ్రుతి సరిగానే ఉంది. కాని, తాళమే కొంచెం తృప్తికరంగా లేదు.' అని చెప్పినాడు ఆ స్నేహితుడు. అతడు మహామహా విద్వాంసులు పాడగా విన్నవాడు. అట్టివారి ఆక్షేపణను సాంబశివరావు చట్టున తోసివేయడు.

'అట్లయితే తిరువారూరు సుబ్బయ్యరువద్ద తగిన శిక్షణపొంది రమ్మని చెప్పి రా' అని స్నేహితుని మళ్లా పంపించినాడు.

ఆ ప్రకారమే తిరువారూరులో నాలుగుసంవత్సరాలున్నది గౌరి. సుబ్బయ్యరుగారే సాంబశివరావుకు చెప్పి పంపినారు! 'గౌరికి తాళజ్ఞానం బాగా ఉంది. ఇంకా రెండేండ్లు గనక ఉంటే ఏ కొరతా లేకుండా పాడగలదు. కాని త్వరపడుతున్నది. ఏమిచేయడం?'

ఇది విన్న సాంబశివరావు 'త్వరపడి ప్రయోజనమేమిటి? సంగీతానికీ, తొందరకూ పొసగదు. మరో రెండేండ్లు శిక్షణపొందే రావచ్చు' అని మళ్ళీ చెప్పిపంపినాడు.

రెండేండ్లు గడచినవి. ఆ వెనుకటి స్నేహితుడు లేడు. చనిపోయినాడు. తన కార్యదర్శి ఒక పెద్ద విద్వాంసుని కుమారుడు—ఆనందరంగాన్ని పంపించినాడు. 'పోయిచూచి రండి.' ఎంతదూరం చదువుసాగిందీ మొగమోటం లేకుండా పరిశోధన చేసి రండి.' అని ఆయనకు చెప్పి పంపినాడు.

ఆయనకూడ పోయి తిరిగివచ్చినాడు. 'సంగీతంవిషయంలో ఏ కొరవా లేదు. ఏ విద్వాంసుడూ అమ్మగారికి

సమానం కాజాలదు. కాని, మాటల ఉచ్చారణే తృప్తిగా లేదు. కొంచెం అరవయాస కనబడుతున్నది. ఆ కొరత కూడ తీరితే ఫస్టుగా ఉంటుంది.' అని తన పరిశోధనఫలితం చెప్పినాడు.

'అవును. అందుకు సందేహ మేమి ? సంగీతం ఎంత లోపరహితంగా, సలక్షణంగా ఉన్నా సాహిత్యంలో లక్షణమందుగాని, ఉచ్చారణయందుగాని లోప మున్నట్టయితే ఆ పాట సహింప సాధ్యమా? ఇందు కేమి చేయడం?' అన్నాడు సాంబశివరావు.

'ఈమాత్రందానికి దిగులుపడడ మెందుకు? తంజావూరులో సుబ్రహ్మణ్యశాస్త్రి అని మంచి పండితు లొకరున్నారు. ఆయన ఎటువంటిలోపాల నయినా సరిదిద్దివేయగలరు.' అన్నాడు ఆనందరంగం.

అక్కడనుంచి తంజావూరుకు వెళ్లింది గౌరి. అక్కడ రెండేండ్లపాటు కావ్యాలూ అవీ చదువుకొని, భాషాశుద్ధి పొంది, పరీక్ష తేరినపిమ్మట స్వస్థలానికి తిరిగి వచ్చింది.

ఈ లోపల సాంబశివరావు దేహంలో కొంచెం అస్వాస్థ్యం ఏర్పడింది. ఇద్దరు సిద్ధవైద్యులు చికిత్స చేస్తూ వచ్చినారు. వారు ఇచ్చిన మందుల వేడిమితో కొన్ని కష్టాలు పొడసూపినవి. అందుమీఁదట పెద్ద ఆసుపత్రికి వెళ్ళి చూపించుకొన్నారు. 'వయస్సు యాభై యేండ్లయి నందున గుణంకావడం కష్టం. పాషాణ ఔషధాల ప్రభావ మిది. సిద్ధవైద్యంలో ఉన్న ప్రమాదమే ఇది.' అని సీమలో పెద్ద చదువులు చదివివచ్చిన డాక్టరు గోవిందమీనన్ అన్నాడు.

గౌరి ఊరికి తిరిగివచ్చిన వర్తమానం తెలియగానే సాంబశివరావు 'సరి. నేను మా ఊరికి వెళ్లిపోతాను. దేవుడు పెట్టిన గతి అవుతుంది.' అని డాక్టరువద్ద సెలవు పుచ్చుకొని యింటికి వచ్చివేసినాడు.

సాంబశివరావు గౌరిని గుర్తుపట్టలేకపోయినాడు. గౌరికూడ భర్తను చూచి 'ఈయనేనా నా బావ?' అని కొంచెంసేపు సందేహించింది.

సంగీతం నిలిపివేసి, భర్తకు శుశ్రూషచేయడానికి పూనుకున్నది. ఆరునెలలలోపలనే, ఏ మందులూ మాకులూ లేకుండానే సాంబశివరావు ఆరోగ్యం కుదుటబడిపోయింది. ఉభయులూ సంతోషంగా ఉన్నారు. ఏండ్లతరబడి ఉండి నేర్చుకొనివచ్చిన సంగీతాన్నిగాని, సాహిత్యాన్నిగాని గురించి సాంబశివరావూ అడగలేదు; గౌరీ ప్రస్తావించలేదు.

ఒక కూతురు పుట్టింది. అమిత ఆప్యాయంగా 'పంకజం' అని పేరుపెట్టుకొన్నారు.

అమ్మాయి పంకజం చదువు కెదిగింది.

'బడికి పంపవద్దు' అన్నాడు సాంబశివరావు.

'ఊళ్ళో అందరూ బిడ్డలను బళ్లకు పంపుతున్నారే!' అని గౌరి వాదించి లాభంలేకపోయింది. సాంబశివరావు ఒకటేపట్టుదలగా చదువువద్దు అని చెప్పివేసినాడు. 'నేను పడిందిచాలు' అనుకొన్నాడు కాబోలు! పంకజం తప్పించుకొన్నది.



# 21. పిల్లి - కోతి

'అమ్మా! ఆ పిల్లిని చూడవే!' అన్నది కోతిపిల్ల తల్లిని చూచి. 'అది తన బిడ్డను ఎట్లా ఎత్తుకొని పరుగెత్తుతున్నదో చూడు. నేనుమాత్రం నిన్ను కాళ్ళతోనూ చేతులతోనూ పట్టుకొని తలకిందుగా అవస్థపడడ మెందుకు?' అని అడిగింది.

'అట్లా ఎత్తి చూద్దునా నిన్ను?' అని చెప్పి తల్లికోతి తనపిల్లను గొంతు కరచుకొని ఎత్తింది.

కీచుకీచు మని అరుస్తూ 'వద్దుబాబూ వద్దు' అన్నది కోతిపిల్ల. 'చాలా నొస్తుందమ్మా! ఆ పిల్లికూన ఎట్లా సహించుకొంటున్నదో కాని నావల్ల సాధ్యపడ లేదమ్మా! అన్నది.

'నేను నిన్ను అట్లా కవ్వుకొని చెట్లు ఎక్కటట్లయితే నీకు ఒళ్లంతా గాయాలై నీవు చచ్చేపోతావు.' అన్నది కోతి.

పిల్లిని ఒక కుక్క తరుముకొని వచ్చింది. అది ఒకే ఒక దూకుతో ఒక మిద్దెపై కెక్కి తప్పించుకొన్నది. నోటితో కవ్వుకొని యుండిన కూనకు ఎట్టి అపాయమూ ఏర్పడకుండానే అది ఎగిరి ఎక్కిపోగలిగింది.

ఇదంతా ఇద్దరు శ్రీవైష్ణవులు చూస్తూ ఉండినారు. అందులో ఒకరు తెంగల, ఇంకొకరు వడగల సంప్రదాయానికి చెందిన వారు.

'ఆ పిల్లిని చూస్తిరా స్వామీ!' అన్నారు తెంగల వైష్ణవస్వామి.

'చూస్తిని స్వామీ, చూస్తిని. కోతినీ చూస్తిని.' అని ప్రత్యుత్తరం ఇచ్చినారు వడగలస్వామి.

'భగవంతుని కరుణ ఈ పిల్లిహృదయం భావించే టటువంటిది. మనలను వాడేకదా ఎత్తికాపాడుతాడు. 'నీవేగతి' అని మనము సర్వమూ వాని కప్పగించి వేయ వలెను.' అన్నారు తెంగలస్వామి.

'అది సరేకాని కోతిపిల్లవలె మనము భగవంతుని కట్టుకొన్న గదా తరించడం?' అన్నారు వడగలస్వామి.

'మీ వేదాంతదేశికులు అట్లు చెప్పినారేమో కదా!' అని అడిగినారు తెంగలస్వామి.

'ఔను. సందేహమేమి?' అన్నారు వడగలస్వామి.

'మా ఆళ్వార్లు అట్లు చెప్పలేదే!' అని తెంగల స్వామి అన్నారు.

వీరేమో మాట్లాడుకొంటున్నారని కోతి గమనిస్తూనే ఉంది. తన పైన రాయివిసిరి తొందరచేస్తారేమో అని భయపడి ఒక పెంకు తీసి క్రింద పడవేసింది.

'చూచినారా స్వామీ! మీకోతి స్వభావం? ఇంటికి కప్పు పాడుచేసి వాననీరు ఉరిసేటట్లు చేస్తున్నది. పిల్లినే మంచిదికదా!' అన్నారు తెంగలస్వామి.

'మీ పిల్లి పాలూ, పెరుగూ, నెయ్యీ దొంగిలించి బ్రతుకుతుంది. ఎలుకలను తిని జీవిస్తుంది. తక్కువరకపు ప్రాణి. దానిని చూచి మీరేమో గొప్పగా భక్తిప్రవచనం చేస్తారే! కోతికదా నిజానికి ఉత్తమప్రాణి? కాయలూ,

పండ్లే దాని భోజనం. భగవంతుని దాసవంశం. మీ పిల్లిని కాల్చండి!' అన్నారు వడగలస్వామి.

'అబ్బబ్బో! ఏమో మహా మాట్లాడుతారే స్వామీ! పిల్లికుండే పరిశుభ్రత మీ కోతికేదీ? ఒక్కదినం తప్పకుండా అది తన నాలుకతో గంగాస్నానం చేస్తుంది. మీ కోతిని చూడండి. ఒంటినిండా పేలూ, మురికీ! అది ఎక్కడపడితే అక్కడ మలమూత్రాలు విడుస్తుంది. అదే పిల్లిని చూడండి. తన మలాన్ని ఇతరులు చూడకుండా మంటితో కప్పివేస్తుంది. ఆహా! పిల్లికున్న శుచి ఇతరప్రాణుల కున్నదా? పాలు దొంగిలించేదీ, పెరుగు దొంగిలించేదీ, వెన్న దొంగిలించేదీ నిజమే. ఆ పని మన కృష్ణపరమాత్మకూడ చేసినాడు కదా!'

కృష్ణపరమాత్మసంగతి యెత్తగానే వడగలస్వామి నోరెత్తలేదు. 'ఈయనతో మాట్లాడి ప్రయోజనం లేదు. ఈయన వేదాంతదేశికులవారి ప్రబంధాలు పఠించినవారు కారు. పాపం!' అని తమలోతామే అనుకొని, పోవడానికి బయలుదేరినారు.

ఆ సమయానికి సరిగా ఉభయులకూ చాలా ఆప్తులైన చంద్రశేఖరశాస్త్రిగారు అక్కడికి వచ్చి చేరినారు. 'ఏమిటి, వీరు పిల్లి - కోతి అని మాట్లాడుకొంటున్నారు? అంతా మాయ అని వీరికి తెలియలేదే? తల్లి యెవరు, బిడ్డ యెవరు? ఇల్లేమిటి, వాకిలేమిటి? ఇవంతా వట్టి అసత్యం కదా!' అనుకొని నవ్వినారు.

'ఏమి శాస్త్రిలవారూ! నవ్వుతారు?' అన్నారు వడగలస్వామి.

'ఏమీ లేదు. ఈ వాదాలన్నీ ఎందుకూ అని నవ్వితిని, అంతే. శ్రీరంగంకోవెల వ్యవహారం కోర్టులో పరిష్కారమయిందే, చూస్తిరా?' అన్నారు శాస్త్రిలవారు.

'అయ్యో! చూడకేమి? చూస్తిని.' అన్నారు వడగలస్వామి. 'ఇంత అన్యాయంకూడ ఎక్కడైనా ఉంటుందా?' అని అడిగినారు.

'కోర్టులకుపోతే అంతే అవుతుంది!' అన్నారు శాస్త్రిలవారు. ఆయనకుమారుడు కూనూరులో జడ్జి.



## 22. పులికూడ ఒదుగుతుంది

శూరసేనుడు గోదావరీతీరంలో చందాపురియందు రాజ్యంచేస్తూ ఉండినాడు. అతడు మహామంచిరాజు. అతని కాలంలో తపస్వులు చాలామంది ఉండినారు. వారు అరణ్యంలో వాసంచేస్తూ తపస్సుచేసుకొంటూ ఉండినారు. వారు తలచుకొన్నదెల్లా సిద్ధిస్తూఉంది.

ఆ ఋషులలో ఒకరికి ఎప్పుడుచూచినా ఇతరుల దోషాలు కనిపెట్టడమే అలవాటు. రాజుగారు ఇది గమనించి 'స్వామీ! తాము నారాయణమహారణ్యంలో తపస్సుచేస్తే బాగుంటుంది.' అని వేడుకొన్నారు. అది చాలాదూరంలో ఉన్న ఒక అడవి.

ఆయన అన్వే చేసినాడు. అది జనసంచారం ఆట్టే లేని చోటు. అందువల్ల ఆయనదృష్టి ప్రజలమీద పోవడానికి లేకుండా పోయింది. అడవిలో మృగాలను గమనిస్తూ వచ్చినాడు.

మృగాల నడవడికూడ ఆయనకు నచ్చలేదు. ఒకటిని ఒకటి చంపుతూనూ, తింటూనూ ఉండడం చూచినాడు. 'ఇది ఏమిటి ఈ తప్పుడుజీవితం? దీనిని ఆపించవలె' నని తీర్మానించుకొన్నాడు. అందుకై తపస్సు చేసినాడు.

'మహాదేవా! ఈ మృగాలు ఒకదానిని ఒకటి చంపుతూనూ, తింటూనూ హింసచేయడం నీవు చూస్తూ వస్తున్నావే! దీనిని నిలుపకూడదూ?' అని వేడుకొంటూ తపస్సు చేసినాడు. కఠినమైన నియమాలు పట్టి తపస్సు సాగించినాడు.

'నేను ఉంటున్న ఈ అడవిలోనైనా ఈ ప్రాణులకు సద్బుద్ధి ప్రసాదించు. అవి జీవకారుణ్యమార్గంలో బ్రతుకు సాగించేటట్లు చెయ్యి.' అని వేడుకొన్నాడు.

మహాదేవుడు సంతుష్టుడై, 'అట్లాగే' అని వరమిచ్చినాడు.

అటుపిమ్మట ఆ నారాయణవనంలో పులులు గడ్డి మేయ నారంభించినవి. చిరుతలు, తోడేళ్లు, నక్కలు మొదలయిన క్రూరమృగాలన్నీ పండ్లూ, గడ్డీ ఆహారంగా చేసుకొన్నవి. జింకలూ, తదితర సాధుమృగాలూ ఆనందంగా పెంపొందుతూ వచ్చినవి. పక్షులుకూడా పురుగుపుట్రలను

వెతుకులాడే ప్రమేయం పెట్టుకోకుండా జీవకారుణ్య మార్గాన్ని అనుసరించినవి.

జింకలూ, పందులూ అడవి నిండిపోయి ప్రక్క గ్రామాల్లో ప్రవేశించి పొలాలను పాడుచేయడానికీ, ఇండ్ల లోనూ అంగళ్లలోనూ సేకరించిపెట్టిన వస్తువులను తిన డానికీ ఆరంభించినవి. కోతులు లక్షలలెక్కను దేశమంతటా వ్యాపించిపోయినవి. ఎక్కడచూచినా కుక్కలూ, నక్కలూ ప్రత్యక్షం !

నారాయణవనప్రాంతం లోని గ్రామాలన్నీ పాడై పోయినవి. ప్రజలందరూ పరదేశీలుగా ఊరూరూ తిరిగి నారు. చందాపురిరాజుగారికి ఈ సంగతి తెలిసింది. రాజా గారిని దర్శించి మనవిచేసుకోవడానికి ఒక గుంపుకూడా వచ్చింది.

రాజుగారు విచారణ గావించినారు. పరిస్థితిని తెలుసు కొన్నారు. ఇదంతా తమ జీవకారుణ్యమహాముని యొక్క పనియే యని గ్రహించినారు. ఆయనను చూడడానికై నారాయణవనానికి బయలుదేరినారు.

'స్వామీ! తాము దయయుంచి మన చందాపురికి వేంచేయండి. సర్వజ్ఞుడైన బ్రహ్మయొక్క ఏర్పాట్లను మనం సంస్కరింప వీలులేదు.' అని వేడుకొన్నారు.

ఆయనకూడా 'సర్లె' యని వినయంగానే నగరానికి విచ్చేసినాడు, ఆయన ఆధ్వర్యాన రాజుగారు ఒక ప్రార్థన సభ జరిపినారు. పులులూ నక్కలూ వగైరా వెనుకటివలెనే

తమ సహజసిద్ధమైన ఆహారపద్ధతికి మరలవలెనని ఆ సభలో ప్రార్థనజరిగింది.

మహాదేవుడుకూడ ఆ వేడుకోలుకు సమ్మతించినాడు. 'పాతపద్ధతి ప్రకారమే మీ మీ ఆకలి తీర్చుకోం'డని మృగాదులకు ఆజ్ఞాపించినాడు.

అటుపిమ్మట ఆ అడవిలో మృగాలు నియమబద్ధంగా పెంపొందుతూ జీవిస్తూ వచ్చినవి. గ్రామవాసులు మరల యథాప్రకారంగా తమతమ ఊళ్ళలో భయంలేకుండా నివసింప నారంభించినారు.

జీవకారుణ్యమహర్షి పరులలో తప్పులు కనిపెట్టడం మానుకొన్నాడు.



# 23. అణుగుండునుగురించి కాదు

మహేశపురంలో ఇరువురు దుష్టులు ఇరుగుపొరుగుగా నివసిస్తున్నారు. బయటిఊళ్లలో వారి దోపిడీలూ, మోసమూ ముగిసిపోయినవి. ఇద్దరూ ఒకరినొకరు విపరీతంగా సందేహించుకొంటూ ఒకేవీధిలో నివసిస్తూ వచ్చినారు.

'ఏనాడో ఒకనాడు ఈ తూర్పుఇంటివాడు మన ఇంటికి కన్నంవేసి దొంగిలిస్తాడు' అన్నది పడమటియింటి ఆసామిభార్య.

'ఎన్నడో ఒకరాత్రి ఈ పాపిష్ఠివాడు మన యింటికి నిప్పంటిస్తాడు' అన్నది తూర్పుఇంటి ఇల్లాలు.

భార్యల మాటలు విని ఇరువురు దుష్టులూ దుడ్డు కర్రలూ, తుపాకులూ సేకరించి పెట్టుకొని, ఎవరికివారు ఎప్పుడూ భయపడుతూనే కాలం గడుపుకొని వస్తున్నారు.

'ఈ దుడ్డుకర్రలూ, తుపాకులూ ఉండి ఏమిప్రయోజనం? పక్కయింటి వెధవదగ్గర మనకంటె ఎక్కువగా ఉన్నాయి. పైగా వాడు పోకిరీలనుకూడ తయారుచేసి పెట్టుకొనియున్నాడు. వారి దుష్టతనముందర మీ సామర్థ్యం ఎందుకూ చెల్లదు' అన్నది పడమటియింటి గృహిణి.

'అయితే ఏమిచేద్దామంటావు?' అన్నాడు ఆవిడ భర్త.

'నేను ఒక పాములవాణ్ణి చూచి మాట్లాడిపెట్టినాను. వాడు ఒక విషసర్పాన్ని బుడ్డీలోవేసి యిస్తానని చెప్పినాడు. అది తీసి పెట్టుకొన్నట్టయితే మనము బతుకుతాము. పక్కయింటివాడు మనలను ఏమైనా చేస్తే పామును ఆ యింటిలో వదిలిపెడదాము.' అని ఆవిడ చెప్పింది.

'మంచి ఏర్పాటే!' అన్నాడు భర్త. 'అయితే, పాము మనం చెప్పినట్లు వింటుందా?' అని అడిగినాడు.

'దానికి మనం ప్రతిదినమూ కొంచెం ఆహారం వేసుకొంటూవస్తే అది మనలను ఏమీ చేయదనీ, చెప్పినట్టు వింటుందనీ పాములవాడు చెప్పినాడు.' అన్నది.

'నమ్మవచ్చునా?' అన్నాడు.

'నమ్మవచ్చును.' అన్నది.

అట్లాగే చేసినారు.

పాములవాడు మహా గట్టివాడు. వాడు ఇంకొక బుడ్డీలో ఇంకొకపామును వేసి తూర్పుఇంటి ఆసామికి కూడ రహస్యంగా ఇచ్చినాడు.

కొన్నాళ్ళ తర్వాత ఒకరిసంగతి ఒకరికి ఇద్దరికీ తెలిసిపోయింది. ఆ పిమ్మట ఊరి కంతాకూడ తెలిసి పోయింది. 'ఈ విధంగా వీరిద్దరూ పాములు పెట్టుకొని ఉన్నారే! ఇది ఊరిమొత్తానికే అపాయంకదా!' అని ఊరివారు కొందరు ఆక్షేపించినారు.

కాని, ఆ దుష్టులు ఊరివారి ఆక్షేపణను లక్ష్యం చేయలేదు. 'మాకున్న భయం మాకు తెలుసు. ఊరివారి కేమి తెలుసు? మేము ఈ పామును విడిచిపెట్ట వీలులేదు.' అన్నాడు పడమటిఇంటి ఆసామి.

'ఇద్దరమూ పాములను బుడ్డీలతోసహా పారవేద్దాం' అన్నాడు తూర్పుఇంటి ఆసామి.

'ఈ మోసగాణ్ణి ఎవరు నమ్ముతారు? వాడు ఎన్ని పాములు ఎన్నిబుడ్డీలలో వేసి పెట్టుకొని ఉన్నాడో ఎవరికి తెలుసు?' అన్నాడు పడమటియింటివాడు.

'వాడేకదా ఆరంభించినవాడు?' అన్నాడు తూర్పు ఇంటివాడు.

ఊరివారు పంచాయతీ చేసినారు. కాని, ఏమీ తీర్మానం కాలేదు. కల్లుమాత్రమే దండిగా ఖర్చయింది.

యథాప్రకారంగానే ఊరంతా భయపడుతూ ఉండింది. ఆ రెండిండ్ల వాండ్ల సంగతీ చెప్పనే అక్కర లేదు. రాత్రిపూట వారిద్దరికీ కునుకన్నదే లేదు.

'ఎవరైనా ఒకరు పామును బుడ్డీతోసహా మొదట నిప్పులోవేసి కాల్చివేస్తే ఈ భయం తీరుతుంది. రెండవ వాడుకూడ అట్లాగే చేస్తాడు. ఎందుకని నిద్ర లేకుండా, సుఖంలేకుండా అనవసరమైన దుఃఖంతో యిట్లా అల్లాడి పోతారు?' అన్నారు బయటి ఊరినుంచి వచ్చిన ఒక స్వాములవారు.

'ఈ సన్యాసి కేమి తెలుసు? ఈ దుర్మార్గుని నడవడి మాకు కదా తెలుస్తుంది?' అన్నది పడమటిఇంటి ఇల్లాలు. 'మనం మనపామును పారవేసిన తర్వాత ఆ తూర్పుఇంటి ఆసామి తనపామును మనమీద విడవడం నిశ్చయం' అన్నది ఆవిడ.

'సరి. ఇట్లాగే ఉండనీ. చూద్దాం. నా యింటికి నిప్పంటించి చూడనీ. వెంటనే నా పామును వారియింటి మీద వదులుతాను. ఆపైన వేడుక చూద్దాం.' అన్నది తూర్పుఇంటి ఇల్లాలు.

'నిప్పుపెట్టిన తర్వాత నీవు ఎక్కణ్ణించి పామును తీసుకొనిపోయి విడుస్తావు?' అన్నాడు భర్త.

'నిప్పుపెట్ట వస్తాడుకదా, అప్పుడే నేను ముందుపడి బుడ్డీ తీసుకొనిపోయి వారియింటి ముంగిట తెరుస్తాను' అన్నది భార్య.

నిద్రయేమో రెండిండ్లవారికీ లేదు.

'ఈ దుష్టుడు ఏమో యోచన చేస్తున్నాడు. మనం ఒకటికి రెండు పాములు పెట్టుకొంటే మేలు' అన్నది పడమటియింటి యిల్లాలు.

పాములవాడు కావలసినన్ని పాములు ఇచ్చినాడు. ఇద్దరికీ ఇచ్చినాడు. వానికి మంచి లాభం!

ఊరివారికి భయం ఎక్కువయిపోయింది. 'ఇన్ని పాములను, కోరలు పీకకుండా, ఊరిలో పెట్టుకొని యున్నట్లయితే ఎప్పుడేమి ముప్పువస్తుందో!' అని స్త్రీలందరూ భయపడిపోయినారు. ఆ దుష్టులదగ్గర మాట్లాడడానికి ఊళ్లో మగవారికి ధైర్యం లేదు.

ఆ దుష్టులిద్దరికీకూడ ఒకటే భయమూ, కలవరమూ! రాత్రిళ్లు నిద్రలేదు. వారిభార్యలకూ నిద్రలేదు. ఊరివారికి కూడ భయ మెక్కువయిపోయింది.

పొలాలను గమనించేవారు లేరు. పరిశ్రమ లన్నీ పాడైపోయినవి. ఊరిలో కాటకం ఆరంభించింది. మహాంకాళియమ్మ కండ్లు తెరిచింది. వ్యాధులు పొడసూపినవి. దేశం పాడైపోయింది.

*    *    *    *

ఇప్పుడు అక్కడ పరిశోధకులు ఒక గోతిని త్రవ్వి ఒకానొకప్పుడు అక్కడ ఒక ఊరు ఉండియుంటుం దని గ్రహించి, దానినిగురించి పురావస్తుశాఖవారికి సంగతి వివరాలు తెలియజేస్తున్నారు.



# 24. 'ఉప్పుకోసం నాకుతుంది'

'అబ్బీ! దూడను వంచించి పాలు పిండుకొనిపోతావు. అందులో నీళ్ళుకలిపి అమ్ముతావే! నా పాలు బాగాలేవని అందరూ ఆడిపోసుకొనేమాటలు నేను వినలేకుండా ఉన్నానే' అని నెల్లూరు ఆవు తన యజమానితో చెప్పింది, దూడను నాకుతూ నాకుతూనే. వానికి ఆ ఆవుభాష అవగాహన కాలేదు.

'మంచి మేతఅయినా వేయకూడదా?' అన్నది ప్రక్కనున్న గేదె.

'నీళ్ళు కలిపేటప్పుడు మంచినీళ్లయినా చూచికలుపు.' అన్నాడు ఆయింటి యజమాని. ఆయన ఒక డాక్టరు.

'నీళ్ళు కలుపుతానా నేను? ఆ వ్యాపారమే నాదగ్గర లేదు' అన్నాడు పాలమనిషి గోవిందు, పాలపాత్రను వంచి.

'పాత్రశబ్దం చూడండి. లోపల నీళ్ళు ఉంటే ఇట్లా శబ్దమవుతుందా?' అని అంటూనే వడివడిగా పాలు పిండినాడు.

'ఈ పట్నంలో ఆవులకే నీళ్ళు పెట్టివేస్తారు.' అన్నాడు కాంపౌండరు కుఱ్ఱవాడు.

'అదెట్లాగోయ్?' అని డాక్టరు గారడిగినారు.

'ఆవులకు తినడానికి దండిగా ఉప్పుపెడితే అవి సమృద్ధిగా నీళ్లపాలు పిండుతాయి.' అన్నాడు కాంపౌండరు.

'డబ్బు కొంచెం కూడా చేర్చియిస్తేసరి, ఏమీ కలపము. మంచిపాలే ఇస్తాము.' అన్నాడు పాలవాడు.

'ఇప్పుడే ధర అన్యాయంగా పెరిగిపోయింది. ఇంకా కావలెనంటావా? ఏమి యిచ్చినా నీళ్ళు కలపనే కలుపు తావు!' అన్నది డాక్టరుగారి భార్య.

'ఇప్పుడు గడ్డివెల ఎంత? తవుడు వెల ఎంత? గానుగ పిండి ఖరీదెంత? అన్నీ పెరిగిపోయినాయి. పాలూ పెరుగుల ధరలు మాత్రం పెరగకుండా ఉంటాయా? మీ జీతాలంతా పెంచలేదా?' అన్నాడు పాలవాడు. గోవిందు గడసరి; పోకిరీకూడ.

ఈ సంభాషణ అంతా వింటూ ఉండిన దూడకు ఇదంతా ఏమీ అర్థం కాలేదు. పాలంటే ఏమిటి! వాటికి నీళ్లు కలపడ మెట్లాగు? ఒక్కటీ దానికి తెలియలేదు.

'అమ్మా! పాలు పాలు అంటారే, ఏమిటమ్మాఅది?' అని అమ్మను అడిగింది.

ఆవు కండ్లవెంట నీళ్లు కారినవి. దూడను అదుము కొన్నట్లుగా దగ్గరకు తీసుకొని ప్రేమగా నాకింది.

'నాయనా! ఆవు ఎందుకు దూడ నిట్లా ఊరికే నాకు తుంది?' అని అడిగినాడు డాక్టరుగారి కడపటి అబ్బాయి.

'దూడ ఒంటిలో ఉప్పు ఊరుతూ ఉంటుంది. తల్లికి ఉప్పు కావలెను. అందుకోసం నాకుతుంది' అన్నారు డాక్టరుగారు. ఆయన ఈ విషయమంతా బాగా చదివిన వారు. చదివి చదివి రాతిగుండెను సంపాదించినారు.



## 25. సంఘసేవ

తామరపురంలో ఒక పెద్ద పాఠశాల. ఈ ఊరికై మ్యాపునుగాని, అట్లాసునుగాని వెతక్కండి. ఇది నిజమైన పేరుగాదు. పాఠశాల విద్యార్థులు 'సోషల్ సర్వీస్' చేయడానికి బయలుదేరినారు. ఈ జట్టుకు లెక్కలపంతులు నాయకత్వం వహించినారు. 'సోషల్ సర్వీస్' అనగా బీదలకు ఉపకారం చేయడం — సంఘసేవ.

పక్కన వేంపల్లిలో వానలు విపరీతంగా కురిసి ఇండ్లకు చాలా నష్టం కలిగింది.

విద్యార్థులు దబదబమని లారీలోనుంచి దిగినారు. వారిని చూడగానే 'అయ్యలారా! ఇండ్లంతా కురుస్తున్నాయి. మేమంతా ఉక్కిరిబిక్కిలికష్టపడుతున్నాం.' అన్నారు ఆగ్రామ ప్రజలు.

'భయపడకండి. అన్నిటినీ మేముసరిచేస్తాం' అన్నాడు లెక్కల పంతులు.

'ఊం. ఎక్కండి, ఇంటిపైకి.' అన్నాడు పంతులు. విద్యార్థులు కొంచెం వెనక్కుతగ్గినారు. వారికి ఇటువంటి పనులు కొత్త.

'ఎందుకు ఊరికే నిలుస్తున్నారు? ఉండండి, నేను ఎక్కి చూపుతాను.' అని లెక్కలపంతులు పైకి ఎక్కినాడు.

ముసలిపంతులు ఎక్కింది చూచి విద్యార్థులుకూడ కొందరు ఎక్కినారు. ఎక్కి కప్పుమీద నిలుచున్నారు.

అంతమెత్తున వారిని చూడగనే తక్కినవారికికూడ ఉత్సాహం జనించింది. అందరూ బిరబిర ఎక్కినారు.

'అయ్యో! తడిపెంకులపైన ఇంతమంది ఇట్లా ఎక్కి నడిస్తే అన్నీ పగిలిపోతాయే!' అని కలవరపడ్డది యింటామె.

అట్లాగే అయింది. విద్యార్థులు అటూ ఇటూ నడచి పెంకులు చూచినారు. నడచిన చోటల్లా పెంకులు పగిలి పోయినవి. వానలకు చెడని పెంకులుకూడ నలుగుడుకు విచ్చి పోయినవి. లెక్కల పంతులుకు తడిపెంకుల విషయం తెలియదు. పాపం, విద్యార్థులే మెరుగుదురు?

'చాలు చాలు, కిందికి దిగండి' అని ఆ యింటి బీద యజమాని బిగ్గరగా అరచినాడు. అందరూ దిగివచ్చినారు.

'భయపడకన్నా, భయపడకు. మేమంతా సరిచేస్తాం. కొత్తపెంకులు కొనడానికి డబ్బుకై వ్రాసి తెప్పించి అంతా మరామత్తు చేసి వేస్తాం' అన్నాడు లెక్కల పంతులు.

వారు తామరపురానికి తిరిగి వచ్చినారు. ఆ రాత్రి కూడ వేంపల్లిలో పెద్ద వాన వచ్చింది. ఆ బీదవాని యింటిలో పిల్లా జెల్లా బహు కష్టపడిపోయినారు. ఇల్లాలు తన మగనిపై చాలా కోపగించుకొన్నది.

'ఈ విధంగా కోతులను ఇంటిపైకి ఎక్కించి అంతా పాడుచేయిస్తిరే!' అని వెక్కి వెక్కి యేడ్చింది.

పాపం! అత డేమిచేస్తాడు! పంతులవారి అజ్ఞానమూ, సోషల్ సర్వీస్ ఉబలాటమూ ఇంతపని చేసినవి.

లెక్కలపంతులు పైకి వ్రాసి వ్రాసి చూచినాడు. పగిలిన పెంకులను భర్తీ చేయడానికి డబ్బు పంపమని విన్నపంపైన విన్నపం పంపినాడు. వీలులేదని సర్కారు కార్యదర్శి చల్లగా జవాబిచ్చినాడు. మరి చేసేదిలేక పాపం పంతులవారూ విద్యార్థులే, తమలో తామే డబ్బు వసూలు చేసి ఆ బీదకాపుకు ఇచ్చి వచ్చినారు. దీనికి మూడు నెలలు పట్టింది.

తడి పెంకులపైన త్వరపడి ఎక్కకూడదన్న పాఠం నేర్చుకొన్నారు. వసూలుచేసిన డబ్బు ఇచ్చి రావడానికి పంతులూ, కొందరు విద్యార్థులూ వెళ్ళినారు.

'మీరు మహారాజులుగా వర్ధిల్ల' మని దీవించింది ఆ యిల్లాలు. డబ్బు చూడగానే ఆవిడకు పరమానందమయి పోయింది.

పంతులుకూడ ఎంతో సంతోషించినాడు—ఆవిడచేత తిట్లుతినకుండా తిరిగివస్తిమికదా అని.

'ఇకపైన ఎప్పుడూ త్వరపడి మనకు తెలియని పనుల్లో ప్రవేశించకూడ'దని విద్యార్థులు తీర్మానించు కొన్నారు.

'పెంకులు ఎట్లాచేస్తారు? ఎక్కడచేస్తారు?' ఇత్యాదు లన్నీ తెలుసుకోవడానికై ఆ గ్రామంలోని ఒక కుమ్మరి యింటికి వెళ్లినారు. బంకమంటినీ, కుమ్మరిచక్రాన్నీ, దాని పైన కుమ్మరివాడు పనిచేసే విధానాన్ని చూచినారు. బంక మంటితో పాత్రలు తయారుచేసే ఆ తీరునుచూచి విద్యార్థులు చాలా ఆనందించినారు.

'ఇకరండి వెళ్లుదాం. పొద్దుపోయింది' అన్నారు పంతులవారు. విద్యార్థులకు అక్కడనుంచి కదలడానికే ఇష్టంలేదు.



## 26. పంపకాల కథ

ఒక శెట్టిగారు నలుగురు కొడుకులను విడిచిపెట్టి చనిపోయినారు. నలుగురుకొడుకులకూ వివాహాలైనవి. నలుగురు కోడళ్లూ ఇంటికివచ్చినారు. అందరూ ఒకే కుటుంబంగా జీవిస్తున్నారు.

నలుగురుకోడళ్లలోనూ తరచు తగాదాలు వస్తుంటాయి. చిల్లరవిషయాలను గురించికదా అని మగవాళ్లు వాటిని అంతగా గమనించడంలేదు. ఒకవేళ గమనించినా వారిభార్యలు సమాధానం పడరు. ప్రతిదినమూ ఏదో ఒక చిన్నతగవు బయలుదేరుతూనే ఉంటుంది. రాత్రిపూట ఎవరికీ సరిగా నిద్రలేదు.

ఆ యింటిలో ఈ విధంగా రాత్రింబగళ్లూ జరిగే తగవులతో ఇరుగుపొరుగుఇండ్లవాండ్లంతా కష్టపడిపోతున్నారు.

తండ్రిగారు చాలా ఆస్తి పెట్టిపోయినారు. డబ్బూ, నగలూ పెట్టెలలోపెట్టి భద్రంగా ఒక గదిలో పదిలపరచినారు. వాటిపైన ఒక కన్నపుదొంగకు చాలనాళ్లుగా కన్ను. అయితే వానికి సరియైన సందర్భంచిక్కలేదు. రోజూ రాత్రిపూట ఆ యింటిలో ఎవరో ఇద్దరుముగ్గురు తప్పకుండా

తగువులాడుతూనే ఉండినందున, అందరూ మేలుకొనే ఉంటారు. దొంగకు అవకాశం దొరకలేదు.

జ్యేష్ఠసోదరుడు ఎంతగానో చెప్పిచూచినాడు. కాని తమ్ములు వినలేదు.

'మనం విడిపోతేనే బాగుంటుంది. ఈ ఆడువాళ్లు ప్రతిదినమూ తగువులాడుకొంటున్నారు. ఎవరికివారు విడిపోతే ఈ రభస అణగిపోతుంది.' అని ఏనాటి కానాడు అనుకొంటూనే వస్తున్నారు.

ఇందుకు ఏమిచేయడమో ఇదమిత్థంగా తోచక, పెద్దవాడు వాయిదా వేసుకొంటూనే వస్తున్నాడు.

ఒకనాడు ఆయనభార్య 'ఈ రభస త్వరగా తీరిపోతేనే మంచిది. పంచియిచ్చివేయండి.' అని భర్తతో చెప్పింది. ఆయనకూడ అదే మంచి దనుకొని, విధిలేక, విచారంతోనే అందుకు తీర్మానించుకొన్నాడు.

సొత్తులూ డబ్బూ పంచుకొని, ఇంటినికూడ నాలుగుగా విభజించి, అడ్డుగా ఇటుకగోడలులేపి, వేరు వేరు వంటలూ, వేరువేరు కాపురాలూ చేయ నారంభించినారు.

ఇరుగుపొరుగు ఇండ్లవాండ్లు 'అమ్మయ్యా! ఇప్పటికి నెమ్మదిపడిపోయినాము. ఇక కంటినిండా నిద్రపోదాము. ఇకపైన రాత్రిళ్లు ఏ రగడా, రభసా ఉండదు.' అని సంతోషపడినారు.

ఒకవారంపాటు అందరూ గప్‌చిప్‌గా కాలక్షేపం చేసినారు. దొంగ 'ఇదేసమయ'మని తీర్మానించుకొన్నాడు.

అమావాస్య దాటి రెండవదినం– ఆదివారం. దొంగ లకు అది మంచి తిథీ, వారమూ! ఆరాత్రి రెండుగంటలకు సరిగా దొంగ కన్నంవేసినాడు. అందరూ బాగా నిద్ర పోతూ ఉన్నారు. ఎట్టి కష్టమూ, అడ్డూ ఆపూ లేకుండా దొంగ కొత్తగావేసిన గోడలలోని ఇటికలను అలాగ్గా లాగి వేసి, ఒకటి తర్వాత ఒకటిగా అందరిగదులలోనూ ప్రవే శించినాడు. తలుపులను లోపలనుంచి తెరచిపెట్టి పెట్టెలను ఎత్తియెత్తి బయట కాచియుండిన తనసహచరులకు అందిచ్చి డబ్బూ, నగలూ అన్నింటినీ బయటకు చేరవేసినాడు. వచ్చినపని సాంతం ముగిసిపోయినపిమ్మట వాడు జ్యేష్ఠ సోదరుని వంటయింటిలోకి వెళ్ళి, అక్కడ మిగిల్చియుండిన అన్నం ఊరుగాయ వేసుకొని కడుపునిండా భోంచేసి, సడీ చప్పుడూ చేయక చల్లగా జారుకొన్నాడు.

తెల్లవారిలేచి చూచుకొన్నారు. 'అయ్యో!' అని నలుగురు కోడళ్ళూ అంగలార్చినారు.

ఊరివారికిమాత్రం ఒకవిధంగా సంతోషమే. ఈ శెట్టి సోదరుల సంపద చూచి వారికి చాలనాళ్ళుగా ఒకింత అసూయ ఉంటూ వచ్చింది. లోలోపల సంతోషంగా ఉన్నా పైకిమాత్రం జాలిపడుతూ వారిని ఊరడింపు మాట లతో ఊరడించినారు.

మనలోమనకు ఎన్నితగవులున్నా ఒకటిగానే ఉండ డం ఎన్నటికైనా మంచిదనీ, విడిపోతే అందరికీ కీడేననీ ఊరిబాలలు పాటలుకట్టి పాడుకోజొచ్చినారు.

ఒక కాకి ఆ యింటిమీద వాలి కూర్చొని 'తెలిసిందా తెలిసిందా?' అని అరుస్తూఉంది.

నలుగురు కోడళ్లూ ఒకమూల తలలమీద చేతులు పెట్టుకొని కూర్చొని భోరున ఏడుస్తూ ఉండినారు.



## 27. గాడిద - బట్టలమూట

మురికిబట్టలమూట వీపు కెత్తి గాడిదను తోలుకొని పోతూ ఉండినాడు చాకలి. మన నాటుగాడిదలు మీకు తెలుసుగా! పుటకా, తిండీ, బలమూ అన్నీ నాసిరకమే. గాడిదమీది కెత్తే ఇరుపక్కల మూటస్వరూపంకూడ మీకు తెలుసు. అది నలుసంతైనా వెలితి లేకుండా, ఇరుపక్కలా సమభారంగా వేలాడుతూ ఉంటుంది. వల్లమాలిన ఆ బరువుకు గాడిదవీపు వంగిపోతుంది.

ఆ గాడిద ఇట్లా పోతూఉండగా బట్టలమూట గాడిదతో మాట్లాడ నారంభించింది. 'ఓ గాడిదా! నీ వంటి సాధువును నేను చూచి యెరగను. ఎంత కొట్టినా కిమ్మనకుండా సహించుకొని పడియుంటావు. నిన్నుచూస్తే నాకు జాలి వేస్తుంది'.

మూట ఇట్లా చెప్పుతూ చెప్పుతూ ఉండగానే ఈడ్చి ఒక్క దెబ్బ తగిలించినాడు వెనకనే నడచివస్తున్న చాకలి.

'నీమీద నేను రాజుమాదిరి స్వారిచేస్తాను, తెలుసునా? నగరిగుఱ్ఱంమాదిరి తలయెత్తి నడు. వేలవేసుకొని నడవవద్దు' అన్నది మూట.

పాపం! గాడిదకు దెబ్బ లొకపక్క, అవమాన మొకపక్క!

'ఓసి మురికిబట్టలమూటా! ఎందు కంతగా అహంకార పడతావు? వద్దు. ఇంక కొంచెం సేపటికి ఏమవుతుందో చూడు' అన్నది గాడిద.

'ఏ మవుతుంది? ఒక్కటీ కాదు. మాట్లాడకుండా నడు.' అన్నది మూట.

నదిదగ్గరకు చేరగానే చాకలి బట్టలమూటను దించి ఒడ్డునపెట్టి గాడిదను గడ్డిమేయ విడిచిపెట్టినాడు. అది నదిలో దప్పి తీర్చుకొని ఒడ్డున సంతోషంగా పరుగెత్తింది.

మూటవిప్పి బట్టలన్నీ విడదీసి చాకలివాడూ, వాని భార్యా ఉతకడానికి మొదలుపెట్టినారు. 'ఉస్', 'ఉస్' అనుకొంటూ బండమీద వేసి బాదినారు.

గాడిద గట్టున నిలుచుని పండ్లికిలించింది. 'కొట్టు! వెయ్యి! ఇంకా వెయ్యి!' అన్నది. 'అహంకారాన్ని బాగా నులిమి పిండి వెయ్యి! కొట్టు! ఇంకా వెయ్యి!' అన్నది.

'అయ్యయ్యో! చాలు. ఇంకమీదట అట్లా మాట్లాడను' అన్నది బట్ట.

చాకలి అది వినిపించుకోలేదు. అది మాట్లాడింది కూడ వానికి తెలియదు. వానిదృష్టి అంతా ఉతకడం మీదనే. కొట్టు కొట్టు అని కొట్టుతూనే యున్నాడు. ఇట్లాగే బట్టలు అన్నీ ఉతికి ఎండలో పచ్చికనేలమీద పరచి ఆరవేసినాడు.

'బుద్ధి వచ్చిందా!' అని అడిగింది గాడిద.

'వచ్చిందయ్యా, వచ్చింది!' అన్నది బట్ట.

'నీ కథ ఇంకా ముగియలేదయ్యా!' అన్నది గాడిద.

'అయ్యో! అదేమిటి? చెప్పు.' అన్నది తెల్ల చొక్కా.

'ఇంటికి పోయినతర్వాత నీకే తెలుస్తుంది. ఇప్పుడు చెప్ప నవసరంలేదు' అన్నది గాడిద.

* * * *

ఇంటివద్ద బట్టలన్నీ మడిచి, ఇస్త్రీ చేసినాడు చాకలి. వేడివేడిగా ఇస్త్రీపెట్టె పెట్టినాడు చొక్కాపైన.

'అయ్యో! చస్తిని.' అన్నది చొక్కా. ఆ రోదన చాకలివానిచెవి కెక్కలేదు. వానిపాటికివాడు అదిమి అదిమి తోమినాడు. ఊపిరి ఆగిపోయింది చొక్కాకు.

'ఏదో కొంచెంసేపు నామీద ఎక్కి స్వారి చేసినావు. అంతమాత్రానికే ఏమేమో మాట్లాడినావు. ఇప్పు డే మంటావు?' అన్నది గాడిద వాకిటిదగ్గరనుంచి.

'అయ్యా నాయనా! నీవు ఊరికే ఉండు. నాకు బుద్ధి వచ్చింది. స్వారిచేయడమూ చాలు, ఆపైన కష్టపడడమూ చాలు. ఇంక పైన నేను నీమీద ఎక్కనే ఎక్కను.' అన్నది బట్ట.

'నీ గతి ఇంతే! నీవు చిరిగి చిరిగి పెంటకుప్పకు పోయే వరకూ చాకలిచేతిలో ఇదంతా నీవు అనుభవిస్తూ ఉండవల సిందే! తెలుసుకో.' అన్నది గాడిద.

'నీవు పడే కష్టం పెద్దదికాదు. నేను పడేదే పెద్దది' అన్నది బట్ట.

# 28. స్వాములవారు ఓడిపోయినారు

"పులులారా, చిరుతలారా! మీ రేల ఈ పాప జీవనం గడుపుతారు? మృగాలనూ వాటినీ చంపితింటారే, అది మహాపాపమని మీకు తెలియదూ? ఈ అలవాటు విడిచి పెట్టండి. నా వలెనే మీరుకూడ జీవించండి." అని స్వాములవారన్నారు.

"ఈ స్వాములవారి తొందర ఎక్కువయిపోయింది. ఈయనను మీరు గుటుక్కుమని తినివేస్తే సరిపోతుం దని నా అభిప్రాయం" అని సలహాయిచ్చింది నక్క.

"ఆపని చేయవచ్చుకాని, ఈయనను మింగివేస్తే ఆ గడ్డమూ జడలూ నా కడుపులో చేరుకొని ఏమి తిప్పట పెడతాయో, నే నేమైపోతానో నని యోచన. కాబట్టి నీ సలహావల్ల ప్రయోజనం లేదు. ఈయనతో సమక్షంగా కొంత మాట్లాడి విషయం తేల్చివేసుకొందాం." అని పులి నక్కను సమాధానపరిచింది.

"అయ్యా, స్వామీ! మీ మనుష్యులు కూడ కోళ్లనూ, గొఱ్ఱెలనూ చంపితింటారే! మరి మమ్ములను మాత్రమే తప్పుపట్టుతారెందుకు?" అని ధైర్యంచేసి అడిగింది చిరుత.

"అదిగదీ! అట్లా అడుగు" అని అందుకొంది పులి.

"బిడ్డలారా! మీ రడిగింది న్యాయమే. కాని, వారు కోళ్ళనూ, గొఱ్ఱెలనూ వండుకొని తింటారు. మీ వలె

పచ్చివిపచ్చివిగా తినడంలేదు. మీరు చేసేది శుద్ధ అనాగరీకం.'' అని స్వాములవారు జవాబు చెప్పినారు.

''ఊహూం, ఇది సరియైన వాదంకాదు.'' అన్నది పులి.

''ఎందుకో చెప్పు'' అన్నారు స్వాములవారు.

''వివరించి చెప్పవయ్యా నక్కా! నీ వైతేనే సరిగా మాట్లాడగలవు.'' అని పులి తన మంత్రి నక్కకు తన తరఫున వాదించడానికి వకాల్తా యిచ్చింది.

''మహాస్వామీ! ఈ చిన్నవిషయం మీకు తెలియలేదే! చాలా ఆశ్చర్యంగా ఉన్నది. మీరు అన్నీ చదివినవారు. నేను ఏ శాస్త్రమూ చదవలేదు. పచ్చిపచ్చివిగా మృగాలనూ వాటిని తిని జీర్ణించుకొనే శక్తి పులికీ, చిరుతకూ భగవంతుడు ప్రసాదించియున్నాడు. మనిషికి ఆ శక్తి ఇవ్వలేదు. ఒప్పుకుంటారా?'' అని అడిగింది నక్క.

''నీవు చెప్పింది నిజం. కనుకనే వారు బాగా వండుకొని తింటారు.'' అని స్వాములవారన్నారు.

''అంటే, భగవంతుడు నిర్ణయించిన ఏర్పాటులో తినరాని ఆహారాన్ని మనుష్యులు వండి సరిచేసుకొని తింటున్నారన్నమాట. అదే నిజానికి పాపం. భగవంతుని ఆజ్ఞకు వ్యతిరేకం. జీర్ణంచేసుకొనేశక్తి గలిగినటువంటి పులీ, చిరుతా మృగాలను చంపితినడంలో ఏమీ పాపంలేదు. ప్రకృతికి విరుద్ధంగా నిప్పూ, నీళ్ళూ ఉపయోగించి మాంసాన్ని మృదువుపరచి తినడమే మహాపాపం'' అని చెప్పింది నక్క.

"చచ్చిన ప్రాణిమాంసాన్ని తినే నీవు బహు చాతుర్యంగా మాట్లాడుతున్నావే! నీ జీవనం చాలా నీచము యింది." అని స్వాములవా రన్నారు.

"స్వామీ! తమ కొక నమస్కారం. ప్రాణంతో ఉండే గొఱ్ఱెలను కసాయితనంగా నరికి చంపి మీ జాతివారు తింటారు. ప్రాణి చనిపోయిన తరువాత మురుగు పట్టిన ప్రేతాన్ని నేను తినడమా పాపం?" అన్నది నక్క.

స్వాములవారు తల గోక్కుంటూ యోచన చేయ సాగినారు.

"పోయివస్తారా? ఇంక మీ రిక్కడ ఉండడం అపాయకరం. ఈ చిరుతకు ఆకలి ముంచుకొని వస్తున్నట్టున్నది." అని చెప్పింది పులి.

చిరుతపులి నోరు బాగా ఊరుతున్నది. అది చూచి పులి యిట్లు హెచ్చరించింది.

స్వాములవారు గబగబా వెళ్లి పోయినారు.



# 29. ముక్కద్దాలు

సుబ్బరాయశాస్త్రిగారు తమ సులోచనాలను ఎక్కడనో పెట్టి మరచిపోయినారు.

"ఓ ముక్కా! నా ప్రియమైన ముక్కా! ఎప్పుడు చూచినా నీ మీద స్వారిచేస్తూ వచ్చిన అద్దాలేవీ?" అని అడిగినారు.

ముక్కుగూడ మాటలాడనారంభించింది. "ఓ కన్నుల్లారా! నా ప్రియమైన అన్నల్లారా! మీపుణ్యముంటుంది. కాస్త సులోచనాలను వెదికిపెడుదురూ! మనయజమాని చదవడానికి వీలులేకుండా సతమతమైపోతున్నాడు" అని కండ్లను పురమాయించింది.

ముక్కు కోరికను కండ్లు లెక్కచెయ్యలేదు. "సరి సరి! బాగుంది సంగతి! సవారి నీపైన! పేరుగూడ నీ పేరు మీద! మధ్య మాకెందుకీ గొడవ?" అని చెప్పింది కుడికన్ను.

"ఒసే ముక్కూ! నీవే ఇన్నాళ్ళూ 'ముక్కద్దాలు' 'ముక్కద్దాలు' అని డబ్బా వాయించుకొంటూ వస్తివికదా! మరి నీవే వెతుక్కో, కావలసివస్తే." అన్నది ఎడమకన్ను.

సరిలెమ్మని ఒప్పుకొని ముక్కు ఇంట్లో అన్ని మూలలూ మూచూచిమూచూచి వెతికింది. కాని, ఎక్కడా దొరకలేదు. ముక్కద్దాలకు ఏదైనా ప్రత్యేకవాసన ఉంటే కదా ముక్కుకు తెలిసేది!

మరి చేసేదిలేక, అది విచారపడుతూ "నాకైతే ఎంత వెతికినా అవి చిక్కలేదు. మీ కండ్లనే అడిగి చూడండి" అని శాస్త్రిగారితో చెప్పింది.

ఆయన తనకండ్లనుచూచి "ఓకన్నుల్లారా! నేను మీకోసమే ముఖ్యంగా వాటిని కొనిపెట్టుకొన్నాను. కాస్త వెతికిపెడుదురూ! ఎక్కడనో పెట్టి మరచిపోయినాను." అని వేడుకొన్నాడు.

కండ్లు ఆయనమాటలమీద లక్ష్యమే లేకుండా స్తబ్ధగా ఉండిపోయినవి.

అప్పుడు చెవి కల్పించుకొని యిట్లు చెప్పింది: "ఓ కన్నులారా! ఇట్లు మనం ఒకరిమీద ఒకరు పోటీలూ, స్పర్ధలూ, అసహనాలూ, అసూయలూ పెట్టుకొని కూర్చుంటే చివరకు అందరికీ కష్టమయిపోతుంది. మనం ఐకమత్యంగా పనిచేస్తూ ఉండవలెను. ఒకరిమీద ఒకరు అసహనాలూ, అసూయలూ పడరాదుసుమా."

నోరుకూడా ఈపాటే పాడింది. "పంచేంద్రియాలనేవి పంచగోవులు. అవి దేనికది యిష్టంవచ్చినట్లు పోకుండా యజమాని అనేవాడు తగిన అదుపులో పెట్టుకొని కాపాడుతున్నట్లయితే, అనగా వాటికి సరియైన ఆహారమిచ్చి పోషిస్తున్నట్లయితే ఆ అయిదు ఆవులూ మంచిపాలు ఇస్తాయి. ఎన్ని శాస్త్రాలు చదివి, ఎంతటి విద్వాంసుడై ఉన్నా పంచేంద్రియాలనూ పట్టి పాలించనట్లయితే ఎట్టివానికీ ఆనందం సున్న." అని ఉన్న పరమార్థం పలికింది.

అందుమీదట కండ్లకు బుద్ధివచ్చింది. శ్రద్ధతో వెతికినవి. ముక్కద్దాలు దొరికినవి.

పక్కనఉన్న వస్తువును మాత్రమే ముక్కు మూచూచి తెలుసుకొంటుంది. కండ్లో? మితిలేని దూరంలోఉన్న నక్షత్రాలనుగూడ చూడగలుగుతాయి. ఇది కండ్లకుగల అద్భుతశక్తి. ఇక ముక్కుయొక్క ఘనత కూడ చూడండి. కొంచెంసేపుంచి మరుగైపోయిన వస్తువుయొక్క వాసనకూడ అది కనిపెడుతుంది. మరుగైపోయిన వస్తువులను కండ్లు చూడలేవు. కాని, ముక్కు కనిపెడుతుంది.

అక్క ఒకనాడు తలలో మల్లెపూలు పెట్టుకొంటుంది. ఆటుతర్వాత మూడవనాడుకూడ తమ్ముడు మూచూచి ఆ వాసన కనిపెడుతాడు.

ముందురోజు ఉండిన పూలను కండ్లు ఈరోజు చూడ లేవు. నిన్నరాత్రి దొంగ నడచినదారిని కుక్క ఇవాళ మూచూచిమూచూచి కనిపెడుతుంది. అట్లే ముందురోజు రాత్రి ఎలుక పరుగెత్తినదారిని పిల్లి ఇట్టే కనిపెట్టి వేటాడుతుంది. కండ్లు చూడలేనివానిని ముక్కు కని పెడుతుంది.

కండ్లూ, ముక్కూ కనిపెట్టలేని పాటను చెవి విన గలుగుతుంది. విని హృదయానికి ఆనందాన్నిస్తుంది.

ఈ శరీరంయొక్క కథ అతి విచిత్రమయింది. చూచి, విని, మూచూచి, తాకి అనుభవించిన వస్తువుయొక్క జ్ఞాపకం ముప్ఫయియేండ్లు పోయినా, కావలసివచ్చినప్పుడు, పాతచిత్తా చూచి వెనుక ఎప్పుడో ఇచ్చిందీ పుచ్చుకొన్నదీ జ్ఞాపకం తెచ్చుకొనే టట్లుగా తెచ్చుకోవచ్చును. పంచేంద్రి యాలశక్తికంటే ఈ జ్ఞాపకం అనేశక్తి మిగుల అద్భుత మయింది. ఎంతకాలమైపోయినా ఈ జ్ఞాపకశక్తి అనేది పాతవిషయాలను ఇప్పుడు కండ్లతో చూస్తున్నామేమో అనేటట్లుగా మన మనోనేత్రాల యెదుటికి తెచ్చి చూపు తుంది. ఎన్నడో అరవైయేండ్లకు ముందు విన్న మా నాయనగొంతూ, మా అమ్మగొంతూ జ్ఞాపకానికి వచ్చి, ఇప్పుడు చెవితో వింటున్నట్లుగానే ఉంది.

చనిపోయినవారి కంఠస్వరం జ్ఞాపకానికి వస్తే పాల వలెనే మధురమనిపిస్తుంది. అట్లే వారి రూపులూ, ప్రేమగా వారు మనలను నిమిరిన స్పర్శలూ జ్ఞాపకానికి వస్తే పాత కాలానికీ, ప్రస్తుత కాలానికీ భేదమే లేకుండా పోతుంది.

మంచిస్మృతు లిచ్చే ఆనందంకన్నా మధురమైంది మరేదీ లేదు.



# 30. అవివేకపురి కథ

అవివేకపురిలో ఎలుకలబాధ ఎక్కువయిపోయింది. గ్రామస్థులు జమీందారువద్దకు వెళ్లి చెప్పుకొన్నారు. ఆయన పిల్లి పేటకు వెళ్లి పిల్లిగారిని వేడుకొన్నాడు. వారు అక్కడ సన్యాసిగా ఉండినారు.

'స్వామీ! మా చిరుగ్రామంలో తాము కొన్నాళ్లు పాటు మకాం వేసినట్లయితే మేము తమకు చాలా ఋణపడి యుంటాము.' అని జమీందారుగారు వారిని ప్రార్థించినారు. అందుమీాదట పిల్లిస్వామి 'మాకిప్పుడు ఎలుకలమీాద మనస్సు లేదు. మేము శివపూజలో నిమగ్నులమై యున్నాము' అని చెప్పినారు.

'చాతుర్మాస్యవ్రతం అక్కడనే నడిపించవచ్చును. దయచేయండి' అని జమీందారుగారు వేడుకొన్నారు. అందుమీాదట స్వాములవారు ఒప్పుకొన్నారు.

పగలంతా ఉపన్యాససభ. తండోపతండాలుగా జనం. పురుషులూ, స్త్రీలూ, పిల్లలూ లెక్కలేకుండా చేరు

తారు. పిల్లిస్వాములవారి ఉపన్యాసాలు బహురసవంతంగా ఉండినవి.

'మీ గ్రామంలో ధాన్యానికి కొరత లేదు. కాయ గూరలు మొదలైనవి తోటలలో సమృద్ధిగా పండు తున్నాయి. మీ ఆవులు పాలు, పెరుగు, వెన్న దండిగా ఇస్తున్నాయి. మరి యేల మీకు పులావుభోజనంపైన ఈ మమత? వద్దు, నాయనలారా! వద్దు. అది మహాపాపం. కాబట్టి దానిని వదలండి. నన్ను చూడండి. నేనుకూడ ఒకప్పుడు ఈపాపం చేస్తూ వచ్చినాను. మా గురువుల వారి కృపవల్ల ఈ రెండు సంవత్సరాలుగా నేను శాకాహారం తోనే జరుపుకొంటూ వస్తున్నాను.'

ఇట్లంతా చెప్పి సభ్యులమనస్సును ఇట్టే కరగించి వేసినారు పిల్లిస్వాములవారు.

అవివేకపురిలో ఉన్నవారందరూ ఒక్కసారిగా పరమభక్తు లయిపోయినారు. సాత్వికాహారానికి పూను కొన్నారు.

సాయంకాలం అందరూ పిల్లిస్వాములవారికి దండం పెట్టి ఎవరియిండ్లకు వారు వెళ్లిపోతారు. అటుపిమ్మట రాత్రి వేళ పిల్లిని యథావిధిగా జపతపాలు చేసుకోనిస్తారు. పిల్లి స్వాములవారు దినదినానికీ బలుస్తూవచ్చినారు. అవివేక పురిలో ఎలుకల ఉపద్రవం తగ్గిపోయింది. కారణంమటుకు ఊరివారికి తెలియ లేదు.

ఉపన్యాసాలు విన్నవారు ఇరుగుపొరుగు లందలి గ్రామాల్లో తమబంధుమిత్రులకు ఈ స్వాములవారి మహి

మను గురించి చెప్పుతూవచ్చినారు. 'మహాతపస్వీ. మేము చేసుకొన్న భాగ్యవిశేషం. మమ్ములను మంచిదారికి తిప్పినారు.' అని పొగడినారు.

పక్కఊరిలో ఒక చిలిపివాడు. వాడు చమత్కారమైన ఒకబోను తయారుచేసినాడు. దానిలో రెండు ఎలుకలను పట్టి, లోపల ఒక అరలో ధారాళంగా తిరిగేటట్లు విడిచిపెట్టి, కొయ్యతో తంత్రంగా తయారుచేసిన ఆ పెద్ద బోనును తీసుకొనివెళ్లి కపాలేశ్వరుని గుడిలో పెట్టిపోయినాడు.

మరుసటిరోజు ఉదయం యథాప్రకారంగా స్వాముల వారి ఉపన్యాసం వినడానికని అందరూ చేరినారు. ఎంతసేపటికీ స్వాములవారు రాలేదు. కారణమేమిటని విచారించినారు. ఎవరికీ తెలియలేదు.

స్వాములవారికై ఏర్పాటుచేసియిచ్చిన మఠానికి వెళ్ళి చూచినారు. అక్కడకూడ స్వాములవారు లేరు. ఒక్కవివరమూ తెలియలేదు.

అప్పుడు ఆ చిలిపివాడు వచ్చి 'రండి, నాతోకూడ రండి. నేను మీ స్వాములవారిని చూపుతాను.' అనిచెప్పి గ్రామస్థులను వెంటబెట్టుకొని పోయినాడు. గ్రామానికి ఉత్తరంగా, కొంచెం పాడుపడియుండిన కపాలేశ్వరునిగుడికి వారిని తీసుకొనిపోయినాడు. అక్కడ కొయ్యబోనులో పిల్లిస్వాములవారు చిక్కుకొనిపోయి ఉండడం వారు చూచినారు.

'వట్టి అభాండం వేయకండి. నేనుకాదు మీ స్వాముల వారిని.' అన్నది ఆ పిల్లి.

'అయితే, మరి మీ రెవరు ?' అన్నారు గ్రామస్థులు.

'భగవదనుగ్రహంవల్ల వారు నా యీ నీచశరీరంలో కొన్నాళ్లు బసచేసియుండినారు. నిన్న రాత్రి వారు నావద్ద సెలవుపుచ్చుకొని అంతర్ధానమై పోయినారు. దయచేసి నన్ను బైటికి విడిచిపెట్టండి.' అని చెప్పింది పిల్లి.

చిలిపివాని తల్లి జాలిపడి బోనుతలుపు తెరిచివేసింది.

వెంటనే పిల్లి ఒక్కఊపుతో బయటి కురికి కండ్లకు తెలియకుండా పారిపోయింది.

అవివేకపురిలో అందరూ మళ్ళీ యథాప్రకారంగా కోళ్లనూ గొర్రెలనూ ఆహారంలో ఉపయోగించడానికి ఆరంభించినారు.

చాతుర్మాస్య మంటే వర్షాకాలంలో భక్తులు ఒక యూరియందే పట్టుగానిలిచి, పూజాక్రమం నడుపుకొంటూ, భోజనం మితపరచుకొని, నియమనిష్ఠలతో నాలుగు నెలలు గడపడం.

మొదటివాడు మహాదేవుని అనుగ్రహం సంపాదిస్తే ఏ కుక్కయినా అందలమెక్కుతుంది. అయితే అబద్ధాలు కప్పిపెట్టి బతికేవారు ఆ అనుగ్రహం సంపాదించలేరు. అసత్యాన్ని తోసిపారవేయడానికైనా భగవంతుని అనుగ్రహం అవసరం. అందుకు ఏడ్చి తీర్చుకోవలెను. మనస్సు కరగి ఏడిస్తే మనకు అనుగ్రహం లభిస్తుంది.



# 31. చిద్విలాసం

నందివర్మ అంతఃపురానికి చెందిన నందనవనంలో ఒక కోయిల. అది చాలా ఇంపుగా పాడుతుంది. రాజకుమారికి దానిపైన మిక్కిలి ప్రేమ.

ఒకనాడు దీపావళిరోజున ఏదో ప్రమాదవశంచేత అంతఃపురంలో అగ్గి అంటుకొని భయంకరంగా వ్యాపించిపోయింది. ఊరిజనమంతా వచ్చి నిప్పు ఆర్పివేయడానికై ఇసుక వేసేవాళ్లు ఇసుకవేస్తూనూ, నీళ్లు చిమ్మేవాళ్ళు నీళ్ళు చిమ్ముతూనూ, తదేకదీక్షగా ఉన్నారు.

అక్కడ నందనవనంలో కోయిల తనపాటికి తాను యథాప్రకారం పాడుకొంటూ ఉండింది. ''ఒకవంక అంతఃపురం అంటుకొని కాలిపోతూఉంటే, తగుదునమ్మా అని ఈ కోయిల హాయిగా పాడుకొంటూ ఉన్నదే'' అని అంతఃపురాధికారికి చాలాకోపం వచ్చింది. ఆ కోపంతో ఆయన ఒకరాయి తీసి దానిమీదికి విసిరినాడు. ఆ రాతిదెబ్బకు కోయిల కిందపడిపోయి విలవిల తన్నుకొని చచ్చింది.

నిప్పు ఆర్పివేసినారు. ఎక్కువనష్టం కాలేదు. అందరూ సంతోషించినారు. రాజకుమారి నందనవనానికి వచ్చింది. కోయిల చచ్చిపడిపోయి ఉండడం చూచింది. ఆవిడ దుఃఖం పట్టలేకపోయింది. రాజుదగ్గరకు వెళ్ళి గొల్లున ఏడ్చింది.

అధికారి అసలువిషయం తెలియజేసినాడు. రాజుగారికి కోపం వచ్చింది. 'అయ్యో! కోయిలకు పాడడం మాత్రమే తెలుసునన్న సంగతి మీకు తెలియలేదా? అది

బకెట్టుతో నీళ్ళు మోసి తేగలదా? నిప్పునార్పడానికి అది ఏమి చేయగలుగుతుంది? దానిని అన్యాయంగా చంపి వేస్తిరే!' అని అధికారిని ఖండించినారు.

'మహారాజా! అపరాధం చేసినాను. కోయిలకు పాడడం మాత్రమే తెలుసు, నీళ్ళు మోసి తేవడం తెలియదు అన్న సంగతి నా రాజభక్తిలో నేను మరచిపోయినాను. మీ యందు నాకు గల భక్తిమూలంగా నేను వివేకం కోల్పోయినాను,' అని అధికారి చెప్పుకొన్నాడు.

'వారివారికి వారివారి వృత్తులు మాత్రమే తెలుస్తాయి. కోయిలకు పాడడం మాత్రమే తెలుస్తుంది. అంతఃపురాధికారికి అంతఃపురరక్షణ మాత్రమే తెలుస్తుంది. నాకు దండించడం మాత్రమే తెలుసు. నీవు నీ దుస్తులు విప్పివేసి అక్కడపెట్టి ఇంటికి వెళ్ళిపోవచ్చును. నిన్ను ఉద్యోగం నుంచి తొలగించినాను.' అన్నాడు ప్రక్కనే ఉన్న మంత్రి.

'నాన్నా! వద్దు. ఆయనను ఉద్యోగంనుంచి తొలగింపించవద్దు. కోయిల చచ్చిపోయింది చాలు. ఆయన యింటిలో భార్యాబిడ్డలు అఘోరిస్తారు. ఏడుస్తారు. అది వద్దు.' అని రాజకుమారి తండ్రిని వేడుకొన్నది.

'నీకు కన్నీరు విడవడం మాత్రమే తెలుసు!' అంటూ రాజు కుమార్తెను దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకొన్నాడు.

'చూచినావా పార్వతీ!' అన్నాడు పరమశివుడు.

'నీకు కన్నీరు విడవడం మాత్రమే తెలుసునంటాడు నందివర్మ కుమార్తెను చూచి - నీకూ అదే వృత్తి కదా!' అని పార్వతితో అని ఆయన నవ్వినాడు.

'అసలు తప్పులను మీరేకదా కల్పించేది? మీరే మహాపరాధులు. వివేచన చూపడానికే కదా నేనున్నది?' అన్నది పార్వతి.

'అవును కోయిలా!' అన్నాడు పరమశివుడు.

'నా నటనలో లోపమేమీ లేదు. దూరంలో నిలుచుని చూచేవారికి ఏదో లోప మున్నట్లుగా కనబడుతుంది. వారికోసం నేను ఆడడంలేదే! నీ కోసమేకదా నేను ఆడుతాను!' అని పరమేశ్వరిని అలరింప జేసినాడు.



## 2. ప్రేమలో అసూయ

ఒక అడవిలో ఒక పులి. వయస్సు మీరిపోయినందున అది కొంచెం నిలబడిపోయింది. ఆ ముసలిపులికి ఒక బిడ్డ. దానికి తగినవయస్సు రాగానే దాని నొక మగపులికిచ్చి పెండ్లి చేసి తల్లి పులి సంతోషంగా కాలం గడుపుతూ ఉంది. ఎద్దో, ఎనుమో, ఆవో, జింకో ఏదైనా దొరికితే వయసు పులులు తా మింత తిని మిగిలినమాంసాన్ని ముసలిపులికి పెట్టేవి. అదికూడా దానితో తన ఆకలి తీర్చుకొంటూ ఉండేది. తన తల్లిపైన ఆడపులికి అమితమైన ప్రేమ.

'నన్ను నీవు బొత్తిగా లక్ష్యమే చెయ్యడంలేదు. ఎప్పుడు చూచినా నీకు తల్లిమీదనే చింత!' అని మగపులి పొలయలుక వహించి ఆడుపులితో అంటుంది.

'నన్ను కడుపున మోసి కనిపెంచిన తల్లిని మరిచి పోవడ మెట్లా' గని ఆడు పులి సమాధాన మిస్తుంది.

*　　　*　　　*　　　*

ముసలిపులికి తనబిడ్డ ఉత్తమగుణం తెలియలేదు. దేవిని తలచుకొని, తనచింతను, వచ్చినలోటును చెప్పుకొన నారంభించింది.

'మాతా! మహాకాళీ! ఎందుకు నన్నిట్లు అనాథనుగా వదిలిపెట్టివేసినావు? నా బిడ్డ తన మగనితో నవ్వుతూ చేస్తూ, ఆడుతూ పాడుతూ తనంతకుతాను సుఖంగా కాల క్షేపం చేస్తూ ఉంది. నన్ను బొత్తిగా మరచేపోయింది. నేను ఎంతో ఆశగా, గారాబంతో పెంచిన నాబిడ్డ నన్నిప్పుడు గమనించుకోవడమే లేదు.' అంటూ చెప్పుకొన్నది.

మహాంకాళి ముసలిపులికి సమాధాన మిచ్చింది. 'బిడ్డా! నీవు భాగ్యశాలినివి. నీబిడ్డ నీయెడల మిక్కిలి ప్రేమగానే ఉంది. అయితే, అది తన మగనిని తోసిరాజు చేయడం సాధ్యమా? నీవేకదా పెండ్లిచేసి యిచ్చినావు! అని చెప్పింది.

'నేనే పెండ్లిచేసి యిచ్చినాను. నిజమే. అయితే వివాహ మయిపోయినతర్వాత ఇప్పుడిట్లు నా మీది అభిమానాన్ని బొత్తిగా మరచిపోతుందని కలలోగూడ అనుకో లేదు. మృత్యువు నన్నెంత త్వరగా తీసుకొనిపోతే అంత బాగుంటుంది!' అన్నది ముసలిపులి.

'వెఱ్ఱిబాగులదానా! అట్లా మాట్లాడవద్దు. నీకు బుద్ధిలేదు.' అని చెప్పింది దేవి.

దేవిమాటలతో ఆపులికి సమాధాన మేర్పడలేదు. ఆ దుఃఖంతోనే అది చనిపోయింది. దేవియనుగ్రహంవల్ల ఆ ముసలిపులి ఒక మనిషిజన్మ ఎత్తింది. అది ఒక యింటికి కోడలుగా వెళ్లింది.

'అయ్యో! ఇట్లాకూడ ఉంటాడా ఒక మనిషి! నేను మా నాయనగారి యింట ఎంతో గోముగా పెరిగితిని. నన్ను ఈయన కిచ్చి కట్టిపెట్టినారే! నన్నీయన కించిత్తుకూడ అభిమానించక హింసిస్తున్నారే! కారణం లేకుండానే కోపపడుతారే! ఎప్పుడు చూచినా తమ తల్లి – ఆ చండాలి సుందరమ్మచేతనే తాము సంపాదించిందంతా పోసి నాశనం చేసివేస్తున్నారే!' అంటూ కనకవల్లి కండ్ల నీళ్లుపెట్టుకొని ఏడుస్తూ, తన అన్న సుందరరావు దగ్గర మొరపెట్టుకొన్నది.

'తాను సంపాదించింది తన తల్లిచేత పెడితే మనకు వచ్చిన నష్టమేమిటి?' అన్నాడు సుందరరావు.

'అయ్యో! అదేమి టడుగుతావు! ఆవిడ అదంతా తీసుకుపోయి, తన బిడ్డలు వసుధా, వసంతలకు రహస్యంగా ఇచ్చివేస్తుంది. తనకొడుకుజీవితం ఎట్లా పాడైపోయినా సరేనని ఆవిడ యిట్లా చేస్తున్నది.' అని చెప్పింది కనకవల్లి.

'తాను కనిపెంచిన బిడ్డలయెడ కొంచెం అనురాగంగా ఉండడం చూచి మనము అసూయపడరాదు.' అన్నాడు సుందరరావు.

'అన్నా! కట్టుకొన్నభార్యను అలక్ష్యంచేసే మనిషికి నన్నిచ్చి పాడుచేసినారే!' అని యేడ్చింది కనకవల్లి.

పిమ్మట కొన్నాళ్ళకు కనకవల్లికి ఒక బిడ్డ పుట్టింది. మంచి అందమైన బిడ్డ. కాని ప్రసవానంతరం తీవ్రమైన జ్వరంవచ్చి కనకవల్లి చనిపోయింది.

ఆమె ఆత్మ ఆ పరదేవిని చేరుకొన్నది. 'బుద్ధి వచ్చిందా?' అని అడిగింది దేవి.

'భార్యాభర్తలు పరస్పరం ప్రేమగా ఉండడమే మంచిది. తల్లిదండ్రులు అది చూచి అసూయ పడరాదు. బుద్ధి వచ్చింది' అన్నది కనకవల్లి పులి.

'సరి. ఇప్పుడు నీవు మళ్లీ పులి అవుతావా? లేక మనిషి జన్మం కావలెనా?' అని అడిగింది దేవి.

'నన్ను పులిగానే ఉండనీ! మనిషి జన్మం వద్దు. మానవలోకం చాలా చాలా చెడిపోయి ఉంది.' అన్నది కనకవల్లి.

'నీ వెఱ్ఱి ఇంకా తీరలేదు. నీ వెక్కడికీ పోవద్దు. నాతోకూడానే ఉండు.' అని చెప్పింది మహాకాళి.



# 33. సంసారం

తపస్సుచేసుకొంటూ ఉండిన ఒక ఋషి పక్షులను పరకాయించి చూచినాడు. తానుకూడ ఒక పక్షిఅయిపోతే జీవితంలో సుఖం చెందవచ్చునుగదా అని అనుకొన్నాడు.

ఆయన చేస్తూవచ్చిన తపస్సుఫలితంగా ఆయన కోరుకొన్న కోరిక వెంటనే సిద్ధించింది. ఆయన ఒక పిచ్చుక

అయి ఒక ఆడుపిచ్చుకతో కలిసి సంతోషసంబరాలతో ఎగిరిపోయినాడు.

*    *    *    *

గూటిలో ఉన్న తమపిల్లలకు చిన్నచిన్న పురుగులను ఏరుకొనివచ్చి పెట్టుతూనూ, తాము కూడ తమకు కావలసిన ఆహారం సంపాదించుకొంటూనూ ఆ రెండు పిచ్చుకలూ కొన్నాళ్ళు జీవనం సాగించినవి. ఇలా ఉండగా ఒకనాడు మగపిచ్చుక గూటికి తిరిగి రాలేదు. ఇంకొక ఆడు పిచ్చుకతో కలిసి ఎగిరిపోయింది.

'ఈ పిచ్చుక మనిషిజన్మపు నడవడిని నాయెడల చూపించింది' అని ఆడుపిచ్చుక అంగలార్చింది.

కొంతకాలమైనతర్వాత ఒకనాడు ఉదయం ఋషిపిచ్చుక తన పాతప్రేయసిని కలుసుకొన్నది. ఒకచెట్టు కొమ్మమీాద కూర్చొనియుండిన ఆ ఆడుపిచ్చుకకు సమీాపంగా, మొదట కొంచెం ఎడంగా కూర్చొని, పిమ్మట మెల్ల మెల్లగా దానిచెంతకు జరుగుతూ వచ్చింది.

'కిచకిచ ! కిచకిచ ! దయచేసి దూరంగానే నిలు. నా దగ్గరకు రావద్దు' అన్నది పెంటిపిచ్చుక.

'కిచకిచ ! ఎందుకట్లంటావు ?' అన్నది ఋషిపిచ్చుక.

'నీవు నిజమైనపక్షివి కావు. నిజమైన పిచ్చుకవే అయిఉంటే ఇట్లు నన్నూ, నా పిల్లలనూ విడిచిపెట్టి, ఇంకొక భార్యను వెతుకుకొని పోయి ఉందువా ?' అన్నది ఆడు పిచ్చుక.

మగపిచ్చుక సిగ్గుపడి ఎగిరిపోయింది.

ఎగిరిపోయి ఒక చెట్టుమీద ఒంటరిగా కూర్చొని ఉండింది. అక్కడికి ఒకపిల్లి మెల్లగా ఒదుగుకొంటూ ఒదుగుకొంటూ వచ్చి పిచ్చుకను సమీపించింది.

పిచ్చుక భయపడి పోయి రివ్వున ఎగిరి దూకుడుగా కిందబడింది. ఆ విసురులో అది అట్లే ప్రాణాలు కోలు పోయింది. చచ్చి పడిపోగానే అది ఋషి అయిపోయింది. ఆఋషి అక్కడనే మళ్ళీతపస్సు చేసుకొంటూ కూర్చున్నాడు.

పిల్లి ఋషిదగ్గరకు మెల్లగా పోయి మూచూచింది. పక్షివాసన ఇంకా కొంచెం కొట్టుతూ ఉండినందువల్ల అది అట్లాచేసింది.

ఋషి పిల్లిని ఏమీ చేయలేదు. పిల్లికూడా ఆయన ప్రక్కన తపస్వివలె కండ్లుమూసుకొని కూర్చున్నది.

'మనిషికూడ పక్షివలెనే మంచిగుణం పొందరాదా?' అని దుఃఖపడుతూ, ఋషి అదేధ్యానంగా తపస్సు చేసి నాడు.

'అది వీలుపడదు' అన్నది పిల్లి. ఋషియోచనను అది ఎట్లాగో తెలుసుకొన్నది.

'ఎందు కట్లంటావు ?' అన్నాడు ఋషి.

'మ్యావ్ ! మ్యావ్ ! స్వభావ మనేది ఒక బల వత్తమమైన శక్తి. నేనుకూడ మంచిదాన్ని కావలె నని ఎంతగానో చూస్తున్నాను. కాని పక్షిగాని, ఎలుకగాని కంటబడితేసరి వెంటనే అంతా మరచిపోతాను. ఆ విధం

గానే మీ జాతిస్వభావంకూడ. మనుష్యజన్మలో వాగవారి మనస్సులు నిలవరంగా ఉండవు. పిల్లులమైన మేముకూడ ఈ విషయంలో మీ మాదిరిగానే ఉన్నాము.' అని చెప్పింది పిల్లి.

ఋషికి సిగ్గు ఇంకా ఎక్కు వయిపోయింది.

'దయచేసి నీవు అవతలికి పో. నేను తపస్సు చేసుకో వలెను.' అన్నాడు.

'మ్యావ్! మ్యావ్! అదీ ఇదీ తలచుకొంటూ చంచలపాటు పడుతూ మీరు తపస్సు ఏమిచేస్తారు?' అని చెప్పుతూ పిల్లి తనదారినితాను పరుగెత్తిపోయింది.

ఋషికి దేవి ప్రత్యక్షమై 'వత్సా! నీకు ఆశలు తీరలేదు, నీవు మొదట సంసారం సరిగా నడుపుకొని అల వాటు సాధించి, పిమ్మట తపస్సుచెయ్యి' అని బోధించింది.



## 34. పాముఁను పట్టిన పిల్లి

ఒక పాముపుట్ట. అందులో ఒక పాము. ఎప్పుడు చూచినా కీచులాడుకొంటూ ఉండిన ఒకకోతీ, ఒకపిల్లి ఆనాడు ఎట్లాగో ఒకటిగాచేరి అదనుకాచియుండి పామును పట్టు కొన్నవి. పిల్లి మీది కురికి మెడను గట్టిగా కరచు కొన్నది. కోతి తోకను గట్టిగా పట్టుకొన్నది. పాము తప్పించుకో జూచింది. కాని సాధ్యపడలేదు.

పిల్లీ, కోతీ రెండూ ఒకటి మెడనూ, ఒకటి తోకనూ విడిచిపెట్టకుండా చాలాసేపు అట్లాగే పట్టుకొని యుండినవి.

పిమ్మట పిల్లికి ఆకలివేయ నారంభించింది. కోతికి గూడ అంతే. పామును విడిచిపెడితే కరుస్తుంది. అందుచేత భయపడి కోతీ, పిల్లీ అటుపామును విడిచిపెట్టి పోలేకనూ ఇటు ఆకలికి ఏమిచేయడమో తోచకనూ ఒకటి నొకటి చూచుకొంటూ పామును పట్టుకొన్నవి. పట్టుకొన్నట్లుగానే పుట్టదగ్గరనే కాలం గడిపినవి.

ఆ పాముకు ఒక వరం కద్దు. 'నీకు నాలుగుకాళ్ళ ప్రాణులచేత ప్రాణభయం లేదు.' అని అది ఒకవరం పొంది ఉంది. ఎవరో ఒక ఋషి తన కుమారుడైన ఆ సర్పానికి ఆ వరాన్ని ఇచ్చియుండినాడు. ఈ సంగతి ఆ పిల్లికీ తెలుసు; కోతికీ తెలుసు. 'నా పామును చంపజూచినట్లయితే మీరే చస్తారు.' అని ఆ ఋషి హెచ్చరించికూడ ఉండినాడు.

ఆకలితో చచ్చిపోయే టట్లుగా ఉండింది కోతి. 'ఏయ్ పిల్లీ ! నీవు విడవకుండా పట్టుకొనియుండు. నేను ఒక్క పరుగున వెళ్ళి ఏదైనా ఇంత తినివస్తాను.' అని పిల్లితో చెప్పింది.

'వీలులేదు. నీవు విడిచిపెడితే పాము వెంటనే తోకతో నన్ను చుట్టుకొని నలిపివేస్తుంది.' అన్నది పిల్లి.

కొంచెంసేపయిన తర్వాత పిల్లి 'నేను అట్లా కొంచెం దూరంపోయి, ఎక్కడైనా ఒక ఎలుకను పట్టుకొని, ఆకలి కాస్త తీర్చుకొని చూస్తునట్లుగానే వచ్చివేస్తాను. నీవు పాముతోకను ఇట్లాగే గట్టిగా పట్టుకొనియుండు.' అని చెప్పింది.

'మా బాగా చెప్పినావు! నీవు మెడను విడిచిపెట్ట గానే పాము తక్షణం తోకను పట్టుకు కూర్చున్న నన్ను కాటువేస్తుంది. కాబట్టి ఇద్దరూ ఒకేసారిగా చెంగున పరు గెత్తిపోదాము. ఏ మంటావు?' అన్నది కోతి.

'నా మీదనే పాముకు కసి. నన్ను తరుముకొనివచ్చి విషపుకోరలతో నన్ను అంతంచేస్తుంది.' అన్నది పిల్లి.

'ఎంతో కష్టపడి పామును పట్టుకొంటిమి. ఇప్పుడు విడిచిపెట్టడానికీ లేదు; పట్టుకొని ఉండడానికీ సాధ్యం కాకుండా ఉందే! ఈ విషపుపాములను దేవు డెందుకు సృష్టించినాడో!' అన్నదికోతి.

'పిల్లు లుండగా పా మెందుకు?' అన్నది పిల్లి.

ఒక ఎలుక ప్రక్కనే పరుగెత్తింది. వెంటనే పిల్లి ఆవేశం పైకొనగా అన్నిటినీ మరిచిపోయింది. ఎలుకను పట్టడానికి మీాది కురికింది. వెంటనే పాము కోతిని కాటువేసి పుట్టలోకిపోయి దూరుకొన్నది.

కోతికి విష మెక్కింది. పిల్లిమీాద అది రోషం వహిం చింద. దానిమీాది కురికి గీరి, బరికి, చీల్చి అక్కడనే చంపి వేసి, స్పృహతప్పి నేలమీాద పడిపోయింది.

ఎలుకను గురించి చెప్పవలసిన పనే లేదు. అది పిల్లినోటనే ప్రాణం కోలుపోయి స్వర్గానికి వెళ్ళింది. మిగి లింది పాము మాత్రమే!

ఈ కథ పిల్లలకు సులభంగా అర్థ మవుతుంది. పెద్ద వారు కొంచెం కష్టపడతారు. ఇది జర్మనీప్రశ్నయా? అని అడుగుతారు.

# ౯౯. కీటకము, పురుగు

సీతాకోకచిలుక ఒకటి నందనవనంలో ఒక చెట్టు నుంచి ఇంకొక చెట్టుకు ఎగురుతూ, పువ్వులమీద వాలి, తేనె తాగుతూ సంతోషంగా కాలంగడుపుతూ వచ్చింది. ఒకనాడది ఒక చెట్టుమీద ఆకు కంటుకొని యుండిన ఒకపురుగును చూచింది. చూచి నవ్వింది.

'ఓ పురుగా! నీవూ ఒక ప్రాణివిగా ఉన్నావే! నీకు సిగ్గులేదూ?' అని దానిని హేళనచేసింది.

'నాపాటికి నేను నిశ్చింతగా ఉన్నాను. నా కేమి కొరత!' అన్నది పురుగు.

'నీ కొక్కటీ తెలియలేదు. నే నెట్లా ఎగురుతానో చూడు. నీవు, రెక్కలులేకుండా, ఆకు కంటుకొని పాకిపాకి పోతావు. ఈ నికృష్టజీవితంతోనే నీవు తృప్తిపడుతున్నావే! నీ వంటి అల్పప్రాణిని నేను చూడనేలేదు.' అన్నది కీటకం.

'అన్నా! నీవూ కొన్నాళ్ల కిందట పురుగుగా ఉన్న దానివే! అది నీకు జ్ఞాపకం లేదా?' అన్నది ఒక పిచ్చుక సీతాకోకచిలుకను చూచి.

'అబద్ధాలాడకు. నే నేమిటి, పురుగుగా ఉండి ఉండడ మేమిటి? నేను ఎప్పుడూ ఇట్లాగే ఉండినాను. ఇకముందు కూడ ఇట్లాగే ఉంటాను.' అన్నది కీటకం.

ఇట్లుచెప్పి అది తన చెలికానితోపాటు ఎగిరిపోయింది.

కొన్నాళ్లకు ఆకీటకం గర్భం ధరించింది. మంచి చోటు చూచుకొని గుడ్లుపెట్టింది. అవి చిట్లడానికై పరమానందంతో కాచుకొని ఉండింది.

ఉండగా ఉండగా ఒకనాడు గుడ్లు చిట్లినవి. 'అయ్యో! ఇదేమి అన్యాయము! అన్నీ పురుగులుగా ఉన్నవే! నా బిడ్డలు నావలెనేకదా ఉండవలెను? ఇదేమి శాపం?' అని ఆ కీటకం ఏడ్చింది.

'ఆనాడు నీవు ఆ పురుగును అవమానిస్తూ మాట్లాడితివే, ఒకవేళ అది యేమైనా శాపంపెట్టిందేమో!' అన్నది మగకీటకం.

'లేదు లేదు. ఆ పురుగు మంచిపురుగు. అది శాపం పెట్టి యుండదు.' అన్నది ఆడకీటకం.

కొంచెం సేపయినతర్వాత 'నాకెందుకో ఇప్పుడు పురుగులనుచూస్తే ప్రేమగానే ఉంటున్నది. పూర్వంవలె కాదు.' అన్నది.

'ఇది ఆశ్చర్యమే! నాకూ అట్లాగే ఉన్నది!' అన్నది మగకీటకం.

మరికొన్నాళ్లకు ఆ పురుగులన్నీ కీటకాలుగా మారిపోయినవి. రెక్కలువచ్చి ఎగురులాడ జొచ్చినవి.

'ఇవిగోచూడు, నీ బిడ్డలు.' అన్నది పిచ్చుక.

'పురుగులన్నీ కీటకా లయిపోయినాయే! ఇట్లాకూడ ఉంటుందా?' అన్నది కీటకం.

తల్లికీటకం పిల్లకీటకాలను చూచి 'బిడ్డలారా! మీరు పురుగులుగా ఉంటిరే, జ్ఞాపకమున్నదా? ఇప్పుడు నా పోలికగా తయారయినారు; సంతోషం!' అన్నది.

పిల్లకీటకాలకు ఇది యేమీ బోధపడలేదు. తల్లిని గమనించకుండానే ఎగిరిపోయినవి. అవికూడ పువ్వులలో తేనె త్రాగడానికి ఆరంభించినవి. తల్లినీ, తండ్రినీ గమనించడమే లేదు.

'ఈ లోకం పాడులోకం. బిడ్డలు కన్నతల్లిని గమనించడమే లేదు.' అని వృద్ధకీటకం దుఃఖంతో అన్నది.

'అవునయ్యా! అవును...సరి. నిద్రవస్తున్నది. మనం కండ్లు మూసుకొని ఇంక ఊరికే ఉందాము.' అన్నది తల్లికీటకం.

రెండూ ఉన్నచోట అట్లే నిద్రపోయినవి. సుఖంగా నిద్రపోయినవి. లేవనేలేదు. అసలు మళ్ళీ మేల్కొననేలేదు. ఒకటే నిద్ర!

రాజారాణి వేషాలువేసుకొని ఆడుతారే నాటకంలో, అదేవిధంగా పురుగులు కొన్నాళ్ళు ఎగిరే కీటకాలుగా ఆడుతాయి. పిమ్మట సుఖంగా నిద్రపోతాయి. నిద్రపోయి మరి లేవనేలేవవు. అవి యే పాపమూ చెయ్యని ప్రాణులు. సరాసరి భగవంతునిదగ్గరకు వెళ్ళిపోతాయి.

కొందరు * బీదలు అదృష్టవశంచేత ధనవంతు లవుతారు. వారిలో కొందరు తమ వెనుకటిస్థితిని మరచిపోయి, గర్వంగా నడచుకొంటూరు. అటువంటి పరిస్థితికి పురుగులు కీటకాలై తమపూర్వరూపాన్ని పూర్తిగా మరచిపోవడాన్ని

ఉపమానంగా చెప్పడం కద్దు. అయితే, ఆ విధంగా గర్వపడే మనుష్యులు కీటకాలవలె ఏపాపమూ ఎరగని అమాయకులు మాత్రం కారు. పైగా, వారు కీటకాలవలె పాతజన్మను పూర్తిగా మరచిపోవడం లేదు. జ్ఞాపకం ఉండే గర్వపడుతారు. పురుగులూ కీటకాలకువలె వారికి సుఖనిద్రకూడా ఉండదు. అట్టి మనుష్యులను చూచి మనం జాలిపడవలెను.



## 36. సోమపాళెం బాలురు

కరూరుదగ్గర సోమపాళెంలో ఒకబడి. ఆ బడివెనుక మైదానం.

'మీ నాయనకు ఏమిపనిరా చీనూ?' అని అడిగినాడు సుబ్బులు.

'మీ నాయనకు ఏమి పనో ముందుచెప్పు. నేను తర్వాత చెప్పుతాను' అన్నాడు చీను.

'మా నాయన తాపీపని చేస్తాడు. ఇండ్లుకట్టడం ఆయనపని. ఇటుకలు, గార, సున్నం మొదలయినవాటిని గురించి నీకేమి తెలుసు? నీ కొక్కటీ తెలియదు.' అన్నాడు సుబ్బులు.

'వాటిని గురించి నాకు తెలియవలసిన కర్మమేమిటి? నేను లక్షణంగా పుస్తకాలు చదివి, ఆఫీసులో ఉద్యోగానికి పోతాను.' అన్నాడు చీను.

'ఆఫీసులో ఏమిపని చేస్తావు? కూడికలూ, గుణకారాలూ చేస్తావా?' అన్నాడు సుబ్బులు.

ఇద్దరికీ జగడం సాగింది.

'పెద్దల్లారా! జగడ మెందుకురా వేసుకొంటారు?' అంటూ మధ్యలో జొరబడ్డాడు రామేశం.

'మీ నాయన ఏమిపని చేస్తాడు రామేశం?' అని అడిగినాడు సుబ్బులు.

'మా నాయన కరూరులో బ్యాంకికొట్టు నడుపు తున్నారు.' అని చెప్పినాడు రామేశం.

'అదేమి కొట్టురా? ఏ మమ్ముతారు ఆ కొట్టులో?' అని అడిగినాడు చీను.

'అందులో ఏమీ అమ్మరు. పెట్టెలో డబ్బు వేసిపెడు తారు. అది పిల్లలు పెడుతుంది. ఆ పిల్లలను తీసి ఇంకొక పెట్టెలో వేసి మూసిపెడుతారు. ఇంకా పిల్లలు పుడుతాయి. ఇట్లే పెట్టెతర్వాత పెట్టెగా నిండిపోతాయి.' అన్నాడు రామేశం.

'అరే! పీళ్లనాయన కోళ్లుపెంచుతా డన్నమాట. కోళ్లే గదా గుడ్లుపెట్టి పిల్లలు చేసేది? డబ్బెక్కడయినా పిల్లలుపెడుతుందా?' అన్నాడు సుబ్బులు.

'నీకు తెలియదులే, ఊరుకో. మా కొట్టులో నిజం గానే డబ్బు పిల్లలు పెడుతుంది. కావలిస్తే పంతులవారిని అడిగిచూడు.' అన్నాడు రామేశం.

'పంతులవారిని గనుక అడిగితే నాలుగు తగిలిస్తారు.' అన్నాడు సుబ్బులు.

* * * *

'కణ్ణడు పీనాంగుకు వెళ్లిపోయినాడు, నీకు తెలుసునా?' అన్నాడు సుబ్బులు.

'ఎందుకు పోయినాడు?' అని అడిగినాడు చీను.

'వాండ్ల నాయనగారి యింటిని రామేశంతండ్రి వేలం వేయించి, వాండ్లను ఇంటినుండి తరిమివేసినాడు.' అన్నాడు సుబ్బులు.

'అయ్యో పాపం!' అన్నాడు చీను.

'రామేశంనాయన అప్పు ఇచ్చి ఉండినాడు. కణ్ణని తండ్రి బాగా కల్లుతాగి అంతా పోగొట్టుకొన్నా డట.' అన్నాడు సుబ్బులు.

'కల్లుతాగితే డబ్బంతా తుడిచిపెట్టుకొని పోతుందా?' అని చీను అడిగినాడు.

'పోతుంది' అన్నాడు సుబ్బులు.

'అయితే మరి, ఎందుకు కొని తాగుతారు?' అని చీను అడిగినాడు.

'నీ వెప్పుడైనా కల్లువాసన చూచినావా?' అన్నాడు సుబ్బులు.

'లేదు, అది ఎట్లా ఉంటుంది?' అన్నాడు చీను.

'ఒకటే దుర్వాసన! దగ్గరకుపోవడానికి కూడ సాధ్యపడదు.' అన్నాడు సుబ్బులు.

'పీనాంగు చాలా దూరమా?' అని అడిగినాడు చీను.

'నాకు తెలియదు.' అన్నాడు సుబ్బులు.

'పంతులవారిని అడుగుదాం.' అన్నాడు చీను.

'అమ్మయ్యో! నాలుగు తగిలిస్తారు.' అన్నాడు సుబ్బులు.

ఆ కుఱ్ఱవాండ్లందరికీ పంతులవారిని చూస్తే బహు భయం. ఆయన ఎప్పుడూ కోపంతో మటమట లాడుతూ ఉంటాడు. ఇన్‌స్పెక్టరుగారికి ఆయనపైన చాలా ఇష్టం. సోమపాళెంకుఱ్ఱల దురదృష్టం!

పంతుళ్లు కోపగించుకో గూడదు. అందరు పంతుళ్లూ అట్లా కాదు.



# 37. మూ గ జీ వి

ఒక రైతు తమ రాజు విషయమై అసంతృప్తి చెంది, అడవికిపోయి తపస్సు చేసినాడు. 'భగవంతా! మా రాజు మంచివాడు కాడు. మా కొక మంచి రాజు ని' మ్మని వేడుకొన్నాడు.

ఇంకొక బీదవాడు అదే అడవిలో తపస్సు చేస్తున్నాడు. 'నేను మిక్కిలి నమ్మిన స్నేహితుడు నన్ను నిలువునా మోసం చేసినాడు, స్వామీ! నాకు వేరే ఏమీ వద్దు. ఒక మంచి స్నేహితుణ్ణి ఇ' మ్మని ప్రార్థించినాడు.

ఒక సేవకుడు 'నేను ఎంత పాటుపడి పనిచేసినా ఈ యజమానికి తృప్తి అనేదే లేదు.' అని తన యజమానిపై విసుక్కొని, అడవికి పారిపోయినాడు. వాడుకూడ అక్కడ తపస్సుకు కూర్చున్నాడు.

'నన్ను కన్న తండ్రి నాకు శత్రు వైపోయినా' డంటూ, ఒకకొడుకు ఇల్లు విడిచిపెట్టి, అడవికి తపస్సు చేయ బోయినాడు.

మరొకడు తన తల్లిమీద కోపగించుకొని 'దైవమా! నా కొక మంచితల్లి కావలె' నని తపస్సు చేసినాడు.

వేరొకడు దేవునిపైననే కోపగించుకొని, అన్నింటినీ విసర్జించి అడవికి పోయి, ఏమి చేయవలెనో తెలియక, ఇతి కర్తవ్యతామూఢుడై కూర్చొని తపస్సుచేయనారంభించినాడు.

అక్కడికి ఒక వేటకాడు తన కుక్కతోసహా వచ్చి చేరినాడు. తపస్సు చేస్తున్న వారిని చూచి, ఆ వేటకుక్క ఫక్కున నవ్వింది.

'ఒరే అబ్బాయిలూ! ఏల మీకు బుద్ధి యిట్లు వక్రించి పోయింది? మీరుకూడ నావలెనే కుక్కగా పుట్టి యున్నట్లయితే, సంతోషంగా ఉండేవారే!' అని చెప్పింది.

'అది యెట్లాగు?' అని దేవునిపైన కోపగించుకొన్న భక్తు డడిగినాడు.

తక్కినవారు కూడ ఒకరివెంట ఒకరు వచ్చి 'అది ఎట్లు? అది ఎట్లు?' అని అడుగుతూ కుక్క చుట్టూ చుట్టు కొన్నారు.

'చూడండి, ఇదుగో నా యజమాని వేటకానిని! నాకు అతడే తండ్రి, అతడే తల్లి, అతడే స్నేహితుడు, అతడే రాజు, అతడే దేవుడు. నా కేమి కొఱత? మీరుకూడ ఒక్కొక్కరూ ఒక్కొక్క కుక్కగా పుట్టి, ఒక మానవుని దగ్గర పోయి చేరండి. సంతోషంగా ఉంటారు. భక్తిలో

కదా సుఖముంది! వివేకాన్ని నమ్ముకొని వట్టి అవివేకులై పోయినారు.' అని చెప్పింది కుక్క.

ఆ వేటకా డెవడో తెలుసునా? అతడు సాక్షాత్తు మహాదేవుడు. అల్పమృగాన్ని చూపి, తపస్సు చేసుకొంటున్న వారికి బుద్ధి నేర్పడానికై ఇట్లు వచ్చినాడు.

బాలలారా! మీరుకూడ ఇండ్లలో పెంచే కుక్కలను గమనించి చూడండి—నేను చెప్పింది మీకు బోధపడుతుంది. కుక్క మూగప్రాణి. అది మాట్లాడదు. కాని, దాని కండ్లను చూడండి. ఆ కండ్లను చూస్తే ఒక మంచి బిడ్డ—చాలా మంచి బిడ్డ—ఆ కుక్క దేహంలో మూగగా అణిగి ఉన్నట్లు పొడగడుతుంది.

కుక్క చాలా మంచి జంతువు. దానిని నమ్మవచ్చును: అవసర మేర్పడితే అది తన ప్రాణాన్నే ఇచ్చివేస్తుంది—మరుయోచన యేదీ లేకుండా ఇచ్చివేస్తుంది.

కుక్కను బాగా, ప్రేమగా పెంచవలెను. జాగ్రత్తగా చూచుకోవలెను. దానికి వ్యాధి వస్తే చూచి సహించడం కష్టం. అది ఏడవలేకుండా ఏడవలేకుండా ఏడుస్తుంది.

తెల్లజాతివారు తాము పెంచేకుక్కలను మిక్కిలి ప్రేమగా, బాగా చూచుకొంటారు. వారిని చూచి మనం నేర్చుకోవలెను. వారిలో కుక్కల కథలు ఎక్కువ. మన దేశంలో కుక్కల కథలు అంతగా లేవు. ఒక కథ ఉంది. ధర్మరాజు పాండవులలో జ్యేష్ఠుడు. కట్టకడపట అతడు తమ్ములతోసహా కొండ యెక్కి స్వర్గానికి పోతాడు. కొండ యెక్కే

టప్పుడు భార్యా, తమ్ములూ శక్తి క్షీణించిపోయి, నడవలేక ఒకరి వెంట ఒకరుగా పడిపోయి ప్రాణాలు వదలుతారు. అప్పుడు ఒక కుక్కమాత్రం ధర్మరాజును వెంబడిస్తూనే పోయింది. భార్య ద్రౌపదీ, తమ్ములూ దోవలోనే దేహాలు విడిచిపెట్టగా, వారి ఆత్మలుమాత్రం స్వర్గానికి పోయి చేరినవి. అయితే కుక్కమాత్రం ధర్మపుత్రునితోకూడనే చివరవరకూ వెళ్ళింది.

ఇంద్రుడు ధర్మపుత్రుణ్ణి స్వర్గానికి తీసుకొనిపోవడానికై రథంతో ఎదురువచ్చినాడు.

'కుక్కను విడిచిపెట్టి నేనుమాత్రం రథం ఎక్కనే ఎక్కను.' అని ధర్మపుత్రుడు పట్టుపట్టగా, ఇంద్రుడు ఆయన్ను అపారంగా మెచ్చుకొన్నాడు.

ఆ కుక్క సాక్షాత్తు ధర్మదేవతయే అనీ, తనను పరీక్ష చేయడానికే అట్లు వచ్చినదనీ ధర్మరాజు అప్పుడు స్పష్టంగా తెలుసుకొన్నాడు.

ఇది కుక్కను గురించిన కథగాదు; ధర్మపుత్రుని యొక్క గుణాతిశయాన్ని గురించిన కథ. అయినప్పటికీ పురాణంలో ధర్మాన్ని కుక్కగా చేసి చెప్పడం గమనించ దగిన విషయం.

ఆవు పాలిస్తుంది. కుక్క పాలకంటె మిన్నగా తన అమృతప్రాయమైన భక్తిని ప్రసాదిస్తుంది.



# 38. పిల్లి కథ

ఒకపిల్లి పొయ్యిగూటి పక్కగా పండుకొని నిద్రపోతూ ఉంది. రాత్రల్లా ఎలుకలకోసం మేలుకొని ఉన్నదేమో మరి, పగలు గాఢనిద్ర పోయింది.

దానిపక్కనే దాని మూడుకూనలూ పండుకొన్నవి.

పిల్లికి ఒక కల వచ్చింది. తాను ఒక పులి అయిపోవలెనని దానికి ఎప్పుడూ ఆశ. అందువల్ల అది ఆనాడు నిద్రలో తాను పులి అయిపోయినట్లుగానే కల గాంచింది.

పులి ఒక గొఱ్ఱెను తరుముకొని పరుగెత్తింది. గొఱ్ఱెల కాపరికుక్క పులిని తఱుముకొని వచ్చింది. పులి పరుగెత్తింది. కుక్క అంతకన్నా వేగంగా పరుగెత్తి పులికి చేరువగా వచ్చింది.

పులి అయిపోయినపిల్లి తన పాత స్వభావాన్ని బట్టి ఒక చెట్టుపైకి ఎక్కి తప్పించుకో జూచింది. కాని పులి అయిపోయిన పిల్లికి చెట్టు ఎక్కడానికి సాధ్యపడ లేదు. తటాలున మళ్ళీ కలలో పులి పిల్లి అయిపోయింది. చెట్టుపైకి ఎక్కి తప్పించుకొన్నది.

పిల్లి మేలుకొన్నది.

''మంచివేళ! నేను పులికాదు, పిల్లి నే! కొంచెముంటే ఆ కుక్క నన్ను కఱచి చంపివేసే ఉండును.'' అని సంతోషపడింది. ఆ సంతోషంలో లేచి పరుగెత్తిపోయి ఒక చెట్టుపైకి ఎక్కి ఒక ఉడుతను పట్టుకో జూచింది. కాని ఉడుత పిల్లికి చిక్కలేదు. అక్కడనుంచి కిందికిదిగి వంటయింటి

లోకి వెళ్లి, పాలో పెరుగో ఏదైనా తెరిచిపెట్టి ఉన్నారేమోనని చూచింది. ఏమీ దొరకలేదు. అన్నీ భద్రపరచి ఉండినారు. మళ్ళీ పండుకొని నిద్రపోయింది.

* * * *

ఈ సారి తాను కుక్క అయిపోయినట్లు కలగాంచింది.

ఒక దొంగ వచ్చినాడు. బొయ్యి బొయ్యి మని అరవడానికి బదులు మ్యావు మ్యావు మన్నది. ఎవ్వరూ లేవలేదు. దొంగ లోపలికి జొరబడి సామానులన్నీ తీసుకొన్నాడు. పాలపాత్ర తీసుకొని పాలన్నీ కింద గుమ్మరించి వేసి, పాత్రె యెత్తుకొని పారిపోయినాడు.

దొంగను మరచిపోయి, కింద ఒలకబోసి యుండిన పాలను పిల్లి గతక నారంభించింది. ఇంటి యజమానురాలు లేచి "ఈ కుక్క ఉపయోగం ఏ"దని చీపురుకట్ట తీసుకొని ఒక్క దెబ్బ వేసింది. దెబ్బ తిన్నట్లు కల గాంచగానే పిల్లి మేలుకొన్నది.

"మంచివేళ. నేను కుక్కను కాదు" అని సంతోషపడింది. పరుగెత్తిపోయి ఇంటి యజమానురాలి కాళ్లకు చుట్టుకొనీ, వెంటబడీ ప్రేమాభిమానాలు కనబరచింది. 'పులి కాను, కుక్కనూ కాను; నేను పిల్లిగానే ఉంటాను' అంటూ మ్యావు మ్యావు మని సంతోషంతో అరిచింది.

అది చెప్పింది ఇంటి యజమానురాలికి తెలియలేదు. పిల్లి మాటలు మనకు బోధపడవు. దానికూనలకు మాత్రమే బోధపడతాయి. 'నిజం నిజం' అని కూనలు మూడూ అరిచినవి.



# 39. 'పల్లాండు' పాడిన చెట్లు

వనదేవత ఒక పరిషత్తు సమావేశపరచింది. వృక్షాలు, చెట్లు, లతలు, మృగాలు, క్రిములు, కీటకాలు, పక్షులు మొదలైన యావత్తు స్థావరజంగమ ప్రాణిజాతుల ప్రతినిధులూ సమావేశానికి విచ్చేసినారు. సాధుజంతువులు మాత్రమే హాజరైనవి. పులి, ఎలుగు మొదలైనవి ఈ పరిషత్తుతో సంబంధం పెట్టుకోలేదు.

"మీ రందరూ సుఖమేనా?" అని అడిగింది వనదేవత.

చెట్లూ, చేమలూ, ప్రాణివర్గాలూ అన్నీ తమతమ పరిస్థితులను గురించి మాట్లాడినవి.

ప్రాణులూ చెట్లూ మనకుమాత్రమే మూగవి. అవి తమ సమావేశంలో బాగానే మాట్లాడుకొంటాయి. మన మాటలూ, వాదనలూ మఱు ప్రాణులకు అర్థంలేని సందడిగా తోస్తాయి. అట్లే చెట్టుచేమలు, క్రిమికీటకాలు, పశుపక్షులూ మాట్లాడుకొనేది మనకు బొత్తిగా బోధపడడం లేదు. అవి మాట్లాడే శబ్దం మనకు వినిపించదు. వినిపించినా బోధపడదు. మొత్తంమీదచూస్తే అవికాదు మూగవి; మనమే చెవిటివారం.

"కీటకాలకు జయ్" అన్నవి పూలు. (కీటకాలు వర్ధిల్లాలి)

'వర్ధిల్లాలి' 'నశించాలి' (జిందాబాద్, ముర్దాబాద్) అనే ఘోషలు మానవ రాజకీయరంగ ఘోషలుగా

ఉపయోగింపబడుతూ వస్తున్నవి. ఈ జయఘోషలూ, శాపనార్థాలూ స్థావరాల్లోకూడ ఉన్నవి.

"రండి రండి. వచ్చి, మా తేనె తాగండి. పువ్వు నుంచి పువ్వుకు ఎగిరి వెళ్లండి. మా కేలాటి చెరుపూ, చేటూ లేకుండా మా వంశాన్ని వృద్ధిపరచండి. ప్రేమానందాన్ని మా కిచ్చే ఓ కీటకాల్లారా! ఓ ఈగల్లారా! మీకు 'పల్లాండు' ('మీకు నూరేండ్లు' వంటి దీర్ఘాయుస్సు దీవనలు) పలుకుతాం" అన్నవి.

బాలలారా! దీని వివరాన్ని వృక్షశాస్త్ర ఉపాధ్యాయుణ్ణి అడిగి తెలుసుకోండి. కీటకాలు పుష్పాలకు ఏవిధంగా తోడ్పడుతున్నవో ఆయన మీకు చెప్పతాడు.

"పక్షుల్లారా! మీకు నూరేండ్లు! కోతుల్లారా! మీకు నూరేండ్లు!" అని ఘోషించినవి అడవివృక్షాలు.

"మా పండ్లను ఏరి తిని, విత్తనాలను తీసుకొనిపోయి నలుదిక్కులా వేయండి. మా పండ్లను తిని, విత్తనాలను మీ కడుపుల్లో కాపాడియుంచి, మంచినేలలో వెలువరిచి వేయండి. వాన కురిసి ఎండ బాగా కాచే చోటుచూచి వేయండి. మేముండేచోట వాటికి వెలుగూ, ఎండా తగినంతగా లేవు. మాపిల్లలు తమంతటతాము నడచి ప్రవాసం వెళ్లలేవు. వాటికి కాళ్ళు లేవు, రెక్కలు లేవు. మీ కడుపు చల్లగా మీరు మా వంశాన్ని కడుపులో పెట్టుకొని కాపాడి భూమిమీద వ్యాపింపజేయండి." అన్నవి.

"ఓ నడిచే ప్రాణులారా! (చతుష్పాత్తులారా!) మా కులానికి యమధర్మరాజులు మానవులూ, మేకలూనూ.

బాగా చిగిరించి ఏపుగా, గోముగా ఆకులు వేసేలోపలనే మేకలు వచ్చి మమ్ము తినివేస్తున్నాయే! మా ఆకులు తిని కొవ్వి బలిసిన మేకలను తృప్తిగా తినడానికై మానవులు మేకలను మా మీదికి వదిలిపెడుతుంటారు. ఇందుకేమి చేద్దుము!" అని చెట్లు మొరపెట్టుకొన్నవి.

"పండ్లలోని మురికీ, పాచీ పోగొట్టుకోవడానికై పందుంపుల్లల కని మానవులు మా లేతలేతకొమ్మలను విరిచి నాశనం చేస్తారే! వీరికి జాలి అనేదే లేదే!" అని పరితపించినవి వృక్షాలు.

"వంటచెఱకు కని మమ్ములను కొట్టికొట్టి కూలుస్తారే! దివ్యమైన దంతాలకోరకుగూడ మానవులు ఏనుగులను చంపడం లేదు. కాని మేము చావడానికి ముందే మా ఎముకలకోసమై మమ్ములను చంపివేస్తారే కట్టెలు కొట్టేవాళ్ళు!"

ఈ విధంగా వృక్షాలూ, చెట్లూ వ్యథపడిఏడ్చినవి.

"మా మాంసం తిని, ఈ రెండుకాళ్ళ పశువులు తమ కండరాలు పెంచుకొని పెరుగుతున్నారే! భగవంతుడు మా మాంసంలో విషమైనా పెట్టలేదే! పెట్టియున్నట్లయితే మేము బ్రతికిపోయి ఉండేవారమే!" అన్నవి పశువులు.

ప్రపంచంలో మూగజీవులు మాట్లాడే మాటలూ, ఏడ్చే ఏడ్పులూ గాలిలో అలలు అలలుగా వెళ్ళి ఆకాశాన్ని తాకుతున్నవి.

అంతా పరమేశ్వరుని విలాసం! మనం ఆ లీలా విలాసాన్ని గ్రహించేటట్లు ఆయన అనుగ్రహించుగాక.

చెట్లు పడగొట్టేవారు చివరకు చెట్లుగానే పుట్టి, అట్లాగే ఛేదింపబడి పట్టల నుంచి పాలుగారుతూనే చస్తారో ఏమో? ఆ భగవంతునికే తెలియవలె!

చెట్లనూ ప్రాణులనూ ఛేదింపగూడదు.

వనదేవత చెప్పింది. "బాగా పెరిగి పెంపొందుదురు గాక! ఒక్కొక్క చెట్టుకూ లక్షపూలుపూచి, వెయ్యి కాయలుకాచి వంశాన్ని వృద్ధిచేసుకొందురు గాక! ఎవరు ఎంత నాశనం చేసినా మీరు నశించిపోరు. వర్ధిల్లుతారు." అని దీవించి వనదేవత సభను చాలించింది.



# 40. 'బుద్ధి వచ్చింది'

భరద్వాజవంశంలో జనించిన ఒకాయన బాల్యంలోనే తపస్సుచేస్తూ ఉండినాడు. ఆయనకు ఒక ఆశ. వెనుకటిరోజుల్లో ఋషులు వ్రాసిపెట్టిన ఉపనిషత్తులవలెనే తాను కూడ ఒక మంచి ఉపనిషత్తు కొత్తగా వ్రాయవలెనని. ఈ విధంగా ఆశపడి, ఇందు కేమిచేయవలెనో తోచక, ఆయన చతుర్ముఖబ్రహ్మను ధ్యానించి తపస్సు చేసినాడు.

బ్రహ్మ ప్రత్యక్షమై "వత్సా! ఏమి కావలె?" నని అడిగినాడు.

"నే నొక మంచి క్రొత్త ఉపనిషత్తు వ్రాయవలెను. అందు కేమి చేయవలెనో సెల విమ్మండి," అని కోరినాడు భారద్వాజ బాలర్షి.

"ప్రాచీన ఉపనిషత్తుల నన్నిటినీ బాగా చదువు" అన్నాడు బ్రహ్మ.

"ప్రాచీన ఉపనిషత్తులను గనుక నేను చదివినట్టయితే క్రొత్తవిషయ మొకటీ మరినాకు తోచదు. ప్రాచీన ఉపనిషత్తులలో చెప్పిందే నా మనస్సుకు గట్టిగా అంటిపోతుంది. వేరే నూతనభావాలకు చోటే లేకుండా పోతుంది. వ్రాయడానికి నేను తీరా కూర్చున్నప్పుడు ప్రాచీనఋషులు చెప్పిందే నేనూ వ్రాయడం పడుతుంది. అందులో క్రొత్తదేమీ ఉండదు. నా ఆశ నెరవేరకుండానే ఉండిపోతుంది." అని చెప్పినాడు బాలర్షి.

"నీవు చెప్పింది నిజమే. ఉపనిషత్తులు చదవవద్దు. కొంతకాలం సంసారజీవితం నడిపి ముగించు. అట్లు చేస్తే క్రొత్త క్రొత్త విషయాలు తెలిసివస్తాయి." అన్నాడు బ్రహ్మ.

"నే నొక ఋషిని. నేను సంసారజీవితంలోకి ఎట్లు దిగను! సంసారజీవితానికి దిగితే ఇక అదే నా హృదయాన్నంతా ఆకట్టుకొని కూర్చుంటుంది. జ్ఞానపూర్ణ మైన నూతన ఉపనిషత్తు వ్రాయడానికి తోచనే తోచదు. నేను ముఖ్యంగా కోరేది అదికదా!" అన్నాడు బాలర్షి.

బ్రహ్మ నాలుగుమొగాలూ వికసించగా ఒక్క చిరునవ్వు నవ్వినాడు.

"నాయనా! మరి నీవు ఉపనిషత్తు వ్రాయలేవు. ఎట్టి ఆశపెట్టుకొని అఘోరించవద్దు." అన్నాడు.

బాలర్షికి సమాధానం ఏర్పడలేదు. బ్రహ్మ అంతర్ధానమయిపోయినాడు.

ఒక వేటకాడు వచ్చి "అయ్యా! మిక్కిలి దప్పిగా ఉంది. అలసిసొలసిపోయిఉన్నాను. దయయుంచి తాగడానికి ఇన్ని నీళ్లు ఇప్పిస్తారా?" అని ఆ ఋషిని అడిగినాడు.

బాలర్షి లోపలకు వెళ్ళి తన కమండలువులో చూచినాడు. అందులో నీళ్లు లేవు! "కొంచెం కూర్చో. కోనేటికి వెళ్ళి నీళ్లు తీసుకొనివస్తాను." అన్నాడు.

"కోనేటినీళ్లు నాకు వద్దు. అవి నా దాహం తీర్చలేవు." అన్నాడు వేటకాడు.

"అట్లయితే కొంచెముండు. అదిగో అల్లక్కడ నది ఉంది. అక్కడికి వెళ్లి పారేనీళ్లు ముంచుకొనివస్తాను. నీ విక్కడనే కూర్చునిఉండు." అన్నాడు ఋషి.

"వీలులేదు. నేను కాచుకొని కూర్చొనియుండడానికి వీలులేదు. మీరు నదికి వెళ్లితే మళ్లీ తిరిగిరారు. అక్కడ పులీ, తోడేలూ ప్రజలను చంపడానికి కాచుకు కూర్చొనియున్నవి." అన్నాడు వేటకాడు.

వేటకానిమాటలు ఋషికి ఏమీ బోధపడలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు. వేటకాడు మాయమయిపోయినాడు.

"ఓహో! వీడు వేటకాడు కాడు. నలుమొగాల వేలుపే నాకు జ్ఞానబోధచేయడానికై ఈ నాటకమాడి

నట్లున్నది. నేను ప్రాచీనఉపనిషత్తులను చదవనని చెప్పినట్లుగా ఈ వేట కాదు 'కోనేటినీళ్లు' వద్దన్నాడు. సంసారజీవితంకూడా వద్దన్నాను. పారే ఏరువంటిదిగదా సంసారజీవితం! నిలవరంలేని వస్తువులు పుట్టి మరుగై, మళ్లీ పుట్టి, మళ్ళీ మరుగవుతూ ఏటినీటివలె ఐహికజీవితం ప్రవహిస్తూ ఉంటుంది. అందులో మునకొని జ్ఞానజలాన్ని పడయడంకూడ పడదంటిని గదా నేను? నా కమండలువులో నీళ్ళు లేవు. నీళ్లు కావలసి ఉంటే మరి కోనేటికో, ఏటికో పోయి తెచ్చుకోవలసిందే. బుద్ధి వచ్చింది.'' అని తనలోతానే అనుకొన్నాడు బాలర్షి.

'సంతోషం' అన్నాడు చతుర్ముఖబ్రహ్మ - బాలర్షికి మళ్ళీ దర్శనమిచ్చి.



# 41. ఆ యు ధ పూ జ

పాండ్యదేశంలో ఒక మంచి రాజు.

నవరాత్రి వచ్చింది. ఆయుధపూజ మహోత్సాహంగా జరిపినాడు. విండ్లు, అమ్ములు, కత్తులు, శూలాలు, నాగళ్లు, పారలు, సుత్తులు, ఉలులు, కొడవళ్లు, అంపాలు, గొడ్డళ్లు, రాట్నాలు, మగ్గాలు మొదలైన అన్ని పనిముట్లూ, అన్ని ఆయుధాలూ ఎవరెవరి వృత్తికి సంబంధించినవి వారు వారు తీసుకొని వచ్చి పెట్టినారు.

రాజు పెద్ద పూజ చేయడానికి ఏర్పాట్లు చేసినాడు. పూజకు బ్రాహ్మణులు తమ తాటాకు పుస్తకాలను గూడ

తెచ్చి పెట్టినారు. చెప్పులు కుట్టేవారుకూడ తమపరికరాలను తెచ్చి పెట్టినారు.

రాజగృహంలో ఒకమూల ఒక చీపురుకట్ట విచార వదనంతో గోడకు చేరబడి ఉన్నది.

'ఏమిటి, ఏదోమాదిరిగా ఉన్నావు! నవరాత్రి పూజకు నగరంతా శుభ్రంచేసి అలసిపోయినావా? ఏమి ?' అని అడిగింది రాజకుమారి. ఆమె చాలా మంచిఅమ్మాయి.

'లేదు తల్లీ, లేదు. పనిపాటలు చేయడంలో నాకు అలపూ లేదు, సొలపూ లేదు. కష్టం అంతకన్నా లేదు. పూజకు అన్ని ఆయుధాలూ, పనిముట్లూ పెట్టినారు. నన్ను మాత్రం మరచిపోయినారే! ఇదే నాకు పట్టుకొన్న దుఃఖం.' అని దీనంగా చెప్పుకొన్నది చీపురు.

'అయ్యో! పాపం!' అని రాజకుమారి దానిపట్ల జాలిపడి సరాసరి పూజాస్థలానికి వెళ్లింది.

'చీపురూ, చేటా ఎందుకు తెచ్చిపెట్టలేదు ఇక్కడ పూజకు? వాటినికూడ వెంటనే తెచ్చిపెట్టండి' అని సేవకులతో చెప్పింది.

వారు రాజుదగ్గరకు వెళ్లి దీనిని గురించి అడిగినారు.

'వృత్తులలో ఎక్కువ తక్కువలు లేవన్నది శాస్త్రం కదా! గురువులవారిని అడుగుదాము. వారిని పిలుచుకొని రండి.' అన్నాడు రాజు.

గురువులు వచ్చినారు. ఆయన మొదట కొంచెం తటపటాయించినారు. అటూ ఇటూ చెప్పినారు.

'పుస్తకం చూచి చెప్పండి' అన్నాడు రాజు.

గురువులుకూడ పేజీలు తిరగవేసి తిరగవేసి చూచి నారు.

చివరకు 'రాజకుమారి చెప్పింది వాస్తవమే. ప్రజలకు ఉపయోగపడే ఏవృత్తియైనా, దానికి ఉపయోగపడే ఏ పనిముట్టయినా పూజకు తగిందే.' అన్నారు.

చేటకూ, చీపురుకూ కూడ పూజ జరుగవలెనని ఉత్తరు వయింది. రాజాజ్ఞ మేరకు మంత్రీ, అధికారీ వెళ్లి వాటినికూడ తెచ్చి ఆయుధపూజలో పెట్టినారు.

దేవి సంతోషించింది. నాడు మొదలు చాలాకాలం పాండ్యదేశంలో ఏమూలనూ దుమ్మూ, ధూళీ, చెత్తా లేకుండా శుభ్రంగా ఉన్నది.



# 42. ఎలుకముక్తి

చెన్నపట్టణంలో ఒక నాస్తికుడూ, ఒక భక్తుడూ పక్క పక్కననే నివసిస్తున్నారు. ఇద్దరికీ రానురాను స్నేహమధిక మయింది. నాస్తికుడు మంచి కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. మాట్లాడేది నాస్తిక మయినా నడవడిలో యోగ్యుడు. ప్రతి దినమూ ఇద్దరూ తెగ వాదనలు చేస్తారు. చివరకు ఇద్దరూ కూర్చొని కాఫీ ఫలహారాలు పుచ్చుకొని లేచిపోతూ ఉంటారు.

నా_స్తికుడు 'దేవుడు లేడు, లేడు' అంటూనే ప్రతి దినమూ దేవుని ధ్యానంచేస్తూ వచ్చినాడు. భ_క్తుడు 'ఉన్నాడు' అని నిరూపించడానికై ఎదురుకక్షి యెత్తిన పూర్వపక్షాన్ని ఉదాహరించి ఉదాహరించి, తన భ_క్తిలో సగభాగాన్ని సమయించుకొన్నాడు. అకస్మాత్తుగా ఉభయులకూ టైఫాయిడు జ్వరం వచ్చి ఉభయులూ చనిపోయినారు.

యముడు స్వాగతో_క్తులతో నా_స్తికుని ఆహ్వానించినాడు. 'వత్సా! నీవు నీకు తెలియకుండానే సద్గతి సంపాదించినావు. నీకోసం కాచియున్నారు. చూడు అక్కడ.' అని చూపుమేర దూరంలో నిలుచున్న విష్ణుకింకరులను చూపి, 'వెళ్ళు వారితో' అన్నాడు.

'వద్దు, దేవుడు లేడు.' అన్నాడు నా_స్తికుడు అక్కడ కూడా.

విష్ణుకింకరులు వినలేదు. వానిని బలాత్కారముగా పట్టి యీడ్చుకొని పోయినారు. వాడుకూడ ఏడ్చుకొంటూ ఏడ్చుకొంటూనే విష్ణులోకానికి వెళ్ళినాడు.

* * * * *

'నాయనా!' అని యముడు భ_క్తుని చూచి జాలి పడుతూ మాట్లాడ నారంభించినాడు.

భ_క్తుడు మళ్ళీ వాదనచేయ మొదలుపెట్టినాడు. నీ వాదనలవల్ల ఇప్పుడు లాభం లేదు. నీవు నీ జీవిత దినాలను వాద ప్రతివాదాలతో వృథా గడపినావు. మళ్ళీ తిరిగిపో.

కొన్నాళ్ళపాటు శ్రీరంగం కోవెలలో ఒక పెరెలుకగా ఉండి, అక్కడ వేసే ఎంగిలి, చెత్త తిని, భయంతో జీవితం నడపి తర్వాత రా!' అని యముడు భక్తుని వీపు తట్టి బుజ్జగించి పంపినాడు.

'తల్లీ! పెరుందేవీ! నన్నిట్లు చేయవచ్చునా?' అని భక్తుడు ఏడ్చుకొంటూనే శ్రీరంగానికి వచ్చి చేరినాడు. 'చేరింది' అనవలెను. ఏమంటే భక్తుడు ఇప్పుడు ఎలుక అయిపోయినాడు.

ఆ యెలుక తాయారుసన్నిధిలోనే తన జీవితం గడిపింది. ఎలుకకు ఆయుస్సు చాలా తక్కువ. మనిషికిమాత్రమే నూరేండ్లు. ఎలుకలు అతిత్వరగా ముసలివయిపోయి మరణిస్తాయి. ముసలితనానికి ముందేకూడ పిల్లులో పెద్దఎలుకలో వాటిని పట్టుకొని తినివేస్తూ ఉంటాయి. మన భక్తుడు ఆరు నెలల లోపలనే అమ్మవారి పాదాలు చేరుకొన్నాడు.

'రా, నాయనా, రా! నీ కోసమే కాచుకొని యుండినాను.' అని పెరుందేవి ఎలుకను ఆదరంగా చేరదీసి హత్తుకొని తీసుకుపోయింది.



# 43. సోమరిపోతు సూర్యుడు

"అమ్మయ్య ! చాలునురా నాయనా ఈవృత్తి !" అన్నది ఈగ.

"నీకు అంతకష్టం ఏమి ఏర్పడింది ?" అన్నది మంద మైదానంలో నేలను గీరుకొంటూ ఉండిన ఒకకోడి.

"హార్బరునుంచి మైలాపూరువరకూ మూటలబండిని లాగుకొనివస్తే తెలుస్తుంది నీకు !" అన్నది ఈగ.

"ఏమి మూటలు ? ఏమిబండి యీడ్చినావు నీవు ? నాకేమీ బోధపడడంలేదు." అన్నది కోడి.

"నీకెట్లు తెలుస్తుంది ? మంటిని కెలుకుకొంటూ పురుగుపుట్రలనూ, చిందిన బియ్యాన్నీ తినే జీవివి నీవు. నీకేమి తెలుస్తుంది ? నేను ఈ దినం ఒక మనిషివీపుమీద కూర్చొని వానితోపాటు బండిని తోసుకొంటూ తోసుకొంటూ దాని నిక్కడికి తెచ్చి చేరిస్తిని. ఆ అలసటను నీకు చెప్పి ఏమిప్రయోజనం ?" అన్నది ఈగ.

"నీకు అంతబలం ఎట్లువచ్చింది ? బండి చాలా బరువుగా ఉంటుందే !" అన్నది కోడి.

"బలంఅంతా మనసులోనూ ఉత్సాహంలోనూ ఉంటుంది. దారిలో ఎన్నో ఫలహారపు దుకాణాలు, అరటి పండ్లు బాగాపండి కుళ్ళుటకు సిద్ధమై గుత్తులుగుత్తులుగా వేలాడుతున్న దుకాణాలు ఎన్నో. వాటిదగ్గరనే నిలిచి పోదామా అనికూడా యోచిస్తిని. ఒక్కొక్కచోటా ఇదే

ధంగా ఆశఏర్పడేది. అయినా, అయ్యోపాపం! ఈ మనుష్యులు నేనులేకుండా బండి ఎట్లా ఈడుస్తారని జాలిపడి, భోజనపు కొట్లలోకూడ నేను నిలువలేను.'' అన్నది ఈగ.

''నీ జీవకారుణ్యమే జీవకారుణ్యం! నాకుకూడ ఆశ ఉంది. మంచిదానినిగా ఉందామని చూస్తాను. కాని సాధ్యంకావడం లేదు.'' అన్నది కోడి. ''ఈ పురుగుల రుచిని నేను జయించలేక పోతున్నాను.'' అన్నది.

''మంచివారికి ఇదికాలంకాదు. ఏవేవో మందులు వేసి వేసి మమ్ములను చంపుతారు. మే మేమిచేసినాము? ఈ మనుష్యులు ఈ విధంగా కోపావేశంతో మాపైన యుద్ధం సాగిస్తున్నారే!'' అన్నది ఈగ.

''ఏవో వ్యాధిక్రిములను చూచి భయపడి ఈవిధంగా చేస్తున్నారు. ఆక్రిములు మీకాళ్లకూ, మీ తొండాలకూ అంటుకొని వీరి దేహంలోనికీ, రక్తంలోనికీ ఎక్కుతున్నా యని ఇట్లు చేస్తున్నారు.'' అన్నది కోడి.

''దానికేమి చేసేది? మేము గుంటల్లో బాగా ఒళ్లు తోముకొని స్నానంచేసి వచ్చి తర్వాత ఈ పిరికిపందల మీదవచ్చి కూర్చోవలెనంటే సాధ్యమయ్యే పనేనా? స్నానంచేస్తే మేము చచ్చిపోతామే!'' అన్నది ఈగ.

''నిజం, నిజం'' అన్నది కోడి మిక్కిలి దుఃఖంతో.

ఈగ ఇంకా చెప్పుకొంటూ పోయింది. ''చెత్త తొట్లను కూడ మూసిపెట్ట నారంభించినారు. అయితే కొంత మంది పుణ్యవతులు మూతలుతీసి చెత్తపడవేసి మళ్ళీ

మూతలు పెట్టకుండానే వెళ్ళిపోతున్నారు. మాపైన ఈ తల్లుల కయినా కొంచెం కరుణ ఉంది!"

కోడికి నిద్రవస్తున్నది. "సరి. నేను నిద్రపోవలెను. లేకపోతే తెల్లవారుజామునకు సరిగా లేచి సూర్యుణ్ణి లేపడానికి వీలుండదు. ఆ సోమరిపోతుసూర్యుడు నేను అరిచి పిలిచి లేపకపోతే అట్లాగే నిద్రపోతూనే ఉంటాడు. సకాలానికి నిద్రలేవడు." అని చెప్పింది కోడి.

అప్పుడు చంద్రుడు తూర్పున మెల్లగా బయలుదేరినాడు. కోడీ, ఈగా మాట్లాడుకొంటున్నది విని నవ్వుకొన్నాడు.

"నాకోసం ఏ కోడీ పిలవడంలేదు. నేనే లేచినాను." అని తమాషాగా అనుకొన్నాడు చంద్రుడు.

ఆ రోజున అతనికి గ్రహణం పట్టబోతున్న సంగతి అతనికి తెలియలేదు.



# 44. నెయ్యిస్వాములవారు

నారాయణశెట్టి చుట్టుపట్ల గ్రామాలకు వెళ్ళి అక్కడక్కడ మంచి నెయ్యి చౌకధరకు కొని, అంతాచేర్చి పట్నానికి పంపి మంచిధరకు అమ్ముతూ ఉంటాడు. ఈ విధంగా అతడు కొంచెంకొంచెంగా డబ్బు చేర్చినాడు.

డబ్బు చేరిన కొల్ల 'ఇంకా కావలెను, ఇంకా కావలెను' అన్న యావ అధికమయిపోయింది. నెయ్యికి కొంచెం

వేరుసెనగనూనెకూడ కలిపి అమ్మడం ప్రారంభించినాడు. మంచి లాభం వచ్చింది.

అతని దగ్గర నెయ్యి కొనేవారు 'ఏమిటి, ఇప్పుడిప్పుడు మీ నెయ్యి ముందుమాదిరిగా ఉండడంలేదు?' అని అడుగజొచ్చినారు. 'నే నేమి చేయుదును బాబూ! పాడిపశువులకు ఇప్పుడు గ్రామాల్లో మంచిమేత పెట్టడమే లేదు. ఆవుపాలే అధ్వాన్నమై పోయినాయి.' అని నారాయణశెట్టి నయంగా వారిని పంపివేస్తాడు.

అందరు వర్తకులూ నారాయణశెట్టితో పోటీ పెట్టుకొని నెయ్యిలో నూనె కలిపి అమ్మడం ప్రారంభించినారు.

'ఊరు ఈవిధంగా పాడయిపోయిందే!' అని దక్షిణాది నుంచి వచ్చిన ఒక స్వాములవారు అందరికీ వేదాంతోపన్యాసం చేస్తూ వచ్చినారు.

నారాయణశెట్టి 'దేవుడు లేడు' అన్నాడు.

దేవు డున్నట్టయితే నెయ్యిలో నూనె కలిపి అమ్మేవాడు తప్పకుండా దండన పొందేవాడు. అందువల్ల నారాయణశెట్టికి ఈ అభిప్రాయం ఏర్పడింది. దేవుడు లేడని తానూ నమ్మినాడు; ఇతరులకూ ఉపదేశించినాడు.

'నాయనా! పైన చూడు. చుట్టూ చూడు. ప్రపంచాన్ని చూడు. దేవుడు లేడని ఎందుకంటావు?' అని అతనికి బోలెడన్ని పుస్తకాలు ఇచ్చి చదువుకొమ్మన్నారు స్వాములవారు.

అట్లాగే అతడు వాటిని చదివినాడు. పుస్తకాలు చదివితే జ్ఞానం వస్తుందా? లోపల ధనాశ పనిచేస్తున్నప్పుడు

ఎంత చదివినా ప్రయోజనం లేదు. దేవుడు లేడనే అతని గట్టినమ్మకం. అది మారలేదు.

ఒకనాడు నారాయణశెట్టి యింట్లో దొంగలుపడి, అతడు చేర్చిపెట్టియుండిన డబ్బంతా తుడిచిపెట్టినట్లు దోచుకొని పోయినారు. నారాయణశెట్టి ఎవరినీ నమ్మలేదు. నమ్మి ఏ బ్యాంకులోనూ పెట్టలేదు. అందరూ మోసం చేస్తారని అతని భయం. తనవలెనే అందరూ ఉంటారని అతడనుకొన్నాడు. అందువల్ల తాను సంపాదించిందంతా రొక్కంగా ఇంట్లో పెట్టుకొని యుండినాడు. దొంగలు అంతా ఊడ్చుకొని పోయినారు.

అలోమని ఏడ్చినాడు. మళ్ళీ వ్యాపారం చేయడానికి ప్రయత్నించినాడు.

అయితే, ఎవరూ అతనిని నమ్మి పెట్టుబడికి డబ్బు ఇవ్వలేదు. అతడు సొంతవ్యాపారం చేయడం సంగతి వదలుకొని, ఒక యజమానిదగ్గర గుమాస్తాగాచేరి బతకజొచ్చినాడు. అందుమీదట అతనికి దైవవిశ్వాసంకూడ ఏర్పడింది. స్వాములవారు ఇచ్చిన పుస్తకాల నన్నిటినీ మళ్ళీ తీసుకొని చదివినాడు. అందులో పరమార్థం కనుగొన్నాడు. ఇతరులకుగూడ చెప్ప నారంభించినాడు. తాను పోగొట్టుకొన్న డబ్బును పూర్తిగా మరచిపోయినాడు. ప్రతి దినమూ గుడికివెళ్ళి దేవుని సేవించుకొని రా జొచ్చినాడు.

అతని యజమానికూడ అతనివద్ద తత్త్వవిచారం విన నారంభించినాడు. అందరికీ అతనియందు ప్రీతి. అందరూ అతనిని నెయ్యిస్వాములవారని పిలుస్తారు.

'మీ యింట్లో దొంగలు పడినారే! దేవుడు మిమ్ముల నెందుకు కాపాడలేదు?' అని కొందరడిగేవారు. కోపగించుకోకుండా జవాబు చెప్పేవాడు.

'నన్ను సంస్కరించి చక్కదిద్దడానికే దొంగలు వచ్చినారు. భగవల్లీలలు గ్రహించడం ఎవరి తరం? దొంగలు ఎత్తుకొనిపోయింది నా డబ్బునుకాదు; నా చిత్త మాలిన్యాన్ని ఎత్తుకొనిపోయినారు వారు.' అనేవాడు.



# 45. పువ్వు, కీటకం, పురుగు

'గమగమలాడే ఓ పువ్వా! నీ తేనెను తాగి మేము సుఖంగా జీవిస్తున్నాం. నాలుక లూరించే ఈ తీపితేనె సేకరించడం నీ వెట్లు నేర్చుకొన్నావు?' అని అడిగింది తేనెటీగ.

'మీరు మా తేనెను త్రాగడం వల్ల మాకు మితి లేని సంతోషం.' అని చెప్పింది పూల చెట్టు.

'మీ తేనెను మేము త్రాగుతాము. అందువల్ల మీకు వచ్చిన లాభ మేమిటి?' అన్నది తేనెటీగ.

'మీకు తెలియకుండానే మీరు మాకు సాయపడు తున్నారు.' అన్నది పూల మొక్క.

'ఆ రహస్య మేదో కాస్త విడమర్చి చెప్పవూ!' అని అడిగింది తేనెటీగ.

'చెప్పితే తేనె తాగకుండా పోతారు. తర్వాత మేము కష్టపడిపోతాము.' అన్నది మొక్క.

'చెప్పుతావా, చెప్పవా?' అని బతిమాలింది తేనెటీగ.

'సరే. చెప్పుతాను, విను. నీవు మళ్ళీ ఎవరికీ చెప్ప కూడదు. రహస్యంగా పెట్టుకొని యుండవలెను.' అన్నది మొక్క.

'అట్లే కాని' మ్మన్నది తేనెటీగ.

'పువ్వుకూ పువ్వుకూ మీరు పెండ్లి చేయిస్తారు. అందువల్ల పూవులు కాయలై, పండి, విత్తనాలు ముదిరి మేము సంతానం కంటాము. మీకు తెలియకుండానే మీ మూలంగా మేము వృద్ధిపొందుతాము.' అన్నది పూల మొక్క.

తేనెటీగ చాలా సంతోషించింది. 'పొద్దయింది. నే నింటికి పోయి చేరుకోవలెను. మళ్లీ ఆలస్యమయితే అమ్మ కోపగించుకొంటుంది.' అని చెప్పింది తేనెటీగ.

'దారి తెలుసునా? ఎక్కడెక్కడో పోయి పువ్వు నుంచి పువ్వుకు అంగలు వేసుకొంటూ వస్తున్నావు మరి!' అన్నది మొక్క.

'దారియా? దారియంటే ఏమిటి? ఇక్కడనుంచి నేను బయలుదేరినానంటే సరి, 'విర్' అని ఈడ్చుకొంటుంది మా తల్లి. నేరుగా ఇంటికి పోయి చేరుకొంటాను' అన్నది తేనెటీగ.

చెట్టు ఆశ్చర్యపడిపోయింది. 'నాకుగూడ రెక్కలుంటే ఎంత బాగుండును?' అనుకొన్నది.

'ఓసి వెర్రిదానా!' అన్నది చెట్టుమీద ఉండిన పిచ్చుక. 'రెక్కలు పెట్టుకొని నీవు అక్కడికీ ఇక్కడికీ ఎగురుతూ ఉంటే నే నెక్కడ కూర్చునేది?'

'సరేకాని, ఓ పిచ్చుకా! ఒక పురుగు నన్ను బలే తొందర చేస్తున్నది. అది పెట్టే బాధ నేను సహించలేకుండా ఉన్నాను. నీవు దాన్ని పొడుచుకొని తీసుకుపో నీ పిల్లలకు. మంచిదానివి కదూ!' అంటూ చెప్పుకొన్నది చెట్టు.

అట్లే చేసింది పిచ్చుక.

ఇంతలో తోటమాలి వచ్చి చెట్టుకు నీళ్ళుపోసినాడు.

'వీడు ఉండడంబట్టి కదా నేను దప్పితో చచ్చిపోకుండా బతుకుకొనివస్తున్నాను!' అని చెప్పుకొన్నది చెట్టు. అయితే ఆ తోటమాలికి చెట్టుభాష తెలియదు. వాడు తనపాటికి తాను చెట్లకు నీళ్ళు పోసుకొంటూనే పోయినాడు.

'పాపం! వీడి బతుకు బహు కష్టభరిత మయింది.' అని జాలిపడుతూ అన్నది చెట్టు.

ఇంతలో తోటమాలి చిన్న కుమారుడు పరుగెత్తుకొనివచ్చి 'నాయనా! నాయనా! నేను పోస్తాను నాయనా! చెట్లకు నీళ్లు.' అంటూ తండ్రిచేత నున్న నీళ్ళ కడవ తీసుకో బోయినాడు.

'నీవు మోయలేవురా నాతండ్రీ!' అని తండ్రి అనే సరికి తనయుడు ఏడుపు మొదలుపెట్టినాడు.

తోటమాలి ఒక చిన్న చెంబు తెచ్చి దానినిండా నీళ్ళు నింపి యిచ్చినాడు కొడుకుకు. అది తీసుకొని ఆ కుఱ్ఱ వాడుకూడ చెట్లకు నీళ్ళు పోస్తూపోయినాడు. చెట్లకు ఇది ఎంతో సంతోషం కలిగించింది. చిన్నారిచేతులనుండి జారి పడే జలాన్నే చెట్లకు అతి ప్రియం.



# 46. మార్జాలం

అగస్త్యుడొకనాడు పిల్లిని దగ్గరకు పిలిచి దానికి ఉపదేశం చేసినాడు.

'ఓ పిల్లీ! నీ జీవితం మహా పాపిజీవితం. పులి నీకు మామ. అది అడవిలో నివసిస్తుంది. దానికి వేరే మార్గం లేదు. కాయగూరలు తిని జీవింపలేదు. ఆకలి వేసినప్పుడు కనబడిన మృగాన్ని చంపి తింటూ జీవిస్తుంది. నీవు మనుష్యుల మధ్యలో ఉండి జీవిస్తున్నావు. పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి పెట్టుకొనియుండే మనుష్యుల మధ్య జీవనం గడుపుతున్నావు. నీవు ప్రాణులను చంపి తినవలసిన అవసరమే లేదు. ఇక మీాద నీవు పక్షులనూ, ఎలుకలనూ చంపవద్దు.' అని చెప్పినాడు.

పిల్లి ఒప్పుకొన్నది. 'ఇంతవరకూ నేను జీవించిన పద్ధతి సరిఅయినది కాదు. ఇక పైన నేనూ, నా జాతీ జీవ కారుణ్యమార్గంలో జీవిస్తాము.' అని తీర్మానించుకొన్నది.

పిల్లులు ఎలుకలను పట్టితినడం మానివేసినవి. పాలు, వెన్న, పెరుగు, మజ్జిగలు దొంగిలించియే జీవనం సాగిస్తూ వచ్చినవి.

ఊరిలో అందరూ పిల్లులమీద మిక్కిలి కోపగించు కొన్నారు. ఎక్కడ ఏ నేతి తినుబండం కనిపించినా పిల్లి దానిని తిననారంభించింది. పాలకుండా, నెయ్యి గిన్నె, కొంచెం అజాగ్రతగా ఉంటేసరి, మరి పోయినట్లే! పిల్లి నిమిషంలో కాజేసివేస్తుంది. ఇండ్లలో ఎలుకల బాధకూడ ఎక్కువయి పోయింది. భయమూ భీతీ లేకుండా ఎలుకలు ఎక్కడికంటే అక్కడికి జొరబడి బియ్యమూ పప్పులూ వగైరా తినివేసి పాడుచేస్తున్నాయి.

ప్రజలు కృష్ణపరమాత్మను వేడుకొని తపస్సు చేసినారు.

'కృష్ణా! ఈ ఉపద్రవం చివరకు ఊరిని మహాకాట కంలోనికి తీసుకొనిపోయి పడదోస్తుంది. ఈ ఆపదనుంచి నీవే కాపాడవలెను.' అని ప్రార్థించినారు.

కృష్ణుడు పిల్లిని పిలిచి ఉపదేశంచేసినాడు.

'ఇకపైన మీరు పాలూ, పెరుగూ, వెన్నా దొంగి లించకూడదు. అది మీకు న్యాయంకాదు. ప్రజలు కష్ట పడుతారు. ఈ దుర్మార్గం విడిచిపెట్టండి.' అన్నాడు.

ఈ ఉపదేశాన్ని పిల్లి బహు భక్తిశ్రద్ధలతో విని 'తామూ ఒకానొకప్పుడు వెన్న దొంగిలించేవారని చెప్పు తారే!' అని నెమ్మదిగా అన్నది.

'ఎవరు నీకది చెప్పింది ? అదంతా చిన్నప్పుడు చిలిపితనానికీ, తమాషాకూ చేసింది. అది మీరు అనుసరించరాదు. మీ పాటికి మీరు ఎలుకలనుపట్టి జీవిస్తూ ఉండండి. అది మీ కులధర్మం. అందులో పాపమేమీ లేదు. అర్జునుణ్ణి అడిగి చూడండి. అతనికి ఈసంగతి ఇదివరకే నేను చెప్పినాను.' అన్నాడు శ్రీకృష్ణుడు.

'ఓహో! అట్లాగా ?' అన్నది పిల్లి. 'తాము చిన్నతనంలో చేసిందీ చేస్తాము; పిమ్మట అర్జునునికి ఉపదేశించిందీ చేస్తాము ! మేము ఈ రెండూ చేసుకొంటూ వస్తాము. ఎలుకలను పట్టుకొని తింటాము. పాలూ, వెన్నా మొదలైనవి మాకు అందకుండా పెట్టమని చెప్పండి. మాకు అందనవంటే, మరి విడిచిపెట్ట వీలులేదు.' అంటూ చెప్పి పరుగెత్తిపోయి ఒక చెట్టుఎక్కి కూర్చున్నది.

కృష్ణుడు నవ్వినాడు. 'సరే. అట్లే చేయండి. అయితే, ఎక్కడపడితే అక్కడ మలమూత్రాలు విడవకండి. ఎక్కడనైనా చాటుగా విడిచి మంటితో కప్పివేస్తూ ఉండండి. తెలిసిందా ?' అన్నాడు.

'అట్లాగే !' అన్నది పిల్లి చెట్టుమీదినుంచి.

'ప్రతిదినమూ స్నానం చేస్తూ ఉండవలెను. తెలుసా ?' అన్నాడు కృష్ణుడు.

'అట్లే చేస్తాము. కాని నీళ్లుచూస్తే మాకు భయంగా ఉంటుందే !' అన్నది పిల్లి.

'దిగు కిందికి ! చెప్పుతాను.' అన్నాడు కృష్ణుడు. పిల్లి దిగివచ్చింది.

"నాలుక చాచు" అన్నాడు కృష్ణుడు. పిల్లి నాలుక చాచింది. పిల్లికి కృష్ణునిదగ్గర భయమే లేదు.

కృష్ణుడు పిల్లినాలుకను తాకి "ఇదే నీ పాలిటికి గంగ. ప్రతి దినమూ తప్పకుండా నీనాలుకతో నీ దేహాన్నంతా నాకి శుద్ధంచేసుకో" అన్నాడు. 'అట్లాగే!' అన్నది పిల్లి.

"నీకు మార్జాలం అని పేరు పెట్టినాను. ఒంటిని బాగా తోముకొని శుభ్రంగా పెట్టుకో" అన్నాడు కృష్ణుడు.

"అట్లాగే" అని చెప్పి పిల్లి తన దేహాన్ని నాకి చూపించింది. 'మార్జనం' అనగా సంస్కృతంలో తోము కొని శుభ్రం చేసుకోడానికీ, స్నానంచేయడానికీ పేరు. అందువల్లనే పిల్లికి మార్జాలం అనిపేరు.

పిల్లి తన కూననుకూడ నాకినాకి ప్రతిదినమూ స్నానం చేయిస్తుంది. తన్ను తానే నాకుకొని స్నానం చేయడంకూడ కూనకు నేర్పుతుంది. పిల్లి మిక్కిలి శుభ్రమైన ప్రాణి. కుక్కమాదిరి కాదు. అయితే ఇంటిలో పెంచినకుక్క దేనినీ దొంగిలించదు. పిల్లికి అటువంటి కట్టుబాటు లేదు, పాపం! అది దొంగిలిస్తుంది.



# 47. వీరసింహుడు

వార్ధక్యానికి వచ్చిన కాశీదేశపు రాజుకు ఇద్దరు కుమారులు. ఇద్దరూ చాలా మంచివారు. తండ్రిగారి ఆజ్ఞానుసారం ఇద్దరూ ఉదయంపూట దేవళానికి వెళ్లి, స్వామిదర్శనం చేసుకొని గంగాతీరంలో ప్రత్యేకస్థలమందు ధ్యానప్రార్థనలు యథావిధిగా జరిపి పిమ్మట ఇంటికి తిరిగి వచ్చేవారు.

ఒకనాడు జ్యేష్ఠుడు వీరసింహుడు ధ్యానంచేస్తూ ఉండగా అతనికి పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. "కుమారా! నీకేమి కావలెను? ఏమేమి ఆశపడుతున్నావో అన్నీ అడుగు. ఒకేసారిగా అడుగు. ఇస్తాను." అన్నాడు.

"యోచనచేసి చెప్పుతాను." అన్నాడు వీరసింహుడు.

"యోచన చెయ్యి. కావలసినవన్నీ అడుగు. విడిచిపెట్టినవానిని మళ్లీ అడగటానికి వీలులేదు." అన్నాడు పరమేశ్వరుడు.

వీరసింహుడు సంతుష్టాంతరంగుడై బాగా యోచించడానికని కూర్చున్నాడు. కోరికలు ఒకటివెంట ఒకటిగా తోస్తూ, ఆశకు అంతే కనబడకుండా పోయింది.

వీరసింహుడు ఎందుకు తిరిగిరాలేదని నగరులో అందరూ కలవరపడినారు. చాలా పొద్దుపోయినా అతడు తిరిగి రాలేదు.

ధ్యానంలో ఉన్నాడని తెలియగానే "వాని దగ్గరకు వెళ్లి వాని తపస్సును పాడుచేయకండి. వాడే తనంతట ధ్యానం ముగించుకొని రానీయండి." అని రాజుగారు ఉత్తరువు చేసినారు.

చిన్న రాజకుమారుడు సంపూర్ణుడు యథాప్రకారం పూజాజపాలు ముగించి తిరిగి వచ్చినాడు. అతని సమాచార మేమంటే, అతనికిన్ని మహాదేవుడు అదేరోజున దర్శనమిచ్చినాడు.

"నీకు ఏమికావలెను? కావలసినవన్నీ ఒకేసారి అడుగు." అని మహాదేవుడు చెప్పగానే అతడు వెంటనే అడిగివేసినాడు.

"మహాదేవా! ఏదీకోరని హృదయాన్ని నాకిప్పించండి." అని వరం కోరుకొన్నాడు.

"వత్సా! సంపూర్ణా! నీ అభీష్టప్రకారమే ఇచ్చినాను." అని మహాదేవుడు చెప్పి ముగించగానే, రాజకుమారుని రమణీయమైన ముఖం ఇంకా రామణీయకం వహించి, అదివర కెన్నడూలేని కాంతితో ప్రకాశించింది. హృదయం ఆనందభరిత మయింది. లేచి నగరిదారి పట్టినాడు. మహారాణి అతనిని అక్కునకు హత్తుకొని ముద్దుపెట్టుకొన్నది.

రాజుగారివద్దకు వెళ్ళి "వీరసింహుడు ఇంకా ఎందుకు రాలేదు?" అని అడిగింది రాణి.

"వానికి ధ్యానంలో బహు ఆస్థ. అది ముగియగానే తానే వస్తాడు." అన్నాడు రాజు.

చాలాసేపయినతరువాత వీరసింహుడు రాజమందిరానికి తిరిగి వచ్చినాడు. ముఖమంతా వాడిపోయి కలవరపాటుతో వచ్చినాడు. అన్నాహారాలు సయించలేదు.

ఒకనాడు, రెండునాళ్లు, మూడునాళ్లు గడచినవి. అతని యోచన ముగియనే లేదు. పరమేశ్వరుణ్ణి ఒకటి అడుగుదామనుకొంటాడు; దానివెంటనే ఇంకొకటి కావలెననిపిస్తుంది; దాని వెంట మరొకటి. ఈ విధంగా అతని యోచన తెగకుండానే సాగిపోతున్నది.

నిద్రాహారాలు, ఆటపాటలు అన్నీ విడిచిపెట్టి ఒకటే విధంగా యోచిస్తున్నాడు. రోజులు గడవను గడవను చిక్కి శల్యమైపోయి రోగిష్ఠి అయినాడు.

రాజుగారు కలవరపాటుతో మంత్రులను పిలిపించి ఆలోచించి తగినవైద్యం చేయించవలెనని తీర్మానించుకొన్నారు.

మహారాణికి కలలో వైద్యనాథుడు కనిపించి యిట్లు చెప్పినాడు—

“నీ కుమారునికి మరేమీ వ్యాధిలేదు. నేనిచ్చిన వరాన్ని గురించి యోచన చేస్తున్నాడు. అంతే.” అని వివరం తెలిపినాడు.

“అయ్యో! రాజకుమారుడు మోసపోయినాడే!” అని రాజుగారికి విషయం విశదపరచింది.

అస్వస్థతగా మంచంపట్టియున్న రాజకుమారుణ్ణి చూచి రాజుగారు “కోరికలు లేమిగదా మహాదైశ్వర్యం!

అది అడగకుండా అస్వస్థతపాలై పడిఉన్నావే!" అని బుద్ధిచెప్పినారు.

వీరసింహునికి ఇది బోధపడలేదు. ఆ అస్వస్థతలోనే అతని ఆత్మ విడుదలఅయి దేహం విడిచి వెళ్లిపోయింది.

"నీకు కావలసిం దేదో నీకు తెలియలేదు. నేను చెప్తాను రా" అని మహాదేవుడు వీరసింహుణ్ణి పిలుచుకొన్నాడు.



# 48. తిమ్మరాయడి పథకం

ఆ యేడు వేసవిపడగానే పలు ఊళ్లలో వెఱ్ఱికుక్కలు కరిచి పలువురు చనిపోయినారన్న సమాచారం తెలియగానే, ఎంగిలాకులు నాకుకొంటూ వీథులవెంబడి బతుకుపోసుకొనే కుక్కల నన్నిటినీ తుడిచిపారవేయవలసిం దంటూ ఉత్తరు వయింది.

కుక్కలను కొట్టిచంపి, కచేరీకి తెచ్చిచూపి, మగ కుక్క అయితే రెండణాలూ, ఆడదయితే మూడణాలూ బహుమానం పుచ్చుకోవచ్చునని చాటించినారు.

బీదలకూ, బతుకుదెరువులేక అల్లాడుతూఉండే అనాథులకూ ఇది ఒక ఆశకొలిపే ఆకర్షణగా ఉంటుందని తాసీల్దారు లందరికీ తెలియపరచి దండోరా వేయించినారు.

కొన్ని ఊళ్లలో కుక్కలను చంపినారు. చంపి జర జర వాటిని ఈడ్చుకొనిపోవడం కుఱ్ఱవాండ్లు చూచినారు.

వారికి ఇదేమీ సరిపోలేదు. వారి కళ్లలో జలజల నీళ్ళు కారేవి. పెద్దవారు ముఖాలు అవతలకు తిప్పుకొని ఆ విషయంగురించి యేమీ మాట్లాడకుండా వేరే ఏదయినా సంగతి ఎత్తుకొని మాట్లాడుకొనేవారు.

చాలా ఊళ్లలో కుక్కలను కొట్టి చంపడానికి ఎవరూ ముందుకు రాలేదు. ముష్టి రెండణాలకు ఆశపడి ఎవరైనా ఇంతటి పాపం కట్టుకొంటారా!

సేలంజిల్లాలో వెఱ్ఱికుక్కల ఉపద్రవం ఎక్కువ. అందువల్ల ఆ జిల్లాకలెక్టరు రెండణాలకు ఎవరూ రాకపోవడం గమనించి బహుమానపుమొత్తం పెంచినారు. ఆడ, మగ అనే వ్యత్యాసం లేకుండా ఒక్కొక్కదానికీ రూపాయి బహుమాన మిస్తామన్నారు.

ఒక రూపాయి బహుమాన మని ప్రకటన వెలువడగానే పాతకోటలోని సెందీ తిమ్మరాయుడు—కల్లంగళ్ళు వేలంపాటలో తీసుకొని ఘనమైన షావుకారైనవాడు—తన మనుష్యులను నలుగురిని పిలిచినాడు.

"అరే మునుసామీ! నేను చెప్పేది విను. సర్కారు ఉత్తరు వయింది కాబట్టి మరి పాపంలేదు. నీవు నీకు కావలసిన వారికి చెప్పి ఏర్పాటుచెయ్యి. కుక్క ఒకటికి ఎనిమిది అణాలు చొప్పున ఇప్పిస్తాను. కచేరీవ్యవహార మంతా నేను చూచుకొంటాను." అన్నాడు.

"సరే" నని ఒప్పుకొన్నాడు మునుసామి.

తక్కిన ముగ్గురూకూడ తమ తమ పేటల్లో చెప్పి కుక్కలను కొట్టడానికి జనాన్ని సేకరించినారు.

సేందీతిమ్మరాయడు తాసీల్దారును కలుసుకొని, నూరు రూపాయలు అడ్వాన్సుగా తీసుకొన్నాడు. ఒక చెత్తబండి కూడ అతని స్వాధీనం చేయబడింది. వీథిలో ఈడ్చుకొని పోవడం బాగుండదు. అందరూ అసహ్యించుకొంటారు. బండిలో వేసి తీసుకుపోయి కచేరీలో చూపి లెక్క తీర్చుకో వచ్చునని నిశ్చయించుకొన్నాడు.

తాను యాభై రూపాయలు తీసుకొన్నాడు. మిగిలిన యాభై తన ఆసాములకు పంచిపెట్టినాడు. ఆ భాగస్వాములు కుక్క ఒకటికి అయిదణాల చొప్పున కొట్టేవారికి ఇచ్చేటట్లూ, మిగిలిన మూడణాలూ తాము తీసుకొనేటట్లూ ఏర్పాటు చేసుకొన్నారు. పని ముమ్మరంగా జరిగిపోతున్నది.

ఊరిలోని కుక్కలు కుక్కలుకొట్టే ఆ కిరాతకులను బాగా కనిపెట్టివేసినవి. వారెవరితలయినా వీథిలో కన బడితేసరి, బొయ్యిమని మొరుగుకొంటూ పారిపోయి ఎక్క డయినా దాగుకొనేవి.

కాని, అయిదణాలశక్తి మహాబలిష్ఠమైన శక్తి. కుక్కలుకొట్టసిద్ధపడినవారు తమ శక్తిసామర్థ్యాలంతా కన బరచినారు. తిమ్మరాయడి ఏర్పాటు జయప్రదంగా సాగు కొంటూ వచ్చింది.

పంచాంగం కిష్టయ్యయింటిదొడ్డిలో ఒక మారు మూల ఒక వీథికుక్క పిల్లలుపెట్టింది. ఎట్లాగో వాటిని కాపాడుకొంటూ వచ్చింది. ఏ లయినప్పుడల్లా తలమరు గుగా వెళ్లి, అక్కడక్కడ ఎంగిలాకులు నాకి పొట్టపోసుకొని

వచ్చి పిల్లలకు పాలిచ్చి సాకుతూ వచ్చింది. కిష్టయ్యచిన్న బిడ్డలకు ఆ కుక్కపిల్లలను చూస్తే బలేసంతోషం. తల్లి వచ్చి పిల్లలకు పాలిచ్చేటప్పుడు వాటిని చూచి వారు పరమానందపడేవారు.

ఒకనాడు ఆ తల్లికుక్క పిల్లలకు పాలిచ్చి, ఎక్కడికో అవసరంగా పరుగున బయలుదేరింది. దొడ్డిదాటి వీథికి వచ్చిందో లేదో తలమీద ఫళీమని ఒక్కదెబ్బ వేసినాడు దుడ్డుకఱ్ఱ చేతబట్టుకొని పొంచియుండిన ఒక దాసరి. కుక్కలు కొట్టడానికి సిద్ధపడిన మనుష్యులలో వాడొకడు.

కయ్యికుయ్యి మనకుండా కుక్క ఒకేపాటున నేల గూలి ప్రాణాలు వదిలింది. దాసరికి అయిదణాలు చేతబడినవి. వాడి యజమాని మూడణాలూ, సేందీ తిమ్మరాయడు ఎనిమిదణాలూ ఆ కుక్కమీద ఒక్కదెబ్బన సంపాదించినారు.

"పరమపాపి!" అని విసుగుకొన్నది వాకిట నిలిచియుండిన కిష్టయ్యభార్య. పక్కన ఆవిడచిన్నకూతురు అమ్మచీరకొంగు పట్టుకొని దిగాలుపడి చూస్తున్నది. ఎదురింటి మిద్దెపైన ఒకకాకి కూర్చొని "కావుకావు" మని అరిచింది. "అయ్యోపాపం" అనే ఆ అరపులోని అర్థంకూడ.

రాక్షసులను గురించి మనం చదువుతాము. పశువులూ, పక్షులూ మనలనంతా ఇప్పటికీ రాక్షసులనుగా ఎంచుతున్నవో ఏమో!



# 49. ముత్యాల ముచ్చట

మనం కాపుర ముండడానికి ఇండ్లు కట్టుకొంటాము. ఇందు కొకగది, అందు కొక గది అని లెక్క పెట్టుకొంటూ, ఆయిండ్లకు సకల హంగులూ చేసుకొంటాము. ఒక్కొక్క ప్పుడు మన అదృష్ట విశేషాన్నిబట్టి ఆ యిండ్లు కట్టిన ఉద్దే శానికి విపరీతంగా జరుగుతూ ఉంటుంది. ఇండ్లు అమ్మివేయ వలసిన అవసర మేర్పడుతుంది.

సముద్రంలో పుట్టిపెరిగే కొన్ని ప్రాణిజాతులు తమ ఇండ్లను తమ దేహాలతోపాటుగానే కట్టుకొని జీవిస్తూ ఉంటవి. దేహాలు పెరిగినకొల్ల ఆ యిండ్లుకూడ పెరుగుతూ ఉంటవి. ఇండ్లూ ఒండ్లూ ఒక్కటిగానే పెరుగుతూ ఉంటవి. ఆహారం కావలసినప్పుడు వాకిలి తెరచుకొంటవి. భయం ముంచుకొని వచ్చినప్పుడు తనంతటనే మూసుకొంటవి. ఈ నత్తలే మనకు ముత్యాల నిస్తున్నవి.

ముత్యాలు ఎంత అందంగా ఉంటాయి! అందులోనూ మాలలుగా కూర్చుకొనిగాని, ఏవైనా ఆభరణాలలో పొదిగించుకొనిగాని పడతులు వాటిని ధరిస్తే అవి యింకా ఎంత అందంగా ఉంటాయి! ఎంత జిగజిగ మెరుస్తుంటాయి! అయితే ఈ ముత్యాలు శోకంలోనూ, కష్టంలోనూ పుట్టుక దాలుస్తుంటాయి.

పక్షిజంటలో ఒకటి ప్రాణాలు గోలుపోవడం పరి కించి వాల్మీకి పొందినశోకం రమ్యమైన రామాయణంగా

రూపొందింది. అట్లాగే ఈ నత్తల కష్టమూ, సంకటమూ ముచ్చటైన ముత్యాలుగా రూపొందుతున్నాయి.

నత్తయింటిలో ఏదైనా జొరబడి తొందర ఏర్పడిందంటే నత్త వెంటనే ఆ శత్రువును ఎదిరించి, దానిచుట్టూ గూడుకట్టి తనను కాపాడుకొంటుంది. నత్తలు ఇట్లు కట్టే ఆగూళ్లే కాలక్రమేణా మన మనుభవించి ఆనందించే ముత్యాలవుతాయి. మనం కట్టుకొనే ఇండ్లు వట్టి ఇటుకలూ, సిమెంటుమయం. నత్తల జీవధాతువుల నుంచి జనించే సిమెంటే మనం చూచి, ధరించి ఆనందించే ముత్యాలు. ఆ ప్రాణుల శోకసంతాప తరంగాలే వెలలేనిముత్యా లవుతున్నాయి.

ద్రౌపదిదుఃఖమూ, జానకిశోకమూ పరీక్షలే మహాభారత, రామాయణా లనే వెలలేని మంచిముత్యాలుగా పరిణమించినవి.

పిల్లలారా! అమ్మకు శోకం వచ్చినప్పుడు ఆమె కంటివెంట ముత్యాలు రాలిపడుతవి. మీరుగనుక గమనించి చూచినట్లయితే, ముత్యాల అందం ఆ కన్నీటిలోనూ చూడగలుగుతారు. అయితే ఆ కన్నీటిముత్యాలను తుడిచి వేస్తాము. కాని నత్తశోకాన్ని ఆర్చేవారు లేరు. అది ఘనీభవించి ఘనీభవించి మంచి గట్టి ముత్యమైపోతుంది.

నత్తలకు తటస్థించిన కష్టం ముత్యాలు అయిపోవడం చూచి, పేరాశ పెట్టుకొన్న మానవులు ఒకపని చేయనారంభించినారు. జీవంతోకూడ నత్తలను క్రూరంగా తెరచి,

మెల్లగా మన్నూ అపీ జొనిపి వ్యాపారానికి మాయ ముత్యాలు చేసివేస్తున్నారు.

దుఃఖంలోనూ, కష్టంలోనూ, శోకంలోనూ మనకు ముత్యాలు తయారుచేసి యిచ్చే నత్త ఎంత ఉత్తమమైన ప్రాణి అయి ఉండవలెనో ఊహించండి.



# 50. వాళప్పాడి అగ్రహారంకథ

గుణరాజచోళుని కాలంలో వాళప్పాడి అగ్రహారంలో కొంతమంది వైష్ణవులు ఒక కొత్త సంప్రదాయం ఆరంభించినారు.

"మనం భగవంతుని కొక్కనికి మాత్రమే తల యొగ్గవలెను. మనవంటిమానవుల కెవరికిగాని నమస్కారం చేయరాదు." అని ఒక తీవ్రభక్తిమార్గాన్ని వారు అవలంబించినారు. తదనుసారంగా ప్రచారంకూడ చేయజొచ్చినారు.

ఆ సంప్రదాయానికి అనమస్కారసంప్రదాయ మని పేరుపెట్టుకొని, ఆ విధంగా నడచుకొంటూ వచ్చినారు. ఈ సంప్రదాయం వారు ఎవ్వరికీ నమస్కారం చెయ్యరు. ఎంతటి పెద్దమనిషి, ఎంతటి విద్వాంసుడు, ఎంతటి అధికారి కనిపించినా దండం పెట్టరు. మొండిపట్టుగా ఇట్లాగే జరుపుకొంటూ వచ్చినారు.

అనమస్కారసంప్రదాయస్థులు ఇట్లుచేయడం చూచి, తక్కినవారు దానికి కేవలం విరుద్ధంగా ఎవరిని చూచినా

నమస్కారించడం విధి అని పూర్వోకం టే మిగుల ముమ్మరంగా ఒకరి కొకరు నమస్కారం చేసుకొంటూవచ్చినారు. ఈ కక్షియే పెద్దకక్షిగా ఉంది.

అనమస్కారసంప్రదాయస్థులు దీనిని చూచి అను వంతైనా చలించలేదు. తమవ్రతాన్ని తాము ధైర్యంగా జరుపుకొంటూ వచ్చినారు. ఇరుకక్షులకూ విరోధం ముదిరి పోయింది. ఒకరియింటికి ఒకరు భోజనాలకు పోరు. ఇచ్చి పుచ్చుకోళ్ళు కూడ మానివేసినారు. అదివరకే సంబంధ బాంధవ్యాలు చేసికొనియుండినవారు భర్త అనమస్కార సంప్రదాయస్థుడయితే భార్యకూడ అదే సంప్రదాయం అనేవిధంగా విభజన అయిపోయినారు.

రానురాను అనమస్కారసంప్రదాయస్థుల సంఖ్య ఎక్కువయిపోయింది. నమస్కారుల సంఖ్య తగ్గనారంభించింది. ఇందువల్ల ద్వేషం ఇంకా ఎక్కువయిపోయింది. "ఈ అనమస్కారులు మన బావినీళ్ళు తోడుకోరాదంటే తోడుకోరా"దని నమస్కారికక్షి తీర్మానం చేసింది.

ఊరిలో నమస్కారకక్షివా రున్న ప్రాంతమందే మంచినీటిబావి ఉంది. అందువల్ల అనమస్కారసంప్రదాయ స్థులు రాజుగారివద్దకు వెళ్ళి ఫిర్యాదు చేసినారు.

రాజుగారు విచారణచేసినారు. అనమస్కార సంప్రదాయస్థులు వ్యాజ్యంలో ఓడిపోయినారు. "మీరు ప్రత్యేకంగా ఒక బావి తవ్వించుకోండి" అని రాజుగారు తీర్పు చెప్పినారు.

అందుమీదట నమస్కారులకు ధైర్యం అధిక మైంది. ఎవరైనా ఒక అనమస్కార సంప్రదాయస్థుడు కనబడితే, ఆయన ఎంత పెద్దవాడైనప్పటికీ నమస్కారం చెయ్యడం మానివేసినారు. "ఈ మూర్ఖులకు మన మెందుకు నమస్కారం చేయవలె" నని నమస్కారికక్షి నాయకులు తీర్మానించినారు.

"ఇకపైన అనమస్కారకక్షికి చెందిన ఒకడు, అతడు ఎంత పెద్దవాడైనప్పటికీ - సంధించినప్పుడు ఎవరూ అతనికి నమస్కరించగూడ"దని ఖండితంగా తమ కక్షిలో ఒక కట్టుబాటు ఏర్పాటుచేసినారు.

అనమస్కారసంప్రదాయస్థులకు కోపం. అయితే దీనిని ఆక్షేపించడానికి వారికి ఆస్పదం లేకుండా పోయింది. ఎవ్వరికీ నమస్కారంచేయనివారు దీని నేమని ఆక్షేపిస్తారు? అందు వల్ల నమస్కారకక్షితీర్మానం బాగా అమలుజరుపబడుతూ వచ్చింది.

కొంతకాలం తర్వాత కొందరు నమస్కారులు తమ కక్షిలోనే కొందరిని సందేహిస్తూరావడం ఏర్పడింది. "వీడు అనమస్కారసంప్రదాయస్థుని ఇంటిలో తాంబూలం వేసు కొన్నాడు" అనియో, "దాహానికి మంచినీళ్ళు ఇప్పించు కొని తాగినా" డనియో సాకులుపెట్టి, వారినికూడ అనమ స్కార సంప్రదాయస్థులుగానే భావిస్తూవచ్చినారు. వారికి కూడ నమస్కారం చేయడం మానివేసినారు. కొందరు "లేదు లేదు. మే మట్లా చేయలేదు. మన్నించం" డని బతిమాలు కొన్నారు. మరికొందరు "మా పైన మోపుతున్న నేరాలు శుద్ధ అబద్ధం" అని పట్టుపట్టి కూర్చున్నారు.

ఈ విధంగా ఊరిలో రెండు కక్షులలోనూ ఒకరి కొకరు నమస్కారంచేయడం పూర్తిగా నిలిచిపోయింది. చూడడానికి అనమస్కారకక్షియే ప్రబలమై పోయినట్లుగా కనబడింది.

"ఇదే మనం కోరింది" అని అనమస్కారసంప్రదాయస్థులు విజయోత్సవం చేసుకొన్నారు.

ద్వేషం పెరిగిపోయింది. అనమస్కారకక్షికి బాగా పొగ రెక్కిందని పాతకక్షివారు తమ బహిష్కారనియమాలనూ, కట్టుబాట్లనూ ఇంకా తీవ్రంగా ఆచరణలో పెడుతూ అమలుజరుప నారంభించినారు. వయసువచ్చిన కొడుకును తండ్రి సందేహిస్తాడు. తమ్ముడు అన్నకు విరుద్ధంగా సాక్ష్యం చెప్తాతాడు. ఊరు ద్వేషమయ మయిపోయింది. అదివరకూ తలుపులుమూసి యెరగని ఆ అగ్రహారం ఒక్కసారిగా ఆ వైభవం కోలుపోయి, చీకటి ఆవరించింది. పెరళ్ళలోఉన్న కొబ్బరిచెట్లనుంచి కాయలు మాయమయిపోవడం ఆరంభించింది. పందిళ్ళలో సాయంకాలం చూచిన పొట్లకాయలు, కాకరకాయలు, చిక్కుడుకాయలు వగైరా తెల్లవారేసరికి చూస్తే కనిపించకుండా పోతున్నాయి. "ఉడుతలు తిని పోయిఉంటా" యంటుంది భార్య. "లేదు లేదు. ప్రక్కయింటి అనమస్కారిపనే ఇది" అంటాడు ఇంటి యజమాని.

"టెంకాయలు దొంగిలించే. ఈ వెధవలకు మొగంలో తిరుమణి కాపు వేరా?" అంటాడు అనమస్కార సంప్రదాయపు అయ్యంగారు.

"అట్లనకండి. ఇంటిలో జొరబడి దెబ్బలాడి దోచుకు పోతారు. అడిగేవా రెవరూ లే" రంటుంది ఆయనభార్య.

పాతకక్షివారు తమకోపావేశాన్ని అణచుకో జూచినారు. కాని సాధ్యపడలేదు.

ఒకనాటి రాత్రి అనమస్కారకక్షికి చెందిన రామానుజయ్యంగారి యింటికి నిప్పంటుకొన్నది.

ఆ యింటిచుట్టూ నమస్కారుల ఇండ్లు. ఎవ్వరూ సాయానికి రాలేదు. నిప్పు సరసర మని పాకిపోతున్నది. కొంచెంసేపటిలోనే పక్కయిల్లుకూడ తగలబడింది.

"కావలసిందే! అట్లే కావలె" నని మురిసింది అనమస్కారసంప్రదాయస్థుని యింటి శ్రీమతి వీథిలో నిలుచుని.

పది యిండ్లు కాలి బూడిదయిపోయినవి. ఆ పిమ్మట ఎట్లో నిప్పు చల్లారిపోయింది.

మరుసటి సంవత్సరం మంచి వానలు కురిసి పంటలు బాగా పండినవి. కాపులు లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నారు.

"ఈ అయ్యవార్లు ఎందుకిట్లా దెబ్బలాడుకొంటారు?" అన్నాడు ఒకడు.

"వారు ఏదోశాస్త్రవిషయాన్ని గురించి తకరారు పడిఉంటారు. మన కెందుకు దానినిగురించి?" అన్నాడు ఇంకొకడు.



# 51. చిలుక సందేహం

"సర్వేసర్వత్ర వ్యాపించియున్నాడు భగవంతుడు. వానిని ఒక విగ్రహంలోనూ, లింగంలోనూ అణచిపెట్టి మూఢులు వైష్ణవులనీ, శైవులనీ చెప్పుకొంటూ విగ్రహారాధన చేస్తున్నారే!" అన్నది ఒక కాకి.

కోవెలప్రాకారపు గోడపై కూర్చొని కాకి అన్న ఈ మాటలు విని అక్కడ ఉండిన చిలుక—

"సర్వత్రా ఉంటే, ఆ విగ్రహంలోనూ ఉన్నాడు కదా!" అన్నది.

"ఎవరో చెప్పింది విని నీవు చిలుకపలుకులు పలుకుతున్నావు" అన్నది కాకి.

చిలుకకు అవమాన మయిపోయింది. పోయి ఒక ఉడుతప్రక్కన కూర్చున్నది. ఉడుతతో తన సందేహం చెప్పుకొన్నది.

"ఆకాకి ఒక వితండవాది. దాని వాగుడు నీవు లెక్కపెట్ట వద్దు. అయితే నా కొకసందేహం." అన్నది ఉడుత.

"ఏమి టది?" అని అడిగింది చిలుక.

"దేవు డొకడా? పలువురా?" అని అడిగింది ఉడుత.

"ఒక్కడే." అన్నది చిలుక.

"దొరికిపోయినావు!" అన్నది ఉడుత.

"ఏమి? ఎట్లు?" అని భయపడిపోయి అడిగింది చిలుక.

"అదిగో! అక్కడ ఒక పిల్లి వస్తున్నది చూడు. దాని నడుగు" అన్నది ఉడుత.

"పిల్లి దగ్గరకు పోవడానికి భయంగా ఉన్నదే!" అన్నది చిలుక.

"భయపడేవానికి జ్ఞాన మెట్లు లభిస్తుంది? మెల్లగా, ధైర్యం తెచ్చుకొని వెళ్ళి అడుగు" అన్నది ఉడుత.

"మామా! నేను పిల్లి దగ్గరకు పోతే నా సందేహమూ, నా ప్రాణమూ ఒకేసారి తీరిపోతాయి. నీవే చెప్పు. నీవు ఆ రాముడికి సేతువు కట్టిపెట్టినవాడవు కదా!" అన్నది చిలుక.

ఉడుతకు బలే సంతోషం! "సరి, చెప్తాను, విను." అని ప్రవచనం చేయడానికి ఉపక్రమించింది.

"విగ్రహారాధన చేసేటట్లయితే లోకంలో ఎన్ని దేవాలయాలున్నవో అందరు దేవుళ్లు ఉన్నట్లవుతుంది కదా! ఒక్కడుగా ఉండే దేవుడు పలువురుగా అయిపోతాడు కదా! నీకు ఈ చిన్న లెక్క కూడ తెలియలేదే!" అన్నది ఉడుత.

"నేను ఒక చిలుకను. నేను ఏ బడికి పోయినాను గనక? నాకు లెక్క లెట్లు వస్తాయి?" అని చిలుక అణకువ మెణకువగా చెప్పి ఎగిరిపోయింది.

పచ్చిక నేలలో ఒక సీతాకోకచిలుక కనిపించింది. దాని చెంతకు పోయి కూర్చున్నది.

" ఓ కీటకమా ! చిన్నారి పొన్నారి కీటకమా! నీకు అన్నీ తెలుసునుకదూ! " అన్నది చిలుక.

"అవును! నాకు అన్నీ తెలుసును. నీకు ఏమి సందేహం ?" అని అడిగింది సీతాకోకచిలుక.

"ఒకే ఒక దేవుడు ఎట్లు అనేక దేవాలయాలలో అనేకరూపాలుగా ఉండగలుగుతాడు ? ఒకే ఒక పండు పెక్కుపండ్లు అవుతుందా ?" అన్నది చిలుక.

"చిలుకకు తెలిసిందల్లా పండ్లనుగురించి మాత్రమే!" అని చెప్పి సీతాకోకచిలుక నవ్వింది.

"నవ్వకు. నాకేమీ బోధపడలేదు. నా సందేహం తలను చీల్చివేస్తున్నది. కొంచెం చెప్పవూ! నీకు అన్నీ తెలుసునుగదూ!" అన్నది చిలుక.

" ఓ చిలుకా! అదిగో చూడు, పైన ఏమి కని పిస్తున్నది?" అని అడిగింది సీతాకోకచిలుక.

"పైన బ్రహ్మాండజ్యోతివలె సూర్యుడు కనబడు తున్నాడు."అన్నది చిలుక.

"దిగువ చూడు. ఆ చెట్టుఅడుగున ఏమి కనబడు తున్నది ? " అని అడిగింది సీతాకోకచిలుక.

అచ్చం బడిపంతులులాగానే ఆ సీతాకోకచిలుక మాట్లాడింది. చిలుకకూడ అచ్చం బడిపిల్లకాయవలెనే భయపడుతూ భయపడుతూ, అణకువ మెణకువగా ప్రశ్న లన్నిటికీ జవాబులు చెప్పుతూ వచ్చింది.

"ఆకుల నీడలూ, వాటిమధ్య ఎండచుక్కలూ కనబడుతున్నవి." అన్నది.

"ఆ యెండచుక్కలు నేలమీందికి ఎక్కడనుంచి వచ్చినవి?" అని అడిగింది సీతాకోకచిలుక.

"సూర్యునినుంచి" అని చెప్పింది చిలుక.

"చూడు, ఇప్పుడు వాటిని ఎంచుతాను." అని చెప్పి సీతాకోకచిలుక ఎగిరి ఎగిరి వెళ్ళి ఆ యెండచుక్కలమీంద కూర్చొని 'ఒకటి, రెండు, మూండు' అని నూట యెనిమిది వరకూ ఎంచింది.

"తెలిసిపోయింది. విషయం గ్రహించినాను. ఒకే సూర్యుడు క్రింద నీడలో నూటయెనిమిది అయినాడు." అన్నది చిలుక.

"నూటయెనిమిదీ అవుతాడు. వెయ్యిన్నీ ఎనిమిదీ అవుతాడు. చెట్టులో ఆకులమధ్య ఎన్ని సందులున్నవో అన్నీ అవుతాడు. ఒక్కొక్కనికి ఒక్కొక్క దేవుడు. ఒక్కొక్క దేవాలయంలో ఒక్కొక్క దేవుడు. ఎట్లు ధ్యానించువారికి అట్లుగా కోటిదైవాలూ అవుతాడు ఒకే భగవంతుడు." అని చెప్పి సీతాకోకచిలుక తన ప్రవచనం ముగించి, తన దారిని తాను ఎగిరిపోయింది. చిలుక అపరిమితాశ్చర్యం చెందింది. ఎవ్వరికీ ఒక్క చెరుపూ చేయకుండా పువ్వుపువ్వుకూ వెళ్ళి, మెల్లమెల్లగా తేనె పీల్చుకొంటూనే వెళ్ళే ప్రాణికదా సీతాకోక చిలుక! కనుకనే దాని కింత జ్ఞానం ఏర్పడింది.

"నేనేకదా పువ్వులో తేనెగా ఉంటున్నాను! నన్ను తాగిన కీటకానికి జ్ఞానం ఉండడంలో ఆశ్చర్య మేమిటి?"

అని కృష్ణపరమాత్మ చిలుకకు చేరువగా వచ్చి, చెవిలో చెప్పినాడు.

"ఉన్నది నేనొక్కడనే. ధ్యానించి దర్శించేవారికి తగ్గట్లు అనేక మవుతాను." అని కృష్ణపరమాత్మ చిలుకకు చెప్పినాడు. చిలుకసందేహం తీరిపోయింది.



# 52. సహవాసదోషం

"ఆనాడు పాలకడలిలో మథించి తీసిన అమృతంతో సమానం నేను." అని పొయ్యిమీద గిన్నెలో కాగుతూ ఉండిన పాలు అన్నవి.

అది విన్న పార్వతీపరమేశ్వరులకు ఈ విధంగా సంభాషణ జరిగింది :

పరమేశ్వరుడు:-ప్రియా! ఆ పాలకు ఎంత గర్వమో చూ స్తివా?

పార్వతి:-పాలనుగురించి లోపా లెన్ని తే మన నంది కోపగించుకొంటాడు. మెల్లగా చెప్పండి.

పొయ్యిమీద పాలు వేడెక్కి పొంగిపోయినవి. మిక్కిలి సంతోషంగా పొంగినవి. ఇల్లాలు గిన్నెదించి ఒక పక్కగా పెట్టింది.

*　　*　　*　　*

"ఏమంటావు? నీవూ, నేనూ కలిసి ఈ పాలను మోసగించి ఆడుకొందామా?" అన్నాడు కృష్ణుడు.

"ఓ. అట్లాగే" అన్నది మజ్జిగ.

"నీవు కుండమజ్జిగగా రావద్దు. ఒక చుక్క చాలు." అని చెప్పినాడు కృష్ణుడు.

*   *   *   *

ఒకే ఒక మజ్జిగచుక్క చక్కని చీరకట్టుకొని, చిన్నారి గొల్లభామగా బయలుదేరింది.

పూర్వం వామనమూర్తి బలిచక్రవర్తివద్దకు వెళ్ళి, ఆయనను వంచించినట్లుగా, మోసంచేసి పాలగర్వాన్ని అణచడానికై మజ్జిగచుక్క మహోత్సాహంతో వెళ్ళింది.

"సోదరా! క్షీరమా! నీవూ, నేనూ ఒకే జాతి కదూ! మనం కలసిమెలసి జీవిద్దాం." అని మజ్జిగ పాలతో చెప్పింది— అభిమానం మహా ఉట్టిపడుతున్నట్లుగా.

మజ్జిగ తెల్లగా, లక్షణంగా ఉండడం పాలు చూచింది. సరే నని ఒప్పుకొన్నది. మజ్జిగను ఆదరంగా ఆహ్వానించి ఆలింగనం చేసుకొన్నది.

"అబ్బ! చాలా వెచ్చగా ఉన్నావు!" అన్నది మజ్జిగ.

"దానికేమిలే! కొంచెం సేపు ఓర్చుకొనియుండు. నేను చల్లబడిపోతాను. ఇప్పుడే పొయ్యిమీదనుంచి దిగినాను మరి!" అని చెప్పి పాలు బహు శీఘ్రుంగానే తన వేడిమిని తగ్గించుకొన్నది.

*   *   *   *

పాపం! మజ్జిగను తాకిన ఆ పాలగతిని మరుసటి రోజుకల్లా ఏమని చెప్పను! ఒకే గడ్డపెరు గయిపోయింది. నోరు తెరచి మాట్లాడడానికిగూడ సాధ్యపడ లేదు.

"అయ్యో! పాపం!" అన్నది పరమేశ్వరి.

"పాలగర్వం అణగిపోయింది. చెడ్డసహవాసానికి ఫలిత మింతే. ఒక చుక్క మజ్జిగ చాలు, కుండెడుపాలనూ చెడగొట్టడానికి." అన్నాడు మహాదేవుడు.

"పాలను మజ్జిగ చెడగొట్టడ మెందుకు? పాలే మజ్జిగను మంచిదారిలో తీసుకొనిపోగూడదూ? కుండెడుపాలు ఒక చుక్క మజ్జిగను గెలువ నిచ్చిందే!" అన్నది పరమేశ్వరి.

"ఇది అంతా ఆ కృష్ణుని పనే! ఆయనలీలలకు అంతే లేదు." అన్నాడు పరమేశ్వరుడు.

"కృష్ణుడు వేరు, మీరు వేరా?" అన్నది పార్వతి.

"నేనూ కృష్ణుడూ ఒకటా, వేరా? అన్న ఆ రహస్యాన్నిగురించి తర్వాత నందిని అడుగు చెప్తాడు." అని వేరే ప్రసంగానికి లాగుకొనిపోయినాడు పరమేశ్వరుడు.

"ఈ పాలకు విమోచన మేమైనా ఉన్నదా, లేదా?" అన్నది పార్వతి.

"ఏమీ చెడిపోలేదు. పాలవలెనే పెరుగుకూడ అమృతమే! గర్వం మాత్రమే అణగింది." అన్నాడు పరమేశ్వరుడు.

*  *  *  *

"వేడుకకుగూడ చెడ్డవారితో చేరగూడదు."
అన్నాడు కృష్ణుడు కామధేనువుతో.

"అంతా చూచినాను. పాలను జాగ్రత్తగా కాపాడ వలెను." అన్నది కామధేనువు.



# 53. నేర్చుకొని రా!

"ఇవ్వడంలో సంతోషమా? పుచ్చుకోవడంలో సంతోషమా?" అని అడిగినాడు ఋషి.

ఒక బీదయువతి లేచి మాట్లాడింది.— "స్వామీ! బిడ్డకు పాలిచ్చేటప్పుడే నేను ఎక్కువ సంతోష మనుభవించి నాను. ఆకలిగొని నేను అన్నం తిన్నప్పుడు అంత సంతోషం నాకు కనబడలేదు. పిమ్మట చంటిబిడ్డను ఎత్తుకొని పాలిచ్చి నప్పుడు నా కెంతో ఆనందంగా ఉంది." అని ఆవిడ తన అనుభవం చెప్పింది.

తరువాత మరొకమహిళామణి లేచి మాట్లాడింది. "నేను ఇంటిలో వంటవండి ఇంటిలోనివారి కందరికీ వడ్డించి నప్పుడు పొందిన సంతోషం మళ్లీ నేను ఒంటరిగా కూర్చొని భోజనం చేసినప్పుడు పొందలేదు." అని స్వానుభవం వెల్ల డించింది.

అటుపిమ్మట ఒక శెట్టిగారు లేచినారు. "స్వామీ! ఈ యిద్దరమ్మల అనుభవాలవలెనే నేనుకూడ నిజం కను గొన్నాను. నేను బాగా సంపాదించి డబ్బుచేరుస్తూవచ్చిన

రోజుల్లో తృప్తిగాని, సంతోషంగాని, సుఖంగాని ఎరగనే మెరగను. చివరకు ఊరివారికి ధర్మం చెయ్యడ మారంభించి నాను. బీదల కివ్వడం మొదలుపెట్టినాను. వారు నాచుట్టూ చుట్టుకొనిసంతోషపడినారే—అప్పుడే నేను నిజంగా సంతోష మనుభవించినాను. ఆనందం పొందినాను.'' అని ఆయన అనుభవం ఆయన చెప్పినాడు.

''వీరి అనుభవాలవల్ల మన మీనాడు జ్ఞానం సంపాదించినా'' మన్నాడు ఋషి.

* * * *

ధర్మపురిలో ఒక బ్రాహ్మణుడు ప్రతిదినమూ వేకువ జామునవే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, భిక్షాపాత్ర చంకకు తగిలించుకొని, వేదమంత్రాలు వల్లిస్తూ ఉపాదానానికై అగ్రహారంలో ఇంటింటికీ వెళ్లుతూ ఉంటాడు.

ఈ వైదీకిపట్ల అందరికీ చాలా ప్రీతి. ఇంటిముంగిట అడుగు పెట్టీ పెట్టకముందే బియ్యం తెచ్చి వేస్తారు. ఆ బ్రాహ్మణుడుకూడ మనసారా ఆశీర్వదించి వెళ్ళిపోతూ ఉంటాడు. బీదలూ, ధనవంతులూ అందరూ ఒకే విధంగా భిక్ష వేస్తూ ఉంటారు. ఆయనకూడ అందరినీ ఒకే విధంగా ఆశీర్వదిస్తూ ఉంటాడు.

భట్టాచారిభార్య తన ముద్దులకుమారుడు కేశవుణ్ణి తీసుకొని భిక్ష వేయడానికి పోతుంది. తానేవేస్తే ఆ పుణ్యాం తనతోనే పోతుంది. కుఱ్ఱవానికికూడ ఆ పుణ్యాం చేరవలె నని కుమారునితోపాటుగా భిక్షవేయడానికి పోతుంది. వాని

చేతనే వేయించి, వేసినతర్వాత "వేసినావా?" అని అడిగి కేశవుణ్ణి ముద్దుపెట్టుకొంటుంది.

"అమ్మా! ఈదినం ఉపాదానం నేను వేస్తానే!" అంటూ కేశవుని చెల్లెలు - పసిబిడ్డ లక్ష్మికూడ ఒక్కొక్క నాడు అమ్మ నడిగి ఉపాదానం వేస్తూ వుంటుంది.

పక్కన కేశవుడు నిలుచుని "వెయ్యి. కిందచల్లకుండా జాగ్రత్తగా వెయ్యి" అంటూ ఉంటాడు.

బిడ్డలు ఏదైనా తినేటప్పుడు ఇతరపిల్లలెవరైనా పక్కన నిలిస్తే మొదట వారికి కొంత యిచ్చి పిమ్మట తాము తింటూఉంటారు. అందరూ సమానంగా సంతోష మనుభవిస్తూ భోజనం చేస్తూ ఉంటారు. ఈ విధంగానే బిడ్డలు మంచి పద్ధతిగా, మంచి పెంపకంలో పెరుగుతూ వచ్చినారు.

పక్కయింటి శారదాంబ - రాఘవయ్యభార్య (వారు కొంచెం సంపన్నులే) కూడ తన కుమారునిచేతనే ఉపాదానం వేయిస్తూ ఉంటుంది. కారణం తెలుసునా?

ఉపాదానం వేసేటప్పుడు రెండుచేతుల నిండా బియ్యం తీసుకొనివచ్చి వేయవలె నని శాస్త్రం. శారదాంబ "నా చేతిమీదుగానే ఉపాదానంవేస్తే బియ్యం ఎక్కువగా ఖర్చవుతాయి; కుఱ్ఱవాడు వేస్తే శాస్త్రానికి శాస్త్రప్రకారంగానూ వేసినట్టవుతుంది. బియ్యంఖర్చూ ఆట్టే ఉండ"దని పక్కయింటి అలవాటును తానూ అనుసరించింది.

* * * *

యముడు:- శారదాంబా! ఏల నీవు కుబ్జవాడిచేత ఉపాదానం వేయిస్తూ వచ్చినావు?

శారదాంబ :- పక్కయింటి భట్టాచారిభార్యకూడ అక్షింతలు చేస్తూవచ్చింది? అదే ప్రకారం నేనూ చేసినాను.

యముడు నవ్వినాడు. "పో, మళ్ళీపోయి సరిగా భిక్ష వేయడం నేర్చుకొని, పిమ్మట ఇక్కడికి రా." అంటూ ఆవిడను మళ్ళీ భూలోకానికి పంపించినాడు.



# 54. ముద్దుల బిడ్డడు

డిప్టీకలెక్టరు రామకృష్ణరావుభార్యకు చీమలంటే సరిపడదు. చీమలు కనబడితేసరి నలిపివేస్తుంది.

'అమ్మా! చీమలను చంపవచ్చునా?' అన్నాడు గోపి.

'కరిచే చీమలను చంపవచ్చు' నని చెప్పింది తల్లి.

గోపికి 'కుప్పు' అని అసలుపేరు. వానికి ముందు పుట్టిన ముగ్గురుబిడ్డలూ పుట్టినవారు పుట్టినట్లుగా చచ్చిపోయినారు. అందువల్ల గోపి చాలా గారాబంగా పెరిగినాడు. 'కుప్పు' అని వానికి పేరు ఎందుకు పెట్టినారో తెలుసునా? ఏ దయినా ఒక కుటుంబంలో బిడ్డలు పుట్టిపుట్టి చచ్చిపోతూ ఉన్నట్లయితే పిమ్మట పుట్టిన బిడ్డను తమకు వద్దని కుప్పలో వేసినట్లుగా వేసి, తీసుకొంటారు. ఇది ఒక పీడా పరిహారంగా చేస్తారు. ఇట్లుచేస్తే యముడు పొరపాటున పోతాడు; వద్దని పారవేసిన బిడ్డవద్దకు ఆయన రాడని తల్లి

దంస్రులు పూర్వం ఇట్లా చేస్తూవచ్చినారు. అట్లు కుప్పలో పారవేసి తీసిన బిడ్డలకు 'కుప్ప' అని పేరుకూడ పెట్టేవారు. అదేవిధంగానే డిప్టీకలెక్టరు రామకృష్ణరావుగారి కుమారునికిగూడ ఆపేరు పెట్టినారు.

కరిచే చీమలను చంపవచ్చునని తల్లి చెప్పిన ధర్మాన్ని ఒప్పుకొని, గోపి ఆడుకోవడానికి పోయినాడు.

'నా బిడ్డల నెవరో చంపుతున్నారు. బయటికి పోయిన వారు మళ్ళీ తిరిగిరావడమే లేదు. సంగతి కనిపెట్టండి' అని తల్లిచీమ తన బంటుచీమలను పంపింది.

పుట్టనుంచి బయలుదేరి ఆ చీమలు తమ కులవాసనను మూచూచుకొంటూ మూచూచుకొంటూనే వెళ్ళి అక్కడక్కడ వెదకిచూచినవి. చివరకు డిప్టీకలెక్టరు ఇంటిలోనే తమ తమ్ములు మరణించినట్లు కనుగొన్నవి. ఎవరు చంపిందీకూడ తెలుసుకొన్నవి. అన్నీ మూచూచి మూచూచి తెలుసుకొన్నవి. తిరిగివెళ్ళి తల్లిచీమకు సంగతి అంతా తెలియజెప్పినవి.

'నాయనా! చీమలను చంపవచ్చునా?' అని గోపి తండ్రి నడిగినాడు. వానికి మళ్ళీ సందేహం వచ్చింది.

'నీవు చంపగూడదు. బంట్రోతుకు చెప్పితే వాడు చంపివేస్తాడు.' అన్నాడు తండ్రి.

'చంపితే పాపం లేదా?' అని అబ్బాయి అడిగినాడు.

'మనం చెప్పినందువల్లగదా బంట్రోతు చంపుతాడు! వానికి పాపం లేదు.' అన్నాడు తండ్రి.

'మనకు పాపమా?' అన్నాడు అబ్బాయి.

'మనం చంపలేదే! మన కెందుకు పాపం?' అన్నాడు డిప్టీకలెక్టరు.

'మనం చెప్పినందువల్లగదా—' అని అబ్బాయి ఏమో చెప్ప నారంభించినాడు. అంతలోనే-

'సరి, నీవు వెళ్ళి, వంటయిందేమో అమ్మను అడిగిరా' అని వానిని పంపివేసినాడు తండ్రి.

తల్లిచీమ వెళ్ళి, ఆ చెంతనే యుండిన పుట్టలోని తన స్నేహితుడు నాగుబాముతో తనగోడు చెప్పుకొని ఏడ్చింది.

'నా బిడ్డలను ఆ సుబ్బమ్మ చంపివేసిందన్నా! నీవే ఆయమను దండించవలె' నని మొఱపెట్టుకొన్నది.

'సరి, చూస్తానులే' అని చెప్పి పాము వెళ్ళిపోయింది. రామకృష్ణరావు ఇంటి పెరటిలో ఒక కన్నం చూచుకొని, అందులో దూరుకొన్నది.

'అమ్మా! పాముకరిస్తే చచ్చిపోతామంటాడే రాము, అది నిజమా?' అని గోపి అమ్మ నడిగినాడు.

'చచ్చిపోయే పాడుమాటలన్నీ ఎవరు నీకు చెప్పింది? పాము మనలను కరవదు.' అన్నది తల్లి.

'కరిస్తే?' అన్నాడు గోపి.

'అది విషం. పాము ఎవరినైనా కరిస్తే వాడు చచ్చిపోవడం నిజం. పాముదగ్గరకు పోరాదు.' అని చెప్పింది సుబ్బమ్మ.

'అమ్మా! మనయింటిలో పాము ఉన్నదటనే?' అన్నాడు గోపి.

'ఎవరు నీకు చెప్పింది? ఆ వెధవ రాముడేనా?' అన్నది.

'కాదమ్మా! పక్కయింటి శేషు చెప్పినాడు. వాడు చూచినాడట.' అన్నాడు గోపి.

'శేషు చిలిపివాడులే! నీవు పోయి ఆడుకో.' అన్నది.

ఆ రాత్రి సుబ్బమ్మకు కలవచ్చింది. తన ఏకైక కుమారుడు గోపిని పాముకరిచినట్లూ, వాడు చచ్చిపోయినట్లూ ఆవిడ కలగాంచింది. 'ఓ!' అని అరచుకొంటూ లేచింది. ఏమి టేమి టని రామకృష్ణరావుగారు అదరిపడిలేచి అడిగినారు.

'పాడుకల ఒకటి వచ్చింది.' అని సుబ్బమ్మ దాని వివరం ఆయనకు చెప్పింది. తెల్లవారగానే గుడికి వెళ్లి, దేవుడికి మ్రొక్కుకొని అర్చన చేసి, ప్రసాదం పుచ్చుకొనివచ్చింది. ఆ పగలంతా భయపడుతూ భయపడుతూనే గడిపింది. అమిత మైన వేదన అనుభవించింది.

దాగుకొని యుండిన పాము మంచిపాము. సుబ్బమ్మ వేదనపడడం అది చూచింది. 'కొడుకు మరణించిన దుఃఖాన్ని ఈవిడ పూర్తిగా అనుభవించింది. చాలు ఈ శిక్ష. పైగా మరుజన్మలో ఈవిడ ఒక తల్లిచీమగా పుట్టబోతున్నది. తన బిడ్డలను పోగొట్టుకొంటుంది.' అని పాము అక్కడ నుండి వెళ్లిపోయింది.

'నాకు ఆ పిల్లవాణ్ణి కరవడానికి మనస్సురాలేదమ్మా!' అని తల్లిచీమకు చెప్పింది. కారణంకూడ తెలియజేసింది.

'అయితే, నాచీమ లేపోయి, ఏమయినా చేసిరావలెను. వానిని బాగా కరిచివస్తేనే నా దుఃఖం కాస్తయినా తగ్గుతుంది.' అన్నది తల్లిచీమ.

తన క్షత్రియకూటాన్ని పంపించింది. చీమల్లో ఒక్కొక్క పనికీ ఒక్కొక్కజట్టు ఉంటుంది.

'అమ్మా! రాత్రి నన్ను చీమలు చాలా కరిచిపెట్టినవే!' అన్నాడు గోపి. పిల్లవాని ముఖం బాగా ఉబ్బిపోయింది.

'అవునే నాయనా! ఎంత బాధపడుతున్నావో, దా' అని దగ్గరకుదీసి కొబ్బరినూనెరాచి 'పోసి! నేను కన్నకల ఇంతతో పోసి' అని మళ్ళీ గుడికిపోయి గణపతికి ఒక టెంకాయ కొట్టివచ్చింది.

ఆ తర్వాత సుబ్బమ్మ చీమలను ఎన్నడూ చంపలేదు. బెల్లం, నెయ్యి మొదలయిన పదార్థాలను చీమలకు అందకుండా మూతలుపెట్టి, భద్రపరుస్తూ వచ్చింది. ఇంటిని శుభ్రంగా ఉంచే ఏర్పాటుకూడ చేసింది. చీమలూ మరి ఆ యింటిచాయలకు వెళ్ళలేదు.



# 55. డ్రిల్లు మాష్టరు

బాలచంద్రుడికి బెల్లమంటే చాలా ఇష్టం. బెల్లంతో చేసిన వస్తువులు దొరికితే మరి విడువడు.

వైద్యులు వాని దేహస్థితిని పరీక్షించి 'వీని ఒళ్లు చెడిపోయింది. వీడు తీపివస్తువులు తినగూడదు.' అన్నారు.

వానికో ఈ పథ్యం సరిపడలేదు. ఎట్లాగో బెల్లమూ చక్కెరవస్తువులు సంపాదించి తింటూనే ఉండేవాడు. తల్లి దండ్రులు ఇది ఆపలేకపోయినారు.

'ఇందుకేమి చేద్దాం? నా ముద్దులనాయన మళ్ళీ ఏమైపోతాడోనే!' అని తల్లి ఏడ్చింది.

తండ్రికి దారియేదీ తోచలేదు. కుంభకోణానికి వెళ్లి శంకరాచార్యస్వామిని అడిగినాడు.

వారు చెప్పినారు: 'పిల్లవానిని తీసుకొనిపోయి ఒక మిఠాయిదుకాణంలో కూర్చోబెట్టు. ఎంతకావలెనో అంత తిననీ.'

ఈ సలహా పిల్లవానితండ్రికి ఆశ్చర్యం కలిగింది. భార్యతో ఆలోచించినాడు.

'ఎట్లాగయినా వారు మనకు గురువులు. కాబట్టి వారు చెప్పినట్లే చేద్దాం. మనస్నేహితుడు రామ్‌లాల్ లేడూ, ఆయనఅంగడిలో విడిచిపెడదాం.' అని చెప్పింది పిల్లవాడితల్లి.

బాలచంద్రుణ్ణి రామ్‌లాల్ మిఠాయిదుకాణంలో పనివానిగా చేర్చినారు. జీతం లేదు. ఎంతకావలసినా,

ఏ మిఠాయి కావలసినా తీసుకొని తినవచ్చు' నని దుకాణ దారు ఉత్తరు విచ్చినాడు.

బాలచంద్రుడు పరమానందపడినాడు. నాలుగు వేళలా కడుపునిండా చక్కెరమిఠాయిలు తింటూవచ్చినాడు. పనిలోచేరిన ఐదవరోజు పిల్లవానికి భేదు లారంభ మైనవి. అన్నాహారములు కాబట్టలేదు. మిఠాయి తలచుకొంటేసరి వానికి కడుపులో కలియబెట్టిన ట్లవుతుంది. మూడురోజులు అవస్థపడి పోయినాడు. పిమ్మట ఏలాగో భేదులు కట్టినవి. కాని, అది మొదలుకొని బాలచంద్రునికి తీపివస్తువు లంటే వాంతికి వస్తుంది. వాటిపైన పూర్తిగా అసహ్యాం పుట్టింది. ఒళ్లు బాగయిపోయింది. 'మిఠాయిదుకాణంలో నాకు పనివద్దు నాయనా!' అని తండ్రితో చెప్పుకున్నాడు.

బాలచంద్రుణ్ణి వెంటబెట్టుకొని తలిదండ్రు లిద్దరూ కుంభకోణానికి వెళ్ళి, ఆచార్యస్వాములవద్ద సాష్టాంగపడి నమస్కారం చేసినారు. 'పిల్లవానికి ఆరోగ్యం కుదిరింది. మీ ఆశీర్వాదం'! అని చెప్పుకొన్నారు.

ఆచార్యస్వాములు బాలచంద్రుణ్ణి ఆశీర్వదించి పంపినారు.

బాలచంద్రు డిప్పుడు మధురపాఠశాలలో డ్రిల్లు మాస్టరు. మనిషి కండలుదేరి గుండుమాదిరిగా ఉన్నాడు. విద్యార్థులుకూడ వానియెడల ప్రేమాభిమానాలతో ఉన్నారు. వాడు ఎవరినీ తిట్టడు. అంతా తానే చేసిచూపిస్తాడు.



# 56. దేవీకటాక్షం

కారెంపూడి జమీందారు మహాంకాళిదాసుడు మానవదేహం వదిలిపెట్టి దివికి వెళ్లినాడు. అక్కడ కాళి కామ్మవారి పాదాలమీద బడినాడు.

'అమ్మా! మహాదేవీ! నేను మహాపాపాలు చేసినాను. కోపమూ, ద్వేషమూ నన్ను భ్రమ పెట్టినవి. నేను పాప కూపంలో పడిపోయినాను. నా వంశమయినా మంచిదారిన బ్రతికేటట్లు అనుగ్రహించు తల్లీ!' అని ఏడ్చినాడు.

'అట్లాగే.' అన్నది దేవి నవ్వుతూ.

'నే నిక్కడనే ఉండిపోవచ్చునా?' అని అడిగినాడు.

'నీవు కొన్నాళ్లు నీ మనుమల యింటిలో కుక్కగా పెరిగి యోగ్యతగా ఉండి పిమ్మట ఇక్కడికి రావచ్చును. నీ హృదయం అందువల్ల శుద్ధి పొందుతుంది. పో' అన్నది పరమేశ్వరి.

జమీందారు పూర్వచరిత్రను చెప్తాను. దుఃఖమూ, భయమూ కలిగించే కథలు పతితల మనస్సులను శుద్ధపరుస్తాయి. చింతపండూ బూడిదా వేసి రాగిచెంబును శుద్ధిచేయడం లేదూ మనం?

*   *   *   *

కారెంపూడి జమిందారు తన ఏకైకకుమార్తె అయిన కోమలవల్లిని రెడ్డియూరు రాజప్పకిచ్చి పెండ్లి చేసినాడు. ఆ కుటుంబం తమకు పరంపర విరోధి. అయినా ఏదో ఒక కారణంచేత ఇట్లు చేసినాడు.

పాతపగ మళ్ళీ చిగిరించి ముదిరిపోతూ వచ్చింది. రాజప్పగర్వం ఎక్కువయిపోయింది.

ఒకనాడు పదిమంది మనుష్యులను కవ్వించి విడిచి, రాజప్పగర్వం బాగా అణచిరమ్మని పంపినాడు జమీందారు. జమీందారుమాటప్రకారం వారు వెళ్ళినారు.

అంతలో అక్కడ రాజప్పమనుష్యులుగూడ గుమిగూడి యుండినారు. యుద్ధం పెద్దదయిపోయింది. జమీందారు స్వయంగా వెళ్ళి తమ మనుష్యులను ఉత్సాహపరుస్తూ జగడం నడిపించినారు. రాజప్ప రెండుకాళ్లూ విరిగి వాడు కింద బడిపోయినాడు. యుద్ధం ముగిసింది. జమీందారు విజయంతో వీటికి వచ్చేసినాడు.

కూతురు తండ్రియిల్లు చేరుకొన్నది. రాజప్ప ఆస్పత్రిలో నాలుగునెల లుండినాడు. జమీందారే ఖర్చులన్నీ పెట్టుకొన్నాడు. ఎంతయినా అల్లుడుగదా! గాయాలు బాగుపరచడం సాధ్యంకాలేదు. రెండుకాళ్ళూ తెగనరికి తీసివేస్తేనేగాని లేకపోతే ప్రాణానికే ముప్పు వస్తుందన్నారు ఆస్పత్రివారు.

'ప్రాణండుంటే పసుపుకుంకుమలతోనన్నా ఉండవచ్చును. వితంతు వైనతర్వాత ఆజీవిత మేమి జీవితం?' అని కూతురు బావురుమని యేడ్చింది. శస్త్రవైద్యులు కాళ్ళు తీసివేసి స్వస్థపరచినారు. రాజప్ప బతికిపోయినాడు.

* * * *

పగ తగ్గిపోయింది.

'ఆ మనుష్యులు అంతబలంగా తాకియుండ గూడదు.' అన్నాడు జమీందారు.

'ఎదురుకక్షిబలగం మనలను బలంగా తాకినప్పుడు మనం ఊరికే ఉండవచ్చునా ?' అన్నాడు కాళప్ప. వాడే జమీందారుపరివారంలో ముఖ్యుడు.

రాజప్పకూడ వారి సంభాషణలో కలుసుకొన్నాడు. 'మామా! మీరే స్వయంగా వచ్చి 'కొట్టు', 'నరుకు' అని ఆర్భాటంజేసి వారిని ఉత్సాహపరచలేమా ?' అన్నాడు.

'జరిగిం దేదో జరిగిపోయింది. ఇప్పు డిక ఈ యింటి లోనే ఉండిపో. ఊరకనే ఉండు. దండుగతిండి తింటూ ఉండు.' అన్నాడు జమీందారు.

కూతురికి కోపంవచ్చింది. 'నాన్నగారూ! అట్లా మాట్లాడకండి. మీ దండుగతిండి మా కక్కర లేదు. నేను కూలిపనిచేసుకొని నా కుటుంబజీవనం నేను గడుపుకొంటాను' అన్నది.

జమీందారుగారి కూతురు కూలిపనిచేస్తే ఊరివారు నవ్విపోరూ? అందువల్ల జమిందారు తమ వైఖరి మార్చు కొన్నాడు. అల్లుణ్ణి కొన్నాళ్ళు గౌరవంగా చూస్తూ వచ్చినాడు. కూతురికి కోపం రాకుండా నడచుకొన్నాడు.

అయితే ఈ కృత్రిమవైఖరి ఎన్నాళ్ళు సాగగలదు ? జమిందారు కఠినుడు.

'ఈ అల్లుణ్ణి ఎట్లాగైనా హతమార్చవలె' నని నిశ్చ యించుకొన్నాడు. కూతురుదగ్గర చెప్పడానికి భయపడి

నాడు. అయినా ఆమె కెట్లాగో తెలిసిపోయింది. ఇంటిలో వంటవాడు చెప్పివేసినాడు.

'అవును తల్లీ! పాయసంలో విషం కలిపి రాజప్ప కిమ్మని చెప్పినారు' అని రహస్యంగా కోమలవల్లితో వాడు నిజం చెప్పివేసినాడు.

'అయ్యో!' అని దుఃఖపడింది కోమలవల్లి. 'నన్ను విధవను చేయడానికి నాయనగారు కుట్రపన్నినారే' అని యేడుస్తూ, ఏమిచేయడానికీ తోచక, అమ్మవారిగుడికివెళ్ళి 'ఈశ్వరీ! నన్ను కాపాడవూ?' అని యేడ్చింది. ఈశ్వరి పథకం ఈశ్వరికి గదా తెలుసు?

ఒకనాడు జమిందారుగారు తామే అకస్మాత్తుగా చనిపోయినారు. విషం తప్పుపాత్రలో కలిసిపోయింది. రెండురోజులు కడుపునొప్పి, భరించరాని బాధా అనుభవించి 'నేను మహాపాపిని. చండాలుణ్ణి. కాళీమహాతల్లీ! నన్ను కాపాడవూ?' అంటూ ప్రాణాలు వదిలినారు.

పిమ్మట కోమలవల్లీ, మొండి రాజప్పా జమిందారు ఆస్తికి వారసులై అనుభవిస్తూ సుఖంగా ఉన్నారు.

ఆ దంపతులకు అందాలరాసులైన ముగ్గురు బిడ్డలు పుట్టినారు. పెద్దపిల్లవాని పేరు చిన్నరాజా.

తమ పూర్వీకుల చరిత్ర పిల్లలకు తెలియనీయకుండానే వారిని జాగ్రత్తగా పెంచుకొనివచ్చినారు. ఎదిగిన పిమ్మట ఎవరో చెప్పగా విని, ఆ పిల్లలు 'ఇట్లాకూడ ఉంటుందా?' అని నవ్వుకొన్నారు.

'పూర్వీకులగుణం వంశపరంపరగా వస్తుం దంటారే!' అని అడిగినాడు చిన్నరాజా. వాని కిప్పుడు పండ్రెండేండ్లు.

తల్లి కోమలవల్లి బదులుచెప్పింది. 'లేదు నాయనా! దేవి దయచూపితే తండ్రికంటే కుమారుడూ, వానికంటే మనమడూ అందరూ మంచివారుగా ఉంటారు.' అని చెప్పింది.

'నేను మంచివాణ్ణిగా ఉంటాను' అన్నాడు చిన్నరాజా.

'సరి. పొలానికి పో! అక్కడ మడి ఎట్లా దున్నుతారో చూచిరా.' అన్నాడు రాజప్ప.

'బ్లాకీ! రా!' అని పిలవంగానే కాటుకనలుపుగల ఒక చక్కనికుక్క తోక ఆడించుకొంటూ తోటనుంచి పరుగున వచ్చి చిన్నరాజాచెంత చేరింది.

'పోదాం, రా! పొలానికి పోదాం, నడు.' అన్నాడు కుఱ్ఱవాడు.

'బ్లాకీ' ముందు పరుగుతీసింది. చిన్నరాజా వెనుక వెళ్ళినాడు.

ఆ కుక్క ఎవరో తెలుసునా? అయితే అది ఆ కుక్కకు గూడ తెలియదు. ఎవరికీ తెలియదు.

ఇప్పుడు కథ మొదలు మళ్ళీ చదవండి.



# 57. కుబ్జువాండ్లకు బోధపడుతుంది

'దేవలోకపుభాష సంస్కృతం' అన్నారు శాస్త్రి గారు.

'భగవంతుడు మాట్లాడేది అరవమే' అన్నారు కొందరు.

'సకలజగత్పతి మాట్లాడేది సర్వులకూ సాధారణ మైన హిందీభాష' అన్నారు ఉత్తరాది హిందూస్థానీలు.

కొందరు బెంగాలీలు ఇది విని నవ్వినారు.

మరాఠీవీరులు 'కానే కా' దన్నారు. 'మా మహా రాష్ట్రభాషే భగవాన్ శివాజీభాష' అని చెప్పినారు.

'ఇంగ్లీషుకదా పైలోకపుభాష!' అన్నాడు ఆంగ్లేయ ఫాదిరీ.

'ఎన్నటికీ కాదు. ఎవ్వరూ మాట్లాడని లద్దీన్ భాషే పరలోకపుభాష' అన్నాడు ఇంకొక ఫాదిరీ.

'అరే అల్లా! మీ కెవ్వరికీ నిజం తెలిసినట్లే లేదే! అరబ్బీభాషకదా అల్లా రోజూ మాట్లాడేది! కొన్ని వేళల్లో మాత్రమే వేరుభాషలు మాట్లాడుతాడు. ఖురాన్ ఏ భాషలో వెలిసింది? దానినిబట్టే మీకు తెలియలేదూ?' అని అరబ్బీమోల్వీ వాదించినాడు.

ఇంకా కొందరుకూడా ఈ వాదంలో దిగినారు. పెద్ద జగడం జరిగింది. అందరూ వెళ్ళి స్వయంగా చూచివద్దామని తీర్మానించుకొని బయలుదేరినారు.

తెర వెనుక భగవంతుడు మాట్లాడినాడు.

అక్కడినుండి కిందికి దిగేటప్పుడు ఒకరితో ఒకరు మాట్లాడుకొంటూనే దిగినారు.

'తమ్ములూ! చూచినారా? దేవుడు మాట్లాడింది అరవం' అన్నారు అరవవారు. 'మచ్చుకుకూడ ఉత్తరాది భాష సౌకర్యం లేకుండా ఎంత స్వచ్ఛంగా మాట్లాడినాడు మహానుభావుడు భగవంతుడు!' అని సంతోషిస్తూ చెప్పినారు.

'విన్నారా! భగవంతుడు మాట్లాడినభాష మన హిందీ. దీనిని బట్టిఅయినా ఈ మూఢులకు బుద్ధి వస్తుందా?' అనుకొన్నారు ఉత్తరాది హిందూస్థానీలు.

'ఆహాహా! ఈశ్వరుని నోటినుంచి వెలువడిన మరాఠీ విన్నారా?' అన్నాడు ఒకడు.

'బెంగాలీకదా పరమేశ్వరుడు మాట్లాడింది! అదే దేవభాష' అన్నారు బెంగాలీలు.

ఇట్లాగే అరబ్బీలు, ఆంగ్లేయులు, అమెరికనులు, ఫ్రెంచివారు ఇంకా ఇతర దేశస్థులూ అందరూ తమతమ భాషే దేవభాష అని మాట్లాడుకొంటూ కుతూహలంతో వెళ్ళిపోయినారు.

ఈ సంఘటనను చూస్తూఉండిన పక్షులు తమలో తాము మాట్లాడుకొన్నవి.

'ఈ మానవజాతిబుద్ధిహీనతను చూచినారా? భగవంతుడు మన పక్షిభాషనుగదా మాట్లాడినాడు?' అని అన్నవి.

'భగవంతుని చెక్కులు తెరగుండా కొంచెం కనబడ లేదూ? ఆహా! అవి ఎంత సొగసుగా ఉన్నాయి!' అని చెప్పింది ఒక చిలుక.

'ఈశ్వరుని తొండం చూచినావా?' అని అడిగింది ఒక ఏనుగు తన పెంటిని చూచి.

'తెరగుండా నాకు ఆయన అందమైన దంతాలు మాత్రమే కనబడ్డ' వని చెప్పింది పెంటియేనుగు.

'ఆహాహా! ఎంత మానస్వరూపి!' అన్నాడు ఒక మునీశ్వరుడు.

'పరమేశ్వరుని ఈ సంగీతం విన్నపిమ్మట నేరే ఏ సంగీతమూ వద్దు' అన్నాడు ఒక సంగీతవిద్వాంసుడు.

'పలువురకు పలురూపాలుగా పొడగట్టే ఈ వస్తువు, వాస్తవానికి వస్తువే కానేరదు. అది అబద్ధం.' అన్నాడు నాస్తికుడు.

'అబద్ధం కాదు. మాయ. మనకు బోధపడని ఒక వస్తువు. అన్నింటినీ మీరిన వస్తువు. దానిని తమిళులు దైవమంటారు.' అన్నాడు ఒక తమిళరచయిత నాస్తికునితో.

'ఇక్కడ మనం వాదిస్తూ అల్లరిచేయవద్దు. బీచికి వెళ్ళి మాట్లాడుదాం.' అన్నాడు నాస్తికుడు.

'దీనిని ఒక కథగా కుఱ్ఱవాండ్లకు చెప్పండి' అని ఆజ్ఞాపించినాడు వినాయకుడు.

'కుఱ్ఱవాండ్లకు బోధపడుతుందా?' అని అడిగినాను.

'ఆ మాటకు వస్తే అసలు పెద్దవాండ్లకే బోధపడదు. కుఱ్ఱవాండ్లకు బోధపడుతుంది.' అన్నాడు గణపతి.

'సరి !' అంటిని.



# 58. బండితోలిన భగవంతుడు

మానవుడుగా అవతరించిన కృష్ణపరమాత్మ అప్పుడు ఎనభయ్యేండ్ల వృద్ధు. ఊతకఱ్ఱ పట్టుకొని, మెల్ల మెల్లగా నడచుకొంటూ సముద్రతీరానికి వెళ్ళినాడు.

ఇది ఏ పురాణములోనూ లేదు. సరికొత్త కథ.

దారిలో ఒక జట్కాబండివాడు అకస్మాత్తుగా గుఱ్ఱము మారాముచేయడంతో అదిలించి, బెదిరించి చివరకు నాలుగు తగిలించి ఎంత ఆర్భాటం చేసినా దానిని అదుపుచేయలేక సతమత మవుతూ ఉండినాడు.

కృష్ణుడు వానిని చూచి 'నాయనా ! గుఱ్ఱాన్ని కొట్టవద్దు. కళ్ళెం అట్లా బిగపట్టి లాగవద్దు. తేలికగా వదిలిపెట్టి, గుఱ్ఱాన్ని తట్టి విడు.' అన్నాడు.

బండివాడికి చఱ్ఱు మన్నది. 'తాతా !' నీదారిన నీవు రికేపో. గుఱ్ఱంసమాచారం నీకేమి తెలుసు ?' అన్నాడు.

'చూచినారా ఈ ముసలివాణ్ణి ? నాకు నేర్పుతాడు గుఱ్ఱంతోలడం' అని హేళనగా అన్నాడు బండిలోనివారితో.

బండిలో ఉన్నవారు పక్కున నవ్వినారు.

'ఓ జట్కాఅబ్బీ ! ఆయన ఎవరో నీకు తెలియనేమా ?' అన్నది ఒక జోరీగ. అంతవరకూ గుఱ్ఱంమెడ

మీాద ఉన్నదల్లా అది వదిలిపెట్టి బండివాడిచెవిచెంత జేరి కూర్చొని నెమ్మదిగా మాటాడసాగింది.

'ఎవరయితే నాకేమి ?' అన్నాడు గుఱ్ఱాన్ని తిట్టుతూ కొట్టుతూ తనపని సాగిస్తూనే. బండిలో ఉన్నవా రెవరో ఆ మాట లన్నారనుకొని అత డి ట్లన్నాడు.

'మూఢా ! అర్జునునికి తేరు నడిపినవాడు, ఆయనకు గుఱ్ఱం విషయం తెలియ దంటావే నీవు !' అని అడిగింది జోరీగ జోరుగా.

'ముసలయ్యా అర్జునుని తేరు తోలిఉంటే తోలిఉండ వచ్చుగాక ! ఈ గుఱ్ఱంసమాచారం వేరు.' అన్నా డు బండివాడు.

ఈగ నవ్వింది. గుఱ్ఱంకూడ ఒకనవ్వు నవ్వింది. గుఱ్ఱానికి తెలిసిపోయింది ఆ కఱ్ఱ ఊనుకొని వచ్చినాయన భగవాన్ శ్రీకృష్ణు డని. దాని మొండితనం ఎక్కడ పోయిందో పోయింది. లేచి మెల్లగా బండిని లాగుకొని పో నారంభించింది.

అది తన కొరడామహిమ అనుకొన్నాడు బండివాడు. కృష్ణపరమాత్మప్రభావం అతని కేమి తెలుసు, పాపం! గుఱ్ఱాలకూ, ఈగలకూ, ఆవులకూ, దూడలకూ గదా కృష్ణ పరమాత్మ దర్శనమిస్తాడు ? దైవమే గతి అని ఏచింతా లేకుండా జీవితం నడిపే పశువులకూ పక్షులకూ, వేయి ఏర్పాట్లు చేసుకొని ఎంతో ముందుజాగ్రత్తతో లోక యాత్ర సాగించే మనకూ ఉన్న భేద మిదే.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B135 |
| పుస్తకం పేరు | రాజాజీ కట్టు కథలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 193 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |